# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

[ త్రైమాసిక ]

7

మే 1968

## చలం సాహిత్యా సమాలోచన సంచిక

సంపాదకుడు

వరవరరావు

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

ముఖచిత్రం : చలం

ఫోటో : © వజీర్ రహ్మాన్

ప్రతులకు

సంపాదకుడు

సృజన

జడ్చర్ల

మహబూబ్‌నగర్ జిల్లా (ఆం.ప్ర)

విడిప్రతి : ఒక రూపాయి

సంవత్సర చందా : నాలుగు రూపాయలు.

printed, published and edited by
varavararao for 'sahithee mithrulu'

Nobility, హృదయవైశాల్యము, ప్రతివారినీ ప్రేమాలింగనంలోకి తీసుకునేలోతూ, కలుషాన్నీ, లోపాన్నీ, దీనత్వాన్నీ, నిస్సహాయత్వాన్నీ అర్థం చేసుకుని ఆదరించే ఆర్ద్రిత్వమూ, ఒకరిలో కలిగాయంటే అవి ఏవో పుటకవల్లనో accident వల్లనో, ఓ trick వల్లనో, deliberate will వల్లనో కలిగేవి కావు. ధనానికీ, పదవులకీ ఆశించకపోవడం, కీర్తి సుఖాలకై దేవుల్లాడకపోవడం, అధికార ధూర్తులముందు తలవంచకపోవడం, కీర్తి అపకీర్తుల లక్ష్యం లేకపోవడం, ముందుకాలంలో తనగతి ఏం కాబోతోంది అనే యోచన లేకపోవడం, ఇలాంటి గుణాలు తలుచుకున్నంత మాత్రాన ఒక్కరోజులో తెచ్చుకునేవి కావు. నిరంతర నిర్నిద్ర, ఇంద్రియ నిగ్రహం, శమదమనియమ తీవ్ర కృషి ఫలితంగా ఈశ్వరానుగ్రహం తోడు కావడంచేతనే పరిణమించే వరాలవి. సైనిక విజయాన్ని సాధించడం, దుర్గమ పర్వతాగ్రాలనెక్కడం, ధృవాల అంతు కనుక్కోడం, ఇవన్నీ గొప్ప సాహసకృత్యాలే. కాని ఎవరికంటికి తెలియకుండా దినదినమూ నిమిషనిమిషమూ తమ అహాన్ని కోసుకుని నిత్యాగ్నిహోత్రంలో ఆహుతి చేసుకునే ఈ మహాయోగుల తీవ్ర త్యాగం ఎవరూ ఎరగనిది. పర్యవసానం వారి ముఖాల వర్చస్సులో, వారి పెదవులమీది కరుణలో, ప్రేమాశృపులుచిందే వారి నేత్రాలలో గోచరమౌతుంది. వారి చుట్టూ ఓ నిర్మల తేజోవంతమైన 'ఆరా' వెలుగుతో వుంటుంది.

—చలం.

[రఘుపతి వెంకటరత్నం నాయుడు శతజయంతి సంచిక నుండి]

# సృజన

## చలం సమాలోచన

7 మే–జులై 1968 త్రైమాసిక

# సంజాయిషీ

సృజన ఆధునిక సాహిత్య వేదికగా ఆరంభించాలని అనుకున్ననాడే తెలుగు రచయితలలో ఆ వేదికకు పునాదులు వేసిన ఆయా రచయితల సమగ్ర సాహిత్య పరిశీలన చేయాలని తలపెట్టాం. యాదృచ్ఛికంగా తిలక్, బుచ్చిబాబుల మరణాలే వారి సాహిత్య పరిశీలనకు కారణమయినవి. మన సాహిత్యానికీ, మన జీవితాలకూ వెలుగు నిచ్చి మన మధ్య బతికిఉన్న రచయితలకు కృతజ్ఞత చెప్పుకోవడం మన కనీస ధర్మం. ఆ ప్రయత్నంలోనే చలం సాహిత్య తాత్విక సమాలోచన. రచయితలు చూపిన ఉత్సాహం వల్ల చలం సృజనంతా నిండిపోయాడు. ఈ రచయితల హృదయాల్లో నిండి పోయిన చలం పాఠకుల హృదయాల్లో కూడ తొంగిచూసి మామూలు శీర్షికలన్నీ, వాగ్దానాలన్నీ ఏమైనా చేసివుంటే భంగపరచినందుకు ఆశాభంగం పొందరనుకుంటాం.

ఈ సంచికకోసం సందేశం పంపించమని చలంగారికి రాస్తే, 'సందేశం ఏమివ్వను, ఏవైనా ప్రశ్నలు అడగండి, జవాబులు చెప్తాను. జవాబుల రూపంలో కాకున్నా మ్యూజింగ్స్‌గానయినా' అని రాసారు. ఆ మాటే గొప్ప ఉత్తేజంగా ప్రశ్నలు రాసి పంపాడు నవీన్. ఆ ప్రశ్నలు చాలా exciting గా ఉన్నాయని, సంవత్సరం తర్వాత ఆయనచేత రాయించేలా చేసినవని చలంగారే అన్నారు. ఆయన ఎంత excite అయ్యాడో జవాబులే నిదర్శనం.

ఇందులోని వ్యాసాలలో కేవలం సంపత్కుమార వ్యాసం మాత్రం రచయిత అనుమతితో 'జయంతి' పత్రికనుంచి పునర్ప్రచురిస్తున్నాం.

ఈ సంచిక పుట్టుకకు కారకులయిన చలానికి, ముఖచిత్రం కోసం కోరగానే ఫోటో పంపించిన వజీర్ రహ్మాన్‌కూ, రచయితలకూ, మా ఈ ప్రయత్నానికి బలాన్నిస్తున్న పాఠకులకూ ధన్యవాదాలు...

— సాహితీ మిత్రులు

**తాజా చందాకలం :**

సామాన్యుడి మీద పడుతున్న ప్రతి భారమూ సృజనమీద పరోక్షంగా పడుతూనే వుంటుంది. ఈ నెల 15 నుంచి దారుణంగా పెరిగిన పోస్టల్ రేట్ల కారణంగా, సృజన రెండవ సంవత్సరంలో ఇప్పటికే మూడింట్లో రెండు ప్రత్యేక సంచికలు రావడం కారణంగా అనివార్యంగా సృజన సంవత్సర చందా మూడు రూపాయలనుంచి నాలుగు రూపాయలకు పెంచబడుతున్నదని చందాదారులు గమనించవలసినదిగా మనవి.

—సాహితీ మిత్రులు

# ఇది సంపాదకీయం కాదు......

అన్వేషణ జీవితానికి అర్థంగా బతికిన నిజమయిన సాధకుడు చలం. ఆయన రచనలు ఆయన అన్నట్లు ఆయన జీవిత సమరాన్ని ప్రతి బింబిస్తాయి. ఆయన తన్ను తాను సంస్కరించు కోవడానికి పడిన మథన, సూన్పృతమైన యత్నమే ఆయన సాహిత్యమంతా. ఆయన రచకుడు కావాలనికాని, సాహిత్య పీఠాధిపతో మహాకవో అనిపించుకోవాలని గాని ఎన్నడూ రచన చేయలేదు. కాంతికి ప్రసరించడం ఎంత నిసర్గమైన స్వభావమో చలానికి ఆ హృదయపు నెత్తుటిలోంచి వచ్చిన భావాలను చెప్పకుండా ఉండలేక పోవడం కూడ అంత సహజమయిన విషయం. సోక్రటీస్ ఎందుకోసం కనిపించిన వాణ్ణల్లా ప్రశ్నించాడో, షా ఎందుకోసం రాసాడో, రస్సెల్ ఎందుకోసం రాస్తున్నాడో చలం అందుకోసం రాసాడు, రాస్తున్నాడు. ఆయన సాహిత్యకుడు కాదు, సంస్కర్త, ఆయన రచనల్లో శిల్పం కన్న సంస్కరణ భావం కనిపిస్తుందన్నా, ఆయన భావాల సంగతి అట్లావుంచి, ఆయన శైలి గొప్పగా ఉంటుందన్నా, ఆయన రచనల్లో సెక్స్ తప్ప మరేమీ లేదన్నా, ఆయన రచనలన్నీ గొప్ప ఆధ్యాత్మిక అన్వేషణలో మజిలీలు అన్నా ఆయనకు బాధాలేదు, సంతోషమూ లేదు. ఆయనకే కాదు ఈ మానవ జాతికి కూడ ఇలాంటి సాహిత్య చరిత్రలూ, విమర్శలూ ఒరగ బెట్టేది ఏమీలేదు. నేను ఫలానా అని చెప్పుకుంటే నువ్వు అదికాదు అని స్థాపించడానికో, సాధించడానికో సాహిత్యంలో అవకాశం ఉన్నది—మనం కృత్రిమంగా పెంచుకున్న అనేక కొలమానాల వల్ల. నేను ఫలానా అని నేను ఎప్పుడయినా అంటేగదా, నేనేమీ కాదు, నాకేమీ కావాలనీ లేదు.' అన్నవాడి కాంక్షారాహిత్యం ముందు అన్ని గొడ్డశ్శేకాదు, అన్ని ప్రశంసలూ సిగ్గుపడి మౌనం వహించాల్సిందే. డబ్బూ స్త్రీ పట్టని వాడయినా ఎక్కడయినా మొహమాటపు జారుడుబండ మీద పడిపోతాడేమో గాని కీర్తి కూడ పట్టని మొండివాడు ఈ ప్రపంచంలో అసాధ్యుడు.

డెబ్బయి అయిదేళ్ళ క్రితం ఒక వైశాఖపూర్ణిమ రోజుపుట్టిన గుడిపాటి వెంకట చలం కలం కోర నిరంతరమూ కోరాడుతూ ఉన్నదంటే ఆయన జీవితమంతా అట్లా తనలోతాను పోరాడుతూ ఉన్నాడన్నమాట. మరి ఎక్కడ చలం తెలుగు దేశానికంతా కొత్త వెలుగునూ విలువలనూ ఇచ్చాడంటే (మనం తీసుకున్నామా అంటే లేదనే చలం సమాధానం) జీవితం వేరు, సాహిత్యం వేరు, మాటవేరు, మనస్సు వేరు, ఆదర్శం వేరు, ఆచరణ వేరు అనుకొనే దారుణమయిన భ్రమను చీల్చిన ఒకే ఒక్క తెలుగు మనిషి ఆయన. ఈ దేశంలో ఒక గొప్ప వెలుగునూ, తృప్తినీ పొంది మధనపడి, జీవిత పోరాటంలో నిరంతరం సంఘర్షణపడి ఎంతో సూనృతంగా బతికిన మనుషులు ఉండవచ్చు. కాని తమ నిజ జీవితాలలోని నిరంతర అన్వేషణ, సంఘర్షణలను, ఎప్పటి కప్పుడు ఎదుర్కొన్న సమస్యలను, సత్యాలను, సత్యాలని నమ్మిన వానిని, ఓటమిని గెలుపును, కన్నీళ్ళను, ఆనందాన్ని, అసహ్యాన్ని, ద్వేషాన్ని, కామాన్ని, సంతోషాన్ని, ప్రేమను, ఏ భావమైనా సరే సాహసంగా చెప్పిన వీరుడు చలం ఒక్కడే. సూర్య గోళం ఎంత ఇదిగా మండకపోతే ఇంత గొప్ప కాంతి ప్రసరిస్తుంది. సూర్యుణ్ణి, కాంతిని విడదీసి చూడడం ఎంత పొరపాటో చలాన్ని, జీవితాన్ని సాహిత్యాన్ని, విడదీసి చూడడమూ అంతే పొరపాటు. ఆయన రచనలన్నీ అగ్నిగుండంలా మండిన ఆయన గుండెల్లోంచి వచ్చిన వెలుగులు. ఆ తపనవల్ల కాంతిలో ఏడు రంగులు తోచినట్లుగా, ఆ శక్తి వల్ల రాత్రి వెన్నెలలు ప్రసరించినట్లుగా ఆయనలోని తర్కం వల్ల తిపనవల్ల ఆయన రచనలకు సాహిత్య గౌరవము, మరేదో మరేదో అబ్బడం అనేది చాల మామూలయిన విషయం. గాంధీజీ లోపలి శక్తి—అందరూ కుళ్ళు అనుకునే—రాజకీయాలకు కూడ ఎట్లా ఒక బలమైన నైతిక స్థాయినిచ్చిందో చలం లోపలి శక్తి 'అన్నీ అందమైన అబద్ధాలు' అనుకునే సాహిత్యానికి అట్లా ఒక అపూర్వమయిన వెలుగు నిచ్చింది. కాని కనీసం కొంతకాలం కోసమైనా గాంధీజీ జీవితం ఒక ఉద్యమానికి, ఒక ప్రయోజనానికి ఊపిరి పోసినట్లుగా చలం జీవితం (అంటే ఆయన సాహిత్యమని, ఆలోచనలని కూడ అర్థం) కాలేక పోయింది. కారణం బయటి బానిసత్వాన్ని గుర్తించడమూ సంకెళ్ళను తెంచుకోవడమూ, స్వతంత్రులము కావడమూ పెద్ద కష్టం కాదు. కారుదున్నపోతో, ఆబోతో ఒక్కసారి తల విదిలించి తలుగో, ముకుతాడో తెంపుకుంటుంది. కాని లోపలి బానిసత్వాన్ని, నైచ్యాన్ని, ప్రలోభాన్ని, అల్పత్వాన్ని బంధనాల్ని తెంచుకోవడం ఎంత కష్టం. అయితే చలం జీవితమంతా మనకేమీ సందేశమే ఇవ్వలేదా? సందేశం ఇవ్వడం ఆయన తత్త్వంలోనే లేదు. తిరుగుబాటు వేదాం

తంగా అన్వేషణ జీవిత పరమార్థంగా బతుకుతున్నా డాయన. నీ ఆకలి నీకెట్లా నిజమో, నీ ఆకలిమంట నీ కడుపుకే ఎట్లా తగుల్తుందో నీ జీవితంలోని ప్రతి విషయమూ నీ అనుభవానికే నిజంకావాలి. ఆ నిజంకావడ మనేది ఒకరుచెప్తే కావడమన్నది, పడ కటింట్లోకి పోతేనే కోరిక కలుగుతుందను కోవడం వంటిది. అలవాటువల్ల, సంప్ర దాయంవల్ల ఎన్నో కారణాల వల్ల కొన్ని విశ్వాసాలు, కొన్ని విలువలు ఏర్పడి ఉండ వచ్చుకాని ఎప్పటికప్పుడు నీ అనుభవంతో, నీ స్పందనతో, నీలోని రియల్ ఫీలింగ్‌తో ప్రతి విషయాన్నీ తేల్చుకున్నపుడు, ఒక విధంగా నిన్ను నువ్వు చీల్చుకుని చూసు కున్నప్పుడు కనిపించే నిజం, నానుడు బడ్డ నిజంకన్న భిన్నమయింది మాత్రమేకాదు, అది నీ హృదయానికి చాల దగ్గరయిందీ, నువు నమ్మదగిందీ, నడుచుకోదగిందీ. ఇవ్వాళ నీకు నీ గుండెలను కదిలించేంత సత్యంగా ఒకటి కనిపించ వచ్చు. రేపు నీ అను భవంవల్ల అది సత్యాభాస అనే విషయం తేలవచ్చు. అది కూడ స్వీకరించడానికి నీ హృదయాన్ని శుభ్రంగా కడిగివుంచు. నీకు నువ్వు నిజంగా బతకడమేలోకానికి కూడ నిజంగా బతకడం—అన్నదే చలం జీవితం ప్రతివాడికీ ఇచ్చే సందేశ మనుకుంటాను. అయితే ఇది చలం కొత్తగా చెప్పాడా, ఈ మాట ఈ దేశంలో వేదాలనుంచీ వింటు న్నదే అంటే కావచ్చు కాని మన కళ్ళముందు అట్లా బతుకుతున్నవాడు, తన నిష్ఠుర, కఠిన, నిందాపూరిత, సూనృత, సంఘటిత, సంతోష నిజ జీవితాన్ని బట్టబయలుగా పరచి ముళ్ళమీద, రాళ్ళమీద, విషసర్పాల పడగలమీద, నెత్తురుచేర్లు ప్రవహిస్తున్నా గాయాలు కోత పెడుతున్నా, ఆకర్షణలు ఆశపెడుతున్నా, ఎవరూ వెంటరాకున్నా ఒంట రిగా పయనిస్తున్నవాడు చలం అనే విషయమైనా ఈ దేశం గుర్తించిననాడు, ఈ దేశం లోని యువకులయినా వెన్నెముకలో సత్తువ, కళ్ళల్లో వెలుగు, గుండెలో సాహసం, ఆలోచనల్లో, ఆచరణలో సత్యం— (అంటే ఆ సమయానికి అది సత్యమని హృదయ పూర్వకంగా నమ్మిన సత్యం) సాధించ గలిగితే! అటువంటి జీవిత సమరానికి ఆయు ధాలు సాహసమూ, సూనృతాలేకాని, అవి పదను పెట్టుకోవడానికి చలం రచనలు నిక షోపలాలు. నమ్మింది చెప్పడము, చెప్పింది ఆచరించడము, అది సాహిత్యంలో అయితే నేమి, జీవితంలో అయితేనేమి, తప్పు అని అనుకునే మన లౌక్యదృష్టి మారనంత కాలం చలం గొప్పవాడు కాడు.

— వరవరరావు

# చలంతో ఇంటర్వ్యూ

— నవీన్



ప్ర : 1. మీకు రాయాలనే Inspiration న్ను, ప్రేరణను కల్గించిన మీ జీవితం లోని మొదటి ముఖ్య సంఘటనను గూర్చి తెలియజేస్తారా?

జ: 'రాత' అనేది నా "రాత" ఏమో ! 14 వ ఏటినుంచి ఏదో ఒకటి రాస్తోనే ఉన్నాను.

2. మీరు రాసిన మొదటి ముఖ్య రచన ఏది? అది ఏ సంవత్సరంలో రాశారు? అప్పుడు మీ వయస్సెంత? ఆ రచనను గూర్చి మీ అభిప్రాయం.

జ: శశిరేఖ : అది 1921లో రాశాను. నా వయసు 27. ఆ నవల పబ్లిషర్లకి ఓ సుప్రసిద్ధ రచయిత Editor గా ఉండేవారు.వారు ఆ నవల ని చిత్రవధచేశారు. ఈనాడు నా అభిప్రాయం ఏమని చెప్పను ?

3. మీ నిజ జీవితంలోని సంఘటనలుగాని, వ్యక్తులుగాని, మీరురాసిన కథలకి గాని, నవలలకిగాని ఆధారాలైన కొన్ని ఉదాహరణలు చెప్తారా?

జ: నా రచనల సంఘటనలకి అబలల ఆర్తి ఆధారం. సంఘ బహిష్కృతులైన స్త్రీలు నాలో confied చేసుకున్న చరిత్రలు నా రచనలకి ఆధారం.

4. మీమీద ముఖ్యమైన Influences-both Western and Indian-యేవి ?

జ: Indian writers రవీంద్రనాథ్ ఠాగూర్ Foreign మొపాసా, మాఘం, బెర్నర్డు షా ఇంతే జ్ఞాపకం.

5. మీరు తెలుగు సాహిత్యంలో ప్రవేశించేటప్పుడు తెలుగు సాహిత్యం యే స్థితిలో ఉంది? ఉదాహరణకి మీరు "తెలుగు నవల" అనే వ్యంగ్య రచన వొకటి రాశారు. మీరు నవలలు రాసేముందు తెలుగు నవల స్థితి మీరా Satire లో సూచించి నట్లే ఉందా?

జ: తెలుగు సాహిత్యంతో నాకేనాడూ సంబంధం లేదు. నేను రాస్తున్నప్పుడు ఓ తెలుగు సాహిత్యం వుందని తెలీదు. కథలకోసం పుస్తకాలు చదివాను చిన్నప్పుడు.

వ్యవహారిక భాషావాదం వుందని అసలు తెలీదు. చాలా పుస్తకాలు రాసిందాకా నా పుస్తకాలు తెలుగు సాహిత్యమనే విషయమే ఎరగను. నాకీ నాటికీ తెలుగు సాహిత్యాన్ని మార్చాలని కాని improve చెయ్యాలనికాని ఉద్దేశ్యమే లేదు.

'తెలుగు నవల'లో నేను Caricature చేసిన, నవల నేను పాఠంచెప్పాల్సి వొచ్చింది. అది 1927 ప్రాంతాలలో. కాని అంతకన్న మంచి నవలలు, చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలైనవారివి చిన్నప్పుడు చదివాను.

6. మొదటినుండి మీ సాహిత్యాన్ని serious గా చదివిన వాళ్ళకి ఇవ్వాళ్ళ మీరు 'రమణాశ్రమం'లో ఉండటం ఆశ్చర్యం కలిగించదు. మీరు రాసిన నవలలు 'అమీనా' 'అరుణ' 'జీవితాదర్శం' మొదలైన నవలల్లో ఇప్పటి మీ ఆధ్యాత్మిక జీవనపు Potentialities కన్పిస్తాయి. ఈ విషయాన్ని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి? మీ నవలల్లో కల్లా ముఖ్యమైన ఆ మూడు నవలల గూర్చి (అమీనా, అరుణ, జీవితాదర్శం) ఇప్పటి మీ అభిప్రాయం తెలియజేస్తారా?

జ: ఆ మూడు నవలలోనే కాదు. నా Serious రచనలన్నిటిలో — స్త్రీ అనే పుస్తకంలో Musingsలో ప్రేమలేఖల్లో ఏదో దూరాన నా కళ్ళకందని, పేరులేని దేనికోసమో, ఎడతెగని నిర్నిద్ర అన్వేషణ కనపడుతుంది.

ఆ మూడు నవలలూ రాయగలిగానని గర్వపడుతున్నాను.

7. 'మైదానం' అనే నవల రాయటంలో మీ ముఖ్యోద్దేశం ఆనాటి Middle class Moral Values ని Shock చెయ్యటం—అంటే మీరు వప్పుకుంటారా?

జ: Shock చెయ్యాలనే గుణం, నా మొదటి పుస్తకాలన్నిటిలోనూ వుంది

మైదానంలో Shocking గుణం చాలా Secondary నా దృష్టిలో అది ఒక Artistic Piece.

స్త్రీ హృదయపు లోతుల్ని చాలా గాఢంగా చిత్రించాను. నా పుస్తకాలన్నిటిలో ఎక్కువ ముద్రణలు పడ్డది స్త్రీ.

రెండోది మైదానం.

8 మీరు 'రమణాశ్రమం'లో చేరక పూర్వం తెలుగు యువతరాన్ని ఎంతగానో Influence చేసిన మీ భావాలు–స్త్రీ స్వాతంత్రియం, సెక్సు స్వాతంత్రియం, శృంగార జీవనం, ప్రకృతితో తాదాత్మ్యం, కృత్రిమ లౌకిక విలువలపై యేవగింపు– ఈ భావాలు మీరు రమణాశ్రమం వెళ్ళాక యేమైనా మారాయా ?

జ: అణుమాత్రం మారలేదు. పైగా "కృత్రిమ లౌకిక విలువలపై ఏవగింపు మరింత ఎక్కువయింది. (ముఖ్యం నాలో ఇంకా మిగిలివున్న వాటిపైన).

నేను ఏది రాస్తున్నానో వాటి న్యాయం, సత్యం నాకు ఆనాడే స్పష్టం. కాని నేను నా రాతలలో వాటికోసం ఎందుకు యుద్ధం చేస్తున్నానో ఆనాడు తెలీదు. అది నా స్వభావం, నేనట్లా పుట్టాను అనుకున్నాను. ఈనాడు నాకు ఈశ్వరానుగ్రహం వల్ల గోచరమైన కాంతిలో, నా జీవితాన్ని ఉడికించిన భావాల సత్యం, న్యాయం, అవసరం గోచరమైనాయి. నా రచనలు నా జీవిత సమరాన్నే ప్రతిఓంబించాయి. నా యత్నం సంఘాన్ని సంస్కరించడానికి కాదు, నన్ను సంస్కరించుకోడానికి.

9. మీరు రాస్తున్న రోజుల్లో మీపైన వచ్చే Harsh and unfavourable విమర్శలకు మీరెలా respond అయ్యే వారు ? ఆ విమర్శలు చదివినప్పుడు మీకు రాయాలనే ప్రేరణ హెచ్చేదా ? లేక తగేదా ? Harsh విమర్శల కారణంగా Thomas Hardy నవలలు రాయటం మానేసాడు. అలాంటిదేమైనా మీపట్ల జరిగిందా? మీ పట్ల వచ్చే విమర్శలకు జవాబులు రాయాలని, మిమ్మల్ని మీరు Defend చేసికోవాలని ప్రయత్నించేవారా?

జ: చిన్ననాటి నించి ఈనాటివరకు నా సాధన, "పక్కనున్నవాడు నా గురించి ఏమనుకుంటున్నాడో నా మనసులోకి రానీయకూడ"దని అందువల్ల విమర్శలు నన్ను Influence చేసేవి కావు.

నన్నెప్పుడూ Red Hotగా వుంచి, ఇంకా బలమైనవి షాకింగుగా రాయాలని ప్రోత్సహించినవినాపై విమర్శలే. మొట్టమొదటే తెలిసిందినాకు, నాపై విమర్శలు రాయరని, రాసే సత్తువ ఎవరికీ లేదని, వారికి చాతనయింది నన్ను తిట్టడమే నని. అందుకని ఏ విమర్శల్ని చదివేవాణ్ణికాదు. అయినా ఏ ప్రేమగల పరిచితుడో వచ్చి నాకు విమర్శ సారాంశం చెప్పడమూ, చదివి వినిపించడమూ తప్పేది కాదు.

మనుషులు గాయం కావాలనే రాసేవాణ్ణి గనక, వారు మండిపడ్డకొద్దీ నాకు సంతోషంగా వుండేది. కాని నాకాశ్చర్యం కలిగించేదేమిటంటే సారస్వతంలో పేరుపడ్డ రచయితలు కూడా, అన్నీ తిట్టి చివరికి, ఈ రచనలో ఈ సుగుణం వుందని ఒక్కమాట అనేవారు కారు. తరువాత అర్థమయింది ఏమిటంటే,

కాస్త చదవగానే వారి రక్తం పుడికేది. కళ్లు తిరిగేవి. ఇంక సుగుణాలేంచూడ గలరు? నిప్పులు తొక్కిన కోతులమల్లే ఈ సాహిత్య కోవిదులు ఎగిరి పడక పోతే, నా Out putలో సగం Create అయ్యేదికాదేమో! Defend చేసుకో దానికి అక్కడ Argument ఏదీలేదు తిట్లు తప్ప.

10. మీరు "మహా ప్రస్థానాని"కి రాసిన "యోగ్యతా పత్రం" చాలా ప్రఖ్యాతి వహించింది. మీరు ఆ కావ్యానికి అంత గొప్ప ఆవేశంతో "యోగ్యతా పత్రం" రాయ టం కొంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. 'మహా ప్రస్థానం' లో శ్రీశ్రీ చూపించిన "Socialism" అనే లక్ష్యాన్ని మీరెన్నడూ అంగీకరించ లేదనుకుంటాను మీకు వ్యక్తి స్వాతంత్రియం, వ్యక్తి తనంతట తాను చేసికునే సంస్కారం ముఖ్యం. అంతే కాకుండా మీలో మొదటినుండి Mysticism వైపు మొగ్గు కనిపిస్తుంది. ఇలాంటి మీకు, Socialist & Materialist అయిన శ్రీశ్రీకి భావైక్యత లేదు. అందువల్ల మీరు మహాప్రస్థానానికి అంత గొప్ప ఆవేశంతో 'యోగ్యతా పత్రం' రాయటానికి కార ణం ఏమిటంటారు? ఆ కావ్యంలోని 'శైలి' మిమ్మల్ని Move చేసిందా? ఒకవేళ 'శైలి' కారణమైతే భావంతో విడివడిన శైలి వేరేలేదన్న మీ వాదనని ఎలా సమర్థిస్తారు?

జ: 'యోగ్యతా పత్రం' అనే మాట ఎట్లా వొచ్చిందో కానినేను రాసింది మహాప్రస్థా నానికి జోహార్లు అంటాను. నాకు చాలా గౌరవం. నాకా పుస్తకంలో ఏ 'ఇజం' కనిపించలేదు. ఓ Great Poet, Heart నించి వొచ్చిన out pouring తప్ప.

నేను నా INTRO రాసేనాటికి శ్రీశ్రీ ఇంకా తన స్థానాన్ని వెతుక్కుంటు న్నాడు. అతను తల ఎత్తాడో లేదో సాహిత్య రాబందులు గుర్తి 'చాయి— ఓ గొప్ప నూతన స్వరం వినవొస్తోందని మురికి ముక్కులతో అతన్ని చించడం ప్రారంభించాయి.

ఇదే సమయమని వాళ్ళను చెండాడాను ఆ పీఠికలో : కావ్యంలోని శైలిని విడిగా నేను చూడనేలేదే! ఎందుకట్లా అంటారు ?

నేను Intro రాసిన పదేళ్ళకి అది అచ్చయింది. తరువాత ఓ 5 ఏళ్ళకి చదివాను దాన్ని. అప్పుడు నాకు ఆశ్చర్యం కలిగింది. నా Introలో తెలుగు భాష ఎంత గొప్పగా ధ్వనించిందని. అప్పటికీ ఆ ధ్వని నా ఆవేశం వల్లనే అంటాను.

ఏ 'ఇజం'లేని ఓ మహాకవిని, తమ వైరంతో ఈర్ష్యతో స్వరక్షణకోసం ఓ 'ఇజం'లోకి తోసింది ఆనాటికి ఈనాటికి తెలుగు సారస్వతాన్ని ఏలుతున్నది ఈ అసూయాప్రభువులు.

శ్రీశ్రీ మహాప్రస్థానంలోని 'ఆధ్యాత్మిక అభినివేశాలు' అనే వ్యాసం నేను రాయకుండానే ఉండిపోయింది.

11. మీ సమకాలీన రచయితల్లో మీరిప్పటికి గొప్పగా భావించే రచయిత లెవరు?

జ: చాలాసార్లు రాశాను. నా సమకాలీకుల్లో ముగ్గురే గొప్ప రచయితలు — వారే ఆ ముగ్గురు కవులూ.

కృష్ణశాస్త్రి. శ్రీశ్రీ, నండూరి సుబ్బారావు, ఈ ముగ్గురూ ఒక్కొక్క గ్రంథం రాసి ఆరిపోయారు.

12. మొదటినుండి మీ వ్యక్తిత్వంలోను, మీ సాహిత్యంలోను మూడు ముఖ్యమైన Trends కన్పిస్తాయి. అవి:

1. సంఘ సంస్కరణాభిలాష - (Reforming Zeal)
2. గొప్ప కళాభినివేశం (Strong Artistic temperment)
3. Mysticism వైపు మొగ్గు (Leanings towards Mysticism) ఈ Analysis తో మీరెంతవరకు అంగీకరిస్తారు?

జ: (1) నాకు సంఘ సంస్కరణాభిలాష చాలా తక్కువ. మనుషులు (ముఖ్యం నేను) వ్యక్తిగతంగా ఉన్నతులు కావాలనే నా దేవులాట.

2–3) మీతో ఏకీభవిస్తున్నాను.

13. మీరు 'రమణాశ్రమం' వెళ్ళటానికి ముఖ్యమైన కారణం యేమిటి? 'రమణమహర్షి'లో మీరు చూసిన ప్రత్యేకమైన ఔన్నత్యం యేమిటి? కొందరు సాంప్రదాయవాదులు "కామిగానివాడు మోక్షగామికాడు" అనే సామెతకి ఉదాహరణగా మిమ్మల్ని చెప్తారు. దీన్నిగురించి మీరేమంటారు?

జ: నా మనసు ఎప్పుడూ ఏదో తనకన్న అధికమైన ఆనందాన్ని కలలుగని వాటిని అందుకోవాలని కాంక్షించేది. మార్గం దొరికేది కాదు.

నా చుట్టూ మనుషులూ. ప్రకృతీ, వాటిల్లోనూ, నాలోనూ తీసివేసుకోలేని లోపాలు, మూర్ఖాలూ, క్రూరత్వాలు అర్థమయ్యేవికావు.

ఏది సత్యమో ఏది నీతో, నాలో నాకు స్పష్టం. కానీ బైట చూసినప్పుడు వాటికి ఆధారం దొరికేదికాదు.

నన్ను నిలవనీక వేధించే భావోద్రేకాలు, అభౌతికమైన కోర్కెలు సాఫల్యం కోసం పెనగులాడేవి.

వెతికి వెతికి నిరాశపడి "జీవితం ఇంతే! ఓ అర్థంలేని సమస్య. అంతంలేని బాధ" అని ముడుచుకుపోయినాను.

Accidental గా భగవాన్ని దర్శించినప్పుడు నాలోని అన్వేషణకి ఈయన అర్థాన్నివ్వగల రనిపించింది. ఎక్కడా విశ్రాంతినివ్వని నా మనోవేదనని ఉపశమింప చేసే శాంతిని ప్రసాదించగల దక్షులు ఆయన__అనుకున్నాను. ఎందుకు అనుకున్నానంటే దానికి జవాబులేదు. అయినా నేనుకాదు భగవానే నన్ను తన దగ్గరికి లాక్కొచ్చుకున్నారు.

"కామి" అనేదానికి అర్థం తెలిస్తే "మోక్షకామి"కి అర్థం తెలుస్తుంది.

14. (1) మీ దృష్టిలో వొక రచయిత Personal life కి, అతని రచనలకి ఎలాంటి సంబంధం ఉండాలంటారు?

(2) రెండు వేరువేరు రంగాలంటారా ? లేక వొకదానితో విడిఁడి మరొకటి లేదంటారా?

(3) తను తన నిజజీవితంలో ఆచరించలేని విలువల్ని Preach చేసే అధికారం రచయిత కుందంటారా? లేదంటారా?

(4) మిమ్మల్నే ఉదాహరణగా తీసికుంటే_ మీ వ్యక్తిగత జీవనానికి, మీ రచనలకి ఎలాంటి సంబంధ ముండేది?

(5) మీరు మీ రచనల ద్వారా చెప్పిన Values ని మీ నిజ జీవితంలో ఆచరించానని చెప్పగలరా ?

జ: 1_2. రచయితా, రచనా అనేది పెద్ద విషయం. ఇక్కడ స్థలంచాలదు దాన్ని చర్చించడానికి.

3. అధికారం ఏమాత్రమూ లేదు. అది వృత్త చౌర్యం.

4. నా రచనల్లో చూపిన ఆదర్శాల్ని నా చాతనయినంతవరకు నా జీవితంలో అనుష్ఠించాలని యత్నించాను. నా జీవితంలో అనుష్ఠించిన వాటినే నా రచనల్లో రాశాను.

5. External గా సాధించగలిగాను కాని, నా లోపల పరివర్తన ఎంత యత్నించినా, నాకు తృప్తిగా కలగలేదు.

15. మీ దృష్టిలో మీ రచనలన్నింటి లోను గొప్ప రచన యేది? మీరా రచన గొప్ప రచన అనుకోవటానికి కారణాలని కూడా తెలియజెయ్యండి.

జ: నేనీ మధ్య రాసిన 'సుధ' గొప్పది. నా జీవిత ప్రారంభంనించి ఈనాటివరకు సత్యాన్వేషణలో నేను పడ్డ Struggle దాని పర్యవసానం ఆమూలాగ్రంగా చిత్రించాను.

16. మీ ముఖ్య రచనలు యేయే సంవత్సరాల మధ్య వచ్చాయి? అంటే మీ literary career లో Busiest Period ఎప్పుడు ?

జ: 1958 నుంచి 1966 వరకు.

17. (1) మొదట్లో—అంటే రచయితగా మీకు పేరురాక పూర్వం—మీ రచనల్ని ప్రచురించటంలో ఎలాంటి సమస్యల్ని ఎదుర్కొన్నారు?

(2) మీ మొదటి రచనల్ని ప్రచురించి మిమ్మల్ని Encourage చేసిన ఆనాటి తెలుగు పత్రికలు యేవి?

జ; 1. నేను రాసినవి ప్రచురించాలని గట్టి ప్రయత్నం నేను చెయ్యలేదు. నాకు కలిగిన సమస్యలన్నీ, నా రచనలు అచ్చుకాకుండా చూడాలని విశ్వయత్నాలు చేసిన ఆనాటి రచయితల వల్లనే.

2. సాహితి—చిత్రగుప్త.

ఎంతో Adverse Influences ని ఎదుర్కొని నా కథల్ని, వ్యాసాల్ని ప్రచురించాయి. దానివల్ల వాటి Circulation అమితంగా పెరిగింది కూడాను.

18. మీరు రాస్తున్నప్పటికి, ఇప్పటికి మీ దృష్టిలో తెలుగు సాహిత్యంలో వచ్చిన ముఖ్యమైన మార్పులేమిటి?

జ: నేను రాసే కాలంలో చాలమంది సాహిత్యంపైని ప్రేమతో రాసేవారు. ఇప్పుడు రేడియోకి, సినీమాకి, ఎకాడమీలకి ఎక్కాలని రాస్తున్నారు.

19. మీ సాహిత్యంద్వారా మీరు తలపెట్టిన సాంఘిక విప్లవాన్ని — భావ విప్లవాన్ని—తెలుగు దేశంలో కొంతవరకైనా సాధించానన్న తృప్తి మీకుందా ?

జ: నేనే సంఘ విప్లవాన్నీ భావ విప్లవాన్నీ తలపెట్టలేదు. మనుషులు మారాలని ఆశించాను.

నేను ఆశించింది ఏదీ నెరవేరలేదుకదా, నేను కోరినదానికెంత దూరమో ఈనాటి తెలుగు ప్రజ.

20. (1) మీరిప్పుడు తెలుగుదేశానికి దూరంగా ఉంటున్నారు కాబట్టి ఇప్పటి తెలుగుదేశాన్ని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?

(2) మీరు తెలుగుదేశంలో నివసించినప్పుడు తెలుగుదేశం మీకు అన్యాయం చేసిందని భావిస్తారా లేక ఆదరణని చూపించిందంటారా?

జ: (1) నాకేం తెలీదు.

2. నా రచనల్ని తెలుగు దేశం Good Humourతో తీసుకుంది. ఇంకోదేశ మైతే నన్ను యింకా హింసపెట్టేది. గొంతు నొక్కేది.

నా రచనల్ని తగినంత appreciate చెయ్యలేదంటే దబ్బా మోతల్ని తప్ప, నిజమైన కళని అర్థంచేసుకునే యోగ్యత లేదు ఆ ప్రజకి : ఏంచేస్తారు?

కాని నన్ను హింసించింది నా జీవిత పద్ధతికీ, వారి మన్ననల్ని, ఆగ్రహాన్ని వెలిని, నేను లక్ష్యపెట్ట లేదని, వారిని దేనికీ నేను అర్థించలేదని. కాని నావంటి వాణ్ణి ఏదేశమైనా సహించి వుండదు. అంతమాత్రం ఎంతో ఓర్పుతో, నన్ను నా తోవన వొదిలింది. అదొక్క తెలుగుదేశంలోనే సంభవం!

21. ఈనాడు రాస్తున్న తెలగు యువ రచయితలకి, రచయిత్రులకి మీరిచ్చే సందేశం యేమిటి?

జ: హృదయంలో కలం ముంచి రాయమని సందేశ మిద్దామను కున్నాను. కాని హృదయాలు చిరగని గట్టి మడతలకింద పాతుకు పోయినాయి. అందుకని నా సందేశం పూర్తిగా వృధా—అని తెలుసు నాకు!



# జిజ్ఞాసువుగా చలం

— పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

ఆంధ్ర దేశంలో గుడిపాటి వెంకట చలం పేరు విన్నవాళ్లు ఎంత ఎక్కువ మంది అయితే ఉన్నారో, ఆయన్ని సరిగ్గా అర్థం చేసుకున్న వాళ్లు అంత తక్కువ మంది ఉన్నారు.

"చలం రాసిందంతా ఉత్త ఫ్రాడ్!" అనే సనాతనులకీ,

"నాకు చలం అంటే గౌరవమే!...కాని ..అతని రచనలు..." అంటూ అర్థోక్తిలో మెతక వేసే ఓరికి వాళ్ళకీ,

"చలం ఉత్త చంచలుడు. ఇవాళ తను చెప్పిన నిజాన్నే రేపు కాదంటాడు. అతణ్ణి పూర్తిగా నమ్మడం మహా ప్రమాదం సుమా!" అని ఫిర్యాదు చేసే అతని అర్ధ భక్తులికీ,

"చిత్రం ఏమిటంటే సెక్సు కథలు రాసే చలం రమణ మహర్షి భక్తుడై ఋషి కావడం" అని తెగ ఆశ్చర్యపోయే అధిక సంఖ్యాక సామాన్యులకీ అతను తలోరీతిగానూ అర్థం అయాడు.

ఇంకో విధంగా చెప్పాలంటే అసలు అర్థమే కాలేదు.

ఇలా ఒకే వ్యక్తి అయిన చలం, ఒకళ్ళ కొకరీతిగానూ మరొకళ్ళకి మరొక రీతిగానూ కనిపించడానికి కారణం ఏమిటి? ఇది చూసే వాళ్ళ దృష్టి దోషమా?... లేక ఇంత వైవిధ్యమూ ఆ ఒక్కడిలోనూ ఉందా?...

నిజానికి చాలా మంది అనుకున్నట్లు చలం చంచలుడూ కాదు. అతనికి లోకాన్ని మోసం చేయాలనే చెడు తలంపూ లేదు. అయితే, అతనిలో ఒకే ఒక గొప్పగుణం ఉంది. ఇన్నిరంగుల్లో, ఇన్ని వైవిధ్యాలున్న కోణాలనుండి లోకానికి అతణ్ణి చూపించ డానికి అదే కారణం. అదేమిటంటే, తనకి ఆక్షణంలో ఏదైతే నిజమని బలంగా తోస్తుందో దాన్ని ఢంకా కొట్టి చెప్పడం.

ఆ చెప్పడంలో వ్యంగ్యం, హాస్యం, భాషా, శైలీ, అన్నీ అతని చెప్పు చేతల్లో నడిచి, అతడు చెప్పదలచుకొన్న దానికి విపరీతమైన బలాన్నీ, శక్తినీ, వేగాన్నీ, కాంతినీ ఇస్తాయి. వీటికి తోడు నిజాయితీ (Sincerity) అనే మహాబలం ఒకటి దాని వెనక ఉంటుందేమో, దాంతో అది పాఠకునిమీద ఎంతో ప్రభావంతో పనిచేస్తుంది. ఇంతలోనే చలం జీవితంలో నూతన పరిణామాలు వస్తాయి. దాంతో అతని నిశిత దృష్టి ఇంకో కొన్ని కొత్త సత్యాల్ని చూస్తుంది. ఆ సత్యాన్ని కూడా అతను అంత దృఢంగానూ ప్రకటించడంవల్ల అవి కూడా అంత బలంగానూ పఠితపై పని చేస్తాయి. అయితే చలం మొదట్లో ప్రకటించిన సత్యాలకీ తర్వాత ప్రకటించిన ఈ సత్యాలకీ పూర్తి అయిన వైరుధ్యం ఉండడం వల్ల పాఠకుడు సందిగ్ధస్థితిలో పడతాడు. ఏది నిజం, మొదటి అభిప్రాయమా రెండవ అభిప్రాయమా, అనే తర్జన భర్జన రావడం, తుదకి పై విధంగా అతణ్ణి విమర్శించడం పరిపాటి.

చలం దృష్ట్యా రెండూ నిజమే! ఏమంటే, సదా పరిణామంచెందే లోకంలో, నిత్యమూ విలువలు మారే సంఘంలో ఇవాళ్టిదే సత్యం అనుకోవడం, ఇదే నిత్యం అని విశ్వసించడం వెర్రి అంటాడు చలం.

"అయితే మారే ప్రతి మార్పునీ ఒప్పుకో మంటావు. అంతేనా?" అని ప్రశ్నిస్తే.

"అలాచేస్తే, కనిపించిన ప్రతి మందునీ వేసుకొన్న రోగిస్థితి పడుతుంది నీకు" అంటాడు.

"ఇంతకీ నువ్వనేదేమిటి?" అంటాం అనుకోండి.

"నేననే దేమిటి?...అసలు నేనెవరు? ఈ విశాల విశ్వంలో నా స్థానం ఎంత? నే చెప్పిందే నిజం అనడానికి నాకు ఎంత హక్కు ఉందో నీకూ అంతే హక్కు ఉంది." అంటూ రీజన్ ఎంతవరకు తీసుకు వెళుతుందో అంతవరకూ వెళతాడు.

ఇటువంటి చలం యొక్క స్వరూపం ఇదీ అని వ్రాయడం సాహసమేకాదు, సత్యదూరం కూడా అవుతుంది. అయితే ఒక్క విషయం మాత్రం చెప్పవచ్చు.

మొదట్లో ఏదో తెలియని వేదనలతో రామ్మూర్తితో కలసి లోకంలో తిరుగుతూ మధనపడిన చలం, కొన్నాళ్ళకి స్త్రీనీ సెక్సునీ నిరంకుశ హస్తాలనుంచీ పాతనమ్మకాల పిడికిళ్ళ లోంచీ విడతీసే సంస్కర్తయై, ఆ తర్వాత మళ్ళీ తిరిగి తను బోధించిన సంస్కరణనీ తన భావాల్నీ తనే పూర్వపక్షంచేసే జిజ్ఞాసువుగా తయారయి, చివరకి రమణ మహర్షి దివ్య చరణాల సన్నిధిలో విశ్వజ్యోతిని విలోకిస్తూ మౌనిగా, నిస్సంగునిగా, తాత్వికునిగా పరిణామం చెందిన పద్ధతిచూస్తే, పరిణామం ఇతనికి జీవలక్షణం అనేది విశదం అవుతుంది.

పరిణామ క్రమవికాసం చెందిన చలం జీవితంలో ఈ పరిశోధన, సంస్కరణ, జిజ్ఞాస, తాత్వికతలు నాలుగూ, నాలుగు ముఖ్యమైన మజిలీలు. ఇందులో జిజ్ఞాసువు దశే నిజానికి చలానికి తగినదీ, అతని ప్రతిభని మనకి అద్దంలాచూపేదీను. పరిశోధక సంస్కరణ దశలలో చలం ఇంకా పూర్తి పరిణతి చెందని ప్రయాణీకుడుగానే కనిపిస్తాడు. సరే, ఇప్పుడున్న తాత్విక దశలో, అతీంద్రియమైన అలౌకిక స్థితి, చాలా భాగం మౌనంగా జరుగుతూ మహోన్నత జీవ పరిణామ స్థితి, కేవలం అతని ఆత్మోత్థానికే గాని అన్యులకు ఉపకరించేదిగా లేదు. అందువలన, మొదటి రెండు దశల యొక్క ఫలమూ, చివరి దశయొక్క బీజమూ, అయిన జిజ్ఞాసువుదశే చలం యొక్క విశిష్టతకి ఆట పట్టయిన అద్దాల మేడ.

చలం ఎంత జిజ్ఞాసువో, అతడా కాలంలో తన దృష్టిలోపడిన ప్రతిరంగాన్నీ దృఢమైన తన నిజాయితీతో, సున్నితమైన హాస్యంతో, నిశితమైన వ్యంగ్యంతో తరిచి దర్శించి ప్రదర్శించాడో అతని మ్యూజింగ్స్ చూస్తే మనకి తెలుస్తుంది. అతని నిశిత విమర్శకి ఇది గురిఅయినది. ఇది కాలేదు అనడానికి లేదు—సంఘం, సాహిత్యం, వేదాంతం, ఓహ్ :...ఒకటేమిటి?

సంస్కరణలో ఒక విధంగా తనకి ఆదర్శప్రాయుడైన వీరేశలింగాన్నే విమర్శించడానికి వెనుకంజ వెయ్యలేదు చలం. "వితంతు వివాహాలు చేశాం చేశాం అంటూ గంతులు వేస్తే ఏం లాభం? వివాహానంతరం వాళ్లు ఏమయ్యారు? వాళ్ళ జీవితాలు ఏ విధంగా మారాయి—అది చూడాలి, అలా చూడలేదు వీరేశలింగం గారు ఆయన దృష్టిలో నిరుద్యోగులూ, అసమర్థులూ, అమాయకులూ, రోగాలవాళ్లూ అంతా వీరులే;

వితంతువుల స్వేచ్ఛని గమనించకుండా చిన్న పిల్లల్ని ముసలివాళ్ళకీ, గొప్ప ఋంటి పిల్లల్ని పకోడీలు అమ్ముకొనే వాళ్ళకీ పెళ్ళిళ్లు చేశారు వీరేశలింగం" అన్నాడు చలం.

"లేచిపోవడం, లోభత్వం కంటే నేరమా?" అని ఒక పేజీలో ప్రశ్నించిన చలమే, నాలుగు పేజీలు త్రిప్పేసరికి "సంస్కరణ అంటే లేవదీసుకొని పోవడమా? అంటే, వేలు దగ్గిర నొప్పిని మడమలోకి మార్చడమా సంస్కరణఅంటే !" అంటాడు.

సంస్కరణ అంటే సంఘంలో ఒక్కొక్క వ్యక్తిలో వచ్చేమార్పు. సంఘంలో వచ్చేమార్పు కంటే వ్యక్తిలో వచ్చేమార్పే ముఖ్యం. అసలు సృష్టిలో ఉన్న శక్తులన్నింటిలోనూ పరిణామం అనేది గొప్పశక్తి. మానవుడు పరిణామశీలి, నిత్యనవ్యతా గవేషణాభిలాషిను. స్వర్గం ఇచ్చినా ఇంకా అశాంతితో ఏదో వెతుకుతూ మార్పుకై ఆశిస్తూనే ఉంటాడు. అటువంటివాడు తిండీ, గుడ్డా, సుఖం, ఇస్తానంటే అంతటితో ఆగుతాడా?" అంటూ మార్పుని సమర్థించిన చలమే తిరిగి మార్పుని ప్రోత్సహించే శక్తుల్ని గర్హిస్తాడు.

రాజకీయాలూ, మతం, కవిత్వం ఇవన్నీ నీకు లేనిదాన్ని ఏదో తెస్తాం, ఇస్తాం అని ఊరిస్తాయి మనల్ని. కాని దేనికో ప్రయత్నించి తెచ్చుకొనే శ్రమా బాధా కంటే. అదిలేకుండా బ్రతకడమే తక్కువ బాధ, ఏ మనుష్యుల్నిగానీ, సంఘాన్నిగానీ, జాతిని గానీ, సుఖంగా నిద్రపోతున్నప్పుడూ, హాయిగా శాంతిగా ఉన్నప్పుడూ జ్ఞానం పేరా, స్వతంత్రం పేరా, హక్కుల పేరా, నిద్ర లేపడం మహాపాపం. వాళ్ళలో అశాంతి ఉదయించి నప్పుడు, వాళ్లు మేల్కొని శాంతి కోసం త్రోవ తడుముకుంటున్నప్పుడు, వాళ్ళకి దోవచూపడం దయాపరుల ధర్మం, అంటూ ఉదాహరణకి కాంగ్రెసువారు హరిజనులలో ఎలా అశాంతిని లేపి బాధపెట్టారో సోదాహరణంగా చూపించ ప్రయత్నిస్తాడు చలం.

సాధారణంగా మనకి న్యాయాలుగా కనిపించే వాటి లోతుల్లోకి తరచి, అందులోని అన్యాయాల్ని అతడు చూపిస్తాడు. అసలు ప్రపంచంలో సుఖమూ బాధా రెండే విలువలు. బీదవాడు గంజిత్రాగుతూ పొందే ఆనందానికీ, ధనవంతుడు పరమాన్నం భుజిస్తూ పొందే ఆనందానికీ, ఆనందంలో భేదం ఏమిటి?...ఖరీదులతో బేరీజువేసి చూడకు...సుఖానుభవంలో వాళ్ళిద్దరికీ తేడా ఏమైనా ఉందా? ఇంక అటువంటప్పుడు లేని వాళ్ళని ఉన్నవాళ్ళ క్రింద చేసే యత్నం అర్థ విహీనమే కదా? డబ్బూ, ఉద్యో

గాలూ అయితే అందరికీ సమానంగా పంచుతాం__ఆనందాన్ని పంచేదెట్లా?...రాత్రి ఆకాశం వంకచూసి పొందే ఆనందాన్నీ, నిశ్చలత్వాన్నీ, అందరికీ సమానంగా పంచ గలమా?...ధనం వచ్చాక బీదతనపు సుఖం పోయినవాళ్ళూ వివాహం అయ్యాక బ్రహ్మచర్య సుఖం పోయినవాళ్ళూ ఎంతమంది లేరు? ఈ విధంగా పోతుంది చలం నిశిత దృష్టి.

సాహిత్య ప్రయోజనం గురించీ కళాస్వరూపం గురించీ కూడా చలం ఎంతో తరిచి చూశాడు. కవిని గురించి వ్రాస్తూ "అతడు తన కల్పనలతో లోకాన్ని అందాల సుందరిగా అలంకరిస్తాడు" అంటాడు చలం. అసలు కళ ఉద్దేశం అందాన్ని కల్పించ డమే! అలా కాకుండా ప్రజాసేవే కనుక దాని ఉద్దేశం అయితే దాని ప్రాముఖ్యాన్నే కోల్పోతుంది కళ. సంఘానికి ఉపకరించినకళే ముఖ్యం, తక్కినది వ్యర్థం అంటే ఎలా?...కళ సముద్రం లాంటిది. ఒడ్డున తగిలే అలలే ముఖ్యం, తక్కిన సముద్రం అంతావ్యర్థం అంటామా? అందుకే అడుగుతాను. కవిత్వంలో అందం అక్కర్లేదనే రచ యితలు, శ్రీశ్రీ పోకడలకోసం ప్రాకులాడడం దేనికి? ఊరికే 'ఆకలి', 'మంట' అనే రెండు మాటలే రాసేస్తే సరిపోదా? దానికి మళ్ళీ పద్యాలూ కథలూ రూపకాలంరాలూ పోగెయ్యడం ఎందుకు?" అంటూ సూటిగా ప్రశ్నిస్తాడు చలం.

అసలు ప్రపంచంలో అందాల విలువలే పోతున్నాయి. మనిషి అందం, మనసు అందం, సూర్యోదయ సూర్యాస్తమయాల తాలూకు అందం, ఇవేవీ ఆకలి పాటలతో పోటీపడ లేక పోతున్నాయి. అందమైన నదీ తీరాలూ, హాయిని గొలిపే సరస్సులూ పొట్ట భారాన్ని తీర్చుకోడానికి మాత్రమే ఉపయోగపడు తున్నాయి. మనిషిలో సౌంద ర్యదృష్టే నశిస్తోంది అంటూ బాధపడుతూనే లోకం ఇలా ఎంత నిరాశా జనకంగా ఉన్నా కళాకారుడు మాత్రం నిస్పృహ చెందకూడదు" అని హెచ్చరిస్తాడు.

కల్పనలో ఉండే అనందం అతనికి ప్రోత్సాహాన్నీ ధైర్యాన్నీ ఇచ్చి ఓదార్చాలి_ ఓదారుస్తుంది కూడా. నిజమైన కళాకారుడికి తనలో తనికి ఉండే విశ్వాసం ఇంకెవరికి దేంట్లోనూ ఉండదు. ఏం చెబుతున్నాం అని కాకుండా ఎంతరసం అనుభవింప చేస్తు న్నాం అని ఆలోచించాలి కళాకారుడు.

కావ్యాలలో వర్ణితమైన వానిని చదవడం వల్ల పొందే ఆనందంకంటే, నిజంగా ఆ వర్ణిత వస్తువుల్ని అనుభవించే వాడు పొందే ఆనందమే గొప్పది అని చలం వాదం. పచ్చని గడ్డినీ వెచ్చని ఎండనీ, చురుకైన మేకపిల్ల గెంతుల్నీ, అందమైన బిడ్డల చిరు

నవ్వుల్నీ, హాయిగా తన గుడిసెలో కూర్చుని అనుభవించే బీదవాడిని, ఓ పండితుడా నువ్వు ఉద్ధరిస్తావా? నువ్వు, ఆ ఆనందాన్నే పుస్తకాలలోనూ బొమ్మలలోనూ వర్ణిస్తేనే కాని గుర్తుపట్టలేని నువ్వు ఉద్ధరిస్తావా అని ముక్కు మీద గుద్ది అడుగుతాడు చలం.

కళాకారుణ్ణి ఇలా పృచ్ఛించిన చలం, ఆ కళా స్వాదనా పరుల్ని కూడా విమర్శించకుండా వదలలేదు. కవిఅందించే రసాన్నిమాని ఆరసం రేపే జ్ఞాపకాలని మాత్రమే కొందరు అనుభవిస్తారు. అందుకే కొందరు ఒక అతిలోక సుందరమైన దృశ్యాన్ని చూసి కాని ఒక అమర సంగీతాన్ని వినిగాని అందులో తన్మయులు కాకుండా వెంటనే "నేను చిన్నప్పుడొక సారేం..." అని అందుకుంటారు అంటూ అపహసిస్తాడు చలం రసికులం అనుకొనే అరసికుల్ని.

కళాకారుడు తను చెప్పే అందాల్నీ, చేసే సుందరమైన సృష్టినీ, తన హృదయంలోకి ఇంకించుకొని అవి తనముఖానికీ మాటకీ తేజస్సుని ఇచ్చేవిలాగ చేసుకోవాలి. జీవితాన్ని సృష్టిలయతో మేళవించడానికి చేసే ప్రయత్నమే కళ. ఆ ప్రయత్నమే గనక సంపూర్ణంగా ఫలిస్తే కవీ, గాయకుడూ, శిల్పి, వీళ్ళంతా తాత్త్వికులై మౌనం వహిస్తారు. అందుకే తాత్త్వికుని పూర్వరూపం కవీ, కవిపరరూపం తాత్త్వికుడూను. ఇంత నిశితంగా సాహితీ జిజ్ఞాస పెంపొందించుకొన్న చలం, తను చెప్పిన సాహితీ తపః ఫలిత తాత్త్విక స్థితినే తానిపుడు పొందుతూ నిశ్చలమైన యోగిగా మారాడు.

అతని ప్రస్తుత తాత్త్విక స్థితికి మూలమైన అంతులేని జిజ్ఞాస అతని మ్యూజింగ్స్‌లో కనిపిస్తుంది. అందలి ప్రతి పుటలోని ప్రతి పంక్తియందలి అక్షరములలోనూ 'ఏది నిజం' 'ఏది నిజం' అని ఆజీవుడు పడిన వేదన ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. సైంటిస్టు అపేక్షారహితమైన అన్వేషణా, ప్రేమికుడి ఆరాధనా, భక్తుని ఆత్మార్పణా, ఇందులో ఏది నిజం? ఏది శాశ్వతం? లేదా అన్నీ నిజాలే. అన్నీ శాశ్వతాలేనా, శూన్యంలోని కాంతి స్పందనాలవలె? అవును. ఆ స్పందనాలే శాశ్వతం కాలేంది, మనుష్య హృదయంలో ఉద్భవించే గాఢవాంఛలూ, తీవ్ర భావాలూ, ఆ మనుష్యులు పోయినా, ఏ దిక్కుల్లోనో ఏ హృదయాల్లోనో వెలుగుతూ ఉండవని లెఖ్ఖేమిటి?

"అవి ఫలించడాన్ని బట్టి అవి శాశ్వతం కావడం, సత్యం కావడం జరుగుతుందంటావా? సత్యం కావడానికి ఫలితమే ఉండనక్కరలేదు. ప్రయత్నము ఉన్నాసరే అది సత్యం అవుతుంది. ఆ పుస్తకాలూ, ఆ శాంతి నికేతనం అవేవీ మిగలక పోయినా, అసలవి ప్రస్తుతం సంతరించుకొన్నరూపాన్ని పొందకుండా ఆయన హృదయంలోనే

ఆగిపోయినా. ఠాగూరు కవిత్వపు హృదయమూ, దిక్చక్రముల వైపు ప్రసరించే అతని అన్వేషణా దృష్టీ అబద్ధం అయ్యేవా?" ఇలా ఒక ప్రక్క నుంచి అంటూనే" ఇదంతా మానవుని అమాయకత్వం కాని ఆలోచించి చూస్తే ప్రపంచంలో నిలకడైన సత్యం అసలు ఎక్కడుంది? జీవితం అంటేనే, సంబంధమూ అర్థమూ ఉన్నట్లు కనపడే ఒక కమ్మనికల. ఈ అస్థిరమైన కలలోనే నిలబడి, మీ అందరి జీవితాలమీదా కాంతిని ప్రసరించే విధంగా నేను మీకు అందరికీ చెప్పేదేమిటంటే, అంటూ ప్రారంభించి ఇదిగో ఇదే నిజం, ఇలాగే నడవండి అనే శాస్త్రవేత్తా, రాజకీయ నాయకుడూ తాత్వికవేత్తా ఎంత వెఱ్ఱివాళ్ళా అనిపిస్తుంది. అసలు జీవితం అంటేనే కాలంలో కదలిక అంటూ తర్కిస్తాడు చలం.

జీవులు, జన్మలు, పుణ్యపాపాలు — వీటి గురించి మానవ మస్తిష్కము ఎంత వరకు ఆలోచించగలదో అంత వరకూ ఆలోచనలు సాగించాడు చలం. ప్రవక్తల ప్రవచనాలుకూడా, అగ్గిపెట్టెలను ఈడుస్తూ రైలుబండిని లాగుతున్నానని భ్రమపడే పిల్లవాని శ్రమతో కూడిన అరుపులులా గోచరించాయి అతనికి. అందుకే ప్రవక్తకాక హెచ్చరిక చేస్తూ" రేపు చనిపోయే ఓ ప్రవక్తా! ఎల్లుండి లోకం ఏమైతే నీకేం?...... తర్కిన వాటికి మళ్లే నీ ఉద్యమంకూడా పూడ్చుకు పోదని ఏమిటి నమ్మకం? అన్నాడు.

జన్మల గురించీ పరలోకం గురించీ చలం తర్కించిన విధం చాలా నిశితమైంది. అన్నింటిలోకీ అన్యాయం 'వైరాగ్యబోధ' అంటాడు. పరలోకం సందేహాస్పదం. అంతా ఊహాగానమేకాని, అక్కడకి వెళ్ళి చూసివచ్చినవాడు కాని, ఇదిగో నేను చూసివచ్చాను అని చెప్పినవాడు కాని ఏడీ? అక్కడ ఏంవుందో, ఏంలేదో, ఏమీ తెలియకుండా ముందు ఇక్కడ చేతులో ఉన్నసుఖాన్నీ తెలిసిన లోకాన్నీ వదులుకోమనడం ఘోరమూ, అన్యాయమూను. అయినా వచ్చే జన్మలో నాకేదో వస్తుందని ఈ జన్మలో ఉన్నదాన్ని వదులుకో మనడం ఏమిటి? వచ్చే జన్మలో 'నేను'కీ ఈ జన్మలో 'నేను'కీ ఏమిటి సంబంధం? చిన్నప్పటి 'నేను' ఇప్పటి 'నేను'గా మారేననే జ్ఞాపకం ఉంది కనుక, ఆ కష్టసుఖాల్ని నావిగా స్వీకరిస్తాను. నావే అని అంగీకరిస్తాను. కాని వచ్చే జన్మలో 'నేను'తో ఈ జన్మలో 'నేను'కి సంబంధం తెగిపోయాక ఆ 'నేను'కి ఏవైతే నాకేం? నా ఎదుట నున్న గేదె సుఖదుఃఖాలకీ, నాకూ ఉన్న సంబంధమే, ఆ 'నేను'కీ ఈ 'నేను'కీ ఉన్న సంబంధం. కాదు, 'చావుతో ఈ 'నేను' అనే భావం నశించదు, మిగులుతుంది' అంటావూ ఇంక అటువంటప్పుడు మరణం అంటేనూ, వచ్చే జన్మ అంటేనూ, ఇంత భయమూ జాగ్రత్తాదేనికి? ఒకే జన్మలో ఒక ఊరునుంచి మరో

ఊరికి మారిన భావం లాంటిదేకదా, అప్పుడు మరో జన్మఅంటే—అంటూ తీవ్రమైన తర్కంతో అద్భుతంగా వాదించి, తనలో తల యెత్తిన జిజ్ఞాస ఎంత సహజమైందో ఎంత బలమైందో, ఆలోచనా పరులందరికీ అర్ధవిస్ఫూర్తి కలిగిస్తాడు.

నీతి, ధర్మం త్యాగం ఇవన్నీ నా కెందుకు? నాలుగు నిముషాల్లో అస్తమించే నాకు?... "కాదు. దేహం నశిస్తుందికాని, జీవుడు నశించడు. ఆ జీవుడే నువ్వు" అంటావా?...ఏ నేను?...పిల్ల నేనా?...పడుచు నేనా?...ముసలి నేనా?...

అయినా, ఆ జీవుడో, శక్తో, శూన్యమో ఏదో మిగిలితే మాత్రం, అది 'నేను' అనే జ్ఞానం లేకపోయాక అది మిగిలిఉంటే నాకేం, లేకపోతే నాకేం? అన్ని మూఢత్వాలూ ఒదులుకున్న 'రస్సెల్' వంటి వారు కూడా విశ్వ మానవ సౌభాగ్యం, ముందు యుగాల వారిపట్ల మన కర్తవ్యం లోకాభివృద్ధి అంటూ మూఢత్వంలో పడతారేం?... సైన్సు ప్రకారం చూస్తే మనిషి ఉత్త 'కార్బన్' అణువుల ప్రోగు... ఆ ప్రోగు కావచ్చే జన్మా, జీవుడు, బాధ్యతలూను...? అవును కానీ, మనిషి ఉత్త కార్బన్ అణువుల ప్రోగే అయితే, మరి ఆ 'కార్బన్ మెషీన్' లోంచి ఈ మనస్సూ, ఈ తెలివీ ఇవన్నీ ఎట్లా పుట్టాయి?... ఇంతకీ ఈ మతం, ఆధ్యాత్మిక చింతనా, వీటి అవసరం ఏవిటి మానవుడికి? అవి ఏం చేస్తాయి? 'నేను'ని శమింప చేస్తాయా'... అలా చేస్తే మానవుడికి లాభమా, నష్టమా? సుఖమా, దుఃఖమా?

ఈ ఆధ్యాత్మికానుభవం ఉన్నవాళ్ళంతా, దానితో లోకంలోని ఏ సుఖమూ. ఏ పదవీ, ఏ శృంగారమూ సరితూగ లేవు అంటారు. ఎందువల్ల? ఆధ్యాత్మిక చింతన అంటే ఏవిటి? Sub-Conscious ని తరచడమా ? అంటే, మన మనస్సుకి నిరంతర సుఖాన్ని కలిగించగల శక్తి ఏదో వెతుక్కుంటూ తర్కించుకుంటూ వెళ్ళడమా ? ఆ శక్తే దొరికితే ఇంక కావలసింది ఏవిటి? ప్రపంచంలో నిజమైన సుఖం ఎక్కడ ఉంది? సుఖం అని మనస్సుకి సరిపెట్టు కోవడంతప్ప? అందువల్ల మనస్సుకి నిజమైన సుఖం లభిస్తే మంచిదే ! అది ఆధ్యాత్మిక చింతన వల్లా మతం వల్లా వస్తుందా? మతం ఎన్ని కబుర్లు చెప్పినా ఏం లాభం లేదు. లోకంలో బాధలకీ మృత్యువుకీ అది భాష్యం చెప్పినప్పుడే. అది విజ్ఞానాన్ని పరమ సుఖాన్ని అందించే ఒక దివ్య సాధనం అని అంగీకరిస్తాను. ఊరికే చెప్పడం కాదు. నా 'రీజన్'ని ఔనని ఒప్పించాలి. నువ్వు అనుభవించేదేదీ నిజంకాదు. అంతా మిధ్య అని మతం ఊరికే అంటే నేను అంగీకరించను. నేను ఇంత నిశ్చయంగా అనుభవిస్తున్నది అబద్ధం అని నేను అనుకోవాలంటే, ఆ మతాన్ని ప్రవచనం చేసే దృష్టి నాకు రావాలి. వాళ్లు నాకు ఇయ్యాలి... అయితే ఆదృష్టి వస్తే మంచిదే_ఏమంటే, వెఱ్ఱివాడిలాగ నిన్న సుఖాన్ని తలుచుకుంటూ నేటి సముద్రాన్ని ఈదుతూ రేపటి కష్టాలకి బావురు మనడం కంటే నిన్న నేటి రేపు అనే వాటికి భేదం తెలియని ఒక మహోన్నత స్థితిలో ఉండటం మంచిదికదూ?

అలా ఉండడం అంటే.

లోకాలు మాయ అనుకోవడం అన్నమాట! మరి జీవుడు?... అదీ మాయే... సృష్టీ మాయే!... అంటే అంతా వట్టి భ్రమ అన్నమాట! ఈ భ్రమ ఎవరికి?

"జీవుడికా?"

జీవుడూ భ్రమే కదా? మరి అయితే ఈ భ్రమ భ్రమ లేని వారికా?

అంటే ఈశ్వరుడికా?

ఇంక మోక్షమూ, పునర్జన్మా, సంగతి.

మోక్షం పొందిన వాళ్ళకి పునర్జన్మ లేదంటారు కదా. మోక్షం అంటే అసలు భేదమే లేకుండా భగవంతుడిలో కలిసి పోవడం కదా. అలా ఒకమాటు కలిసిపోయాక, ఆ కలిసిపోయిన వాళ్ళకి పునర్జన్మ లేదంటూ, వాళ్ళను విడదీసి ప్రత్యేకంగా ప్రస్తావించడం, మోక్షం పొందినవాళ్ల వీళ్ల అనడం, ఎట్లా? ఇది ఎట్లా ఉంది అంటే సముద్రంలో చెంబుడు నీళ్ల పోసి, ఆ పోసిన చెంబుడు నీటినే తిరిగి ఉద్ధరించి ఉచ్చరించడానికి ప్రయత్నం చేసినట్లు ఉంది. ఈ విధంగా తర్కించి తర్కించి తుదకు విజ్ఞానం ఎక్కువైన కొలదీ రీజనింగు బలమై సందేహాల్ని ఎక్కువ చేస్తోంది అంటూ తపిస్తాడు చలం.

అతని పేరే చలం. పేరులోనే ఉంది అతని ప్రవృత్తి. ఇలా జిజ్ఞాసతో చలిస్తూ ఎందుకు శ్రమ పడతావు అని అడిగితే ఏం చెయ్యను? నా మనస్సే అట్లాంటిది. ఎప్పుడూ ప్రశ్నిస్తూ ఉంటుంది. ఎన్ని చివాట్లు తిన్నా ఎన్ని ఇబ్బందులు ఉన్నా ఏదో ప్రగాఢమైన విశ్వాసంతో, నమ్మకాని నమ్మకంతో అర్ధరాత్రులుకూడా యోచిస్తుంది. అలా ఆలోచించి ఆలోచించి తుదకు ఒక నిర్ణయానికి వస్తుంది. ఆ నిర్ణయాన్ని నిజాయితీగా మీ ముందు ఉంచుతాను అది సరి అయినదో కాదో నాకు తెలియదు. కాని నేను నిజమని పూర్తిగా నమ్మినది అది. అందులో నిజాయితీ (Sincerity) సంపూర్ణంగా ఉంది. అసలు నా వ్రాతకీ శైలికీ బలాన్నిచ్చేది ఆ నిజాయితీయే! నన్ను వేరుగా నా పద్ధతుల్ని వేరుగా నేను రాసే విషయాన్ని వేరుగా చూడడం పొరబాటు.

నేను ప్రతిదాన్ని తర్కిస్తాను. ఇదివరకు పుస్తకాల్లో ఏవో ఒకటి గట్టిగా చెప్పాను. ఇప్పుడు వాటి అడుగు భాగాలన్నీ ఊడగొడు తున్నాను. మరి ఇప్పుడు ఎక్కడ నిలవడం అని అడుగుతారా? మీ అందరికీ ఒకే ఒక సమాధానం, పోనుపోను నా అనుభవాలూ తర్కాలూ ఎన్ని కొత్త కోణాలమీదో వెలుతురుని ప్రసరిస్తున్నాయి. ఆ వెలుతురునీ, కొత్త సత్యాల్నీ మారిన విలువలనీ చూస్తూ ఎలా ఊరుకోను? తప్పు అని తెలిసి కూడా పాతవాటిని ఎలా సమర్ధించను?

అప్పుడు నాకేమి నిజాయితీ ఉన్నట్టు?

అంటూపృచ్ఛిస్తాడు జిజ్ఞాసువుగా చలం—

# చలం చేసిన తిరుగుబాటు

— సురమౌళి

"చలంలాంటివాడు చివరకి మారక తప్పలేదు; నీ లెక్కేమిటి?" అనేవాళ్ల ఈ రోజుల్లో చాలామంది బయలుదేరారు. పాతకాలపు పంగనామాలవాళ్ళూ, పొడుం కాయల వాళ్ళకు ఈ క్రొత్తకాలంలో స్నో పౌడర్ల పైనుంచి విభూతిరేకలు దిద్దుకునే వాళ్ళూ క్రాపు మధ్యలో గోష్పాదం జుట్లని దాచుకునే వాళ్ళూ దొంగసన్యాసులకు అందమైన శిష్యురాండ్ల శుశ్రూషలు అరేంజ్ చేసే ఖాదకావు భక్తులూ తోడైనారు.

వాళ్ళడిగే పై ప్రశ్నలో వాళ్ళనుకున్న వాస్తవ స్థితులు రెండూ తప్పులేనని వాళ్ళకు చెప్పినా అర్థం చేసుకోరు. "చలంలాంటివాడు" అంటే ఏమిటి? ఏమిటి చలం గొప్పతనం? సాంఘిక విప్లవానికి ఆయన నాయకత్వం వహించలేదే? వీరేశలింగం వితంతు శరణాలయాలను స్థాపించినట్లు, వితంతువులకి తాను పూనుకుని వివాహాలు జరిపించినట్లు, చలం స్వయంగా పూనుకుని ప్రేమ వివాహాల సంఘాలనుగాని, 'పతివ్రతలకన్నా వేశ్యలే నయమని' రాసిన చలం ప్రత్యేకంగా ఆంధ్రదేశంలో వేశ్యా గృహాలను స్థాపించడమన్నా చెయ్యలేదే! కులాలు పోవాలన్న వ్యక్తి కులాంతర పెళ్ళిళ్లు చేయించడం, కనీసం సహపంక్తి భోజనాలన్నా కార్యక్రమంగా చేపట్టి నడుపలేదే! అందుకని మొదట 'చలంలాంటి వాడు' అంటున్నప్పుడు ఆ మాటకు అర్థం ఏమిటో బాగా ఆలోచించాలి. చలం ఏ ఉద్యమానికీ నాయకుడుగానీ, వైతాళికుడుకానీ కాదు. విప్లవానికి ధ్వజం పట్టుకొని ముందుకు నడిచిన నాయకుడు కాడు; చలం కేవలం రచకుడు. ఫిలాసఫర్ కూడా కాదు. సంఘంలో ఉన్న కుళ్లును, అవినీతిని, కంపును, క్రౌర్యాన్ని స్పాట్‌లైట్ వేసి సంఘానికి చూపించాడు. రచకుడు చేయాల్సిన పనిని చేశాడు. ఆ కుళ్లను కడుక్కోవడానికి పూనుకోవడం, ఆ కంపును పోగొట్టుకోడానికి ఉద్యుక్తుల మవడం, ఆ అవినీతిని రూపుమాపుకోవడానికి తయారు

కావడం సంఘం చూసుకోవాలి! నాయకుడు చూసుకోవాలి! లేదా ఉద్యమకారుడు చూసుకోవాలి! దానికీ చలానికీ ఏమిటి సంబంధం?

వీరేశలింగం పంతులుగారు ప్రధానంగా సాంఘిక సంస్కర్త: సాహిత్యాన్ని తన లక్ష్యానికి ఆయన ఉపయోగించుకున్నాడు సాధనంగా. చలం ప్రధానంగా సాహిత్యకుడు. సంఘసంస్కరణకు కావలసిన సాహిత్యాన్ని సృష్టించాడు.

ఇంకా ఎం. ఎన్. రాయిలాంటివాడు చచ్చిపోతే, ఆయనకు సమాధికట్టి పూజించారే! అనిగాని, బుద్ధుడులాంటివాడు మరణించాక బోలెడు మూఢాచారాల్ని అనుష్ఠించారే బౌద్ధులు? అనిగానీ అంటే కొంతవరకు వాదించడానికన్నా అవకాశం ఉంటుంది. సందేహాన్ని కొంతవరకన్నా అర్థం చేసుకోవచ్చు.

సంఘం బాగా కుళ్ళిపోయినప్పుడు, తిరుగుబాటు తప్ప దాని ఆరోగ్యానికి మరో మార్గం లేనప్పుడు ఆ సంఘంలో పుట్టిన రచయిత ఆ అవశ్యకతను సంఘానికి చూపిస్తాడు. అంతేగాని కుళ్ళను కడుక్కుంటూ కూచోడు: ఆ పని తానే చేస్తూ కూచోడంకన్న ప్రతిభ ఉన్న రచయిత పదిమందినీ కుళ్ళను కడగడానికి ప్రేరేపించే పని చేయడమే చాలా అవసరం. కడిగేవాళ్ళ పదిమంది పుడతారు.

ఇక రెండోది 'చలం' మారాడనడం. ఏం మారాడో నాకిప్పటికీ అర్థంకాదు; తనకు ఇష్టం లేనప్పుడు ఆ పూట ఆకలికైనా ఓర్చుకుని పురుష సంభోగాన్ని తిరస్కరించగల స్వేచ్ఛ ఉన్నటువంటి వేశ్యకన్నా, పతివ్రతలే నయమని ఎప్పుడైనా చలం రాశాడా? ఆడపిల్లలకు ఏకైక లక్ష్యం పెళ్లిచేసుకుని మగవాళ్ళకు దాస్యం చేస్తూ ఉండటమేనని చలం అన్నాడా? అంటున్నాడా? నీకు నమ్మకం ఉన్నా లేకపోయినా, గుడ్డిగా పసుపుకుంకాలు రాసుకొమ్మనిగానీ, ఇళ్ళముందు పేడనీళ్ళ చల్లుకొమ్మనిగాని చలం బోధిస్తున్నాడా? మాలమాదిగలు (మనుషులు) ముట్టుకున్న మంచినీళ్ళకన్నా ఆవుపేడ. ఆవు ఉచ్చా కలుపుకున్న మంచినీళ్ళే పవిత్రమైనవని చలం సమర్థించాడా! ఏమిటి చలంలో వచ్చిన మార్పు? "స్త్రీ" లేటెస్టు ఎడిషనుకు ఆయన రాసిన ఉపోద్ఘాతం చదవండి పోనీ! చదవరు.

చలం శత్రువులు ఇప్పుడూ—అప్పుడూ...ఆయన్ని అనవసరంగా అప్రతిష్ఠపాలు చెయ్యడమే పనిగా పెట్టుకున్నట్టున్నారు. ఇంకా అప్పుడే నయం! ఈ శత్రువులంతా శత్రువులుగా ముందుకు వచ్చారు. ఇప్పుడు వీళ్ళంతా మిత్రులుగా చలం వెనుక దాక్కుని ఆయన్ను వెన్నుపోటు—ఆయన్ను వీరేం పొడవగలరు లెండి—కాని ఆయన మాటలన్నీ సత్యమేనని...ఆయన కలలుకన్న తిరుగుబాటుకు నాయకత్వం వహించాలని, ఉద్యమాల ద్వారా, కార్యకలాపాల ద్వారా ఈ సంఘపు కుళ్లను కడగడానికి

ప్రయత్నిస్తున్నవాళ్ళను వెన్నుపోటు పొడవాలని చూస్తున్నారు. (చలంగారూ! జాగ్రత్త!)

ఈ దేశంలో గొప్ప గొప్ప విప్లవాలు నీళ్ళుగారిపోతున్నాయి. కొత్త చిగుళ్ళు అనేకం ఆకులు తొడుక్కోకుండానే మాడిపోతున్నాయి బౌద్ధం. చార్వాకం, గాంధి గారు, వీరేశలింగం పంతులుగారు ఇలా ఎంతమందినైనా ఉదాహరణగా చెప్పవచ్చు. ఒకటిన్నర శతాబ్దాల తర్వాత కూడా ఇవాళ వితంతువులందరూ పెళ్ళిళ్ళు చేసుకుంటు న్నారా? పెళ్ళి చేసుకున్న వితంతువుల్ని అపవిత్రంగా, అశుభంగా చూసేవాళ్ళు. భావించే ముసలమ్మలు సంఘంలో ఇవాళ లేరని చెప్పగలమా? కులగోత్రాలను తు. చ. తప్పకుండా పాటించే గాంధేయులివాళ కోకొల్లలు - ఎంత చదువుకున్న ఆడదానికైనా వరకట్నం లేకుండా పెళ్లి జరుగుతున్నదా ఇవాళ? సంఘం ఇలా ఎప్పటికప్పుడు మళ్ళీ మళ్ళీ కుళ్ళునే వరిస్తోంది కనుక, కొత్తచిగుళ్ళు త్వరత్వరగా మాడిపోతూ, ఎండిపోతూ వున్నాయి కనుక పండుటాకులే, ఎండుటాకులే ఉత్తమం అవుతాయని, కంపే పరిమళ మనీ భావించుకునే పిచ్చివాళ్ళుంటారా? ఇలా జరుగుతూవుండటానికి కారణం బహుశా 'భారతజాతి' అనే వృక్షానికి 'జవ' లేకపోవడం కావచ్చు! ఆ చెట్టు మొదల్లోనుంచీ దాన్ని ఏదో రోగం పట్టుకుని పీడిస్తూ వుండటంచేత కావచ్చు: ఉపనిషత్తుల రూపంలోనో అద్వయిత వేదాంతం రూపంలోనో ఆ చెట్టుకు వేరుపురుగు పట్టి వుండవచ్చు. (వింటు న్నారా చలంగారూ! వేదాంతం వేరుపురుగు సంగతిని కూడా ఆలోచించండి!) కొత్త చిగుళ్ళు త్వరత్వరగా ఎండిపోతున్నాయి. అయితే ఇందులో పండుటాకులు విర్రవీగా ల్సినదేమీ లేదు. మళ్ళీ మళ్ళీ వేస్తాయి చిగుళ్ళు. వేరుపురుగు ఎక్కడవుందో అన్వే షించి పట్టుకుని మందువేసి హతమారుస్తారెన్నటికైనా! ఇలా ఎప్పటికప్పుడు మాడి పోతూన్న కొత్త చిగుళ్ళ "మోడులు" ఎరువై, జాతివృక్షం జీవాన్ని, జవనూ పుంజు కుంటుంది. ఆ నాడు బలమైన కొత్త చిగురు వేస్తుంది. సంఘంలో ఆనాడు శక్తి వంతమైన తిరుగుబాటు ఉవ్వెత్తుగా లేస్తుంది. చలం రచనలు ఆనాటిదాకా ఉంటాయి. వేయబోయే కొత్తచిగుళ్ళకి బలాన్ని 'జవ'నూ అందిస్తూ.

చలం ప్రత్యేకసంచిక వెయ్యదానికి పూనుకున్న సృజన పత్రికా నిర్వాహకులు ఒక్కపని చేస్తే బాగుండుననిపించిందినాకు. 50 ఏళ్ళక్రితం సంఘాన్ని అతలాకుతలం చేసే రచనలు చేశాడుగదా చలం? సంఘంలో పాతుకుని పోయివున్న కుళ్ళు ఆచారాలను పద్ధతులను, సంప్రదాయాలను తునాతునకలు చెయ్యండని యువతరాన్ని ఉద్రేక పరి చాడుగదా! అవేశాన్ని కల్గించాడు గద! ఆ ఉద్రేకంలో పడి, ఆ ఆవేశాన్ని పురస్క రించుకు ఆ పద్ధతులకు ఎదురు తిరిగిన వాళ్ళ జీవితానుభవాలను, చలం మాటలు నమ్మి సంకెళ్ళను త్రెంచుకున్న ఆడవాళ్ళ అనుభవాలను, వాళ్ళు పడ్డ కష్టసుఖాలను, వాళ్ళకు కలిగిన సంతృప్తినీ, అసంతృప్తినీ రికార్డు చేయిస్తే బాగుండును అని. అయితే,...

అలాంటి అనుభవాలను వినడానికి, చేదునిజాలను చెప్పినవాళ్ళను గౌరవించడానికి కావలసిన ఔదార్యం సంఘంలో ఈ నాటికీ రాలేదుగద ! పెళ్ళిబంధంలో తెచ్చుకుని కట్టేసుకున్న భార్యలకన్నా_పతివ్రతలకన్నా నేను వేశ్యా గృహాలలోని వేశ్యల సాన్నిహిత్యంలోనే ఎక్కువ సుఖపడ్డానని ఎవరన్నా చెపితే, పతివ్రతలు, పసుపుకుంకాలు రాసుకున్న ఇల్లాండ్రకన్నా నాకు వేశ్యల్లోనే ఎక్కువ విశాల హృదయులు, ఉన్నత సంస్కారం ఉన్న ఆడవాళ్లు కనపడ్డారని తమ అనుభవాల్ని ఎవరైనా_వా స్తవికంగానే, ఉన్నదున్నట్లుగానే చెపితే ఆ కాలుతున్న సత్యాన్ని, ఆ నిప్పులాంటి నిజాన్ని, ఓర్చుకోగలంతగా ఈ సంఘం పరిపక్వం చెందిందా అన్న అనుమానం కూడా నాకు కలుగుతూనే వున్నది.

నా మనసులో అప్పుడప్పుడూ ఒక ఆశ చిగురిస్తూ వుంటుంది. కేవలం అడియాసే కావచ్చు_కాని అదలా అనిపిస్తూనే ఉంటుంది. ఏమిటంటే అవి_సంఘంలో ఉన్న ఈ దురాచారాలనూ, కుళ్లనూ, కంపునూ, బంధాలనూ, క్రౌర్యాన్నీ, సొఫొకేషన్ పరిసితినీ దేవునిపేరుమీదా, మతంపేరుమీదా, సంప్రదాయం పేరుమీదా సమర్థించుకున్న వాళ్ళందరూ, ఈ గబ్బును పరిమళంగా చాటి చెప్పుకోవడానికి ఉపనిషత్తులనూ, వేదాలనూ వాడుకున్న వాళ్ళందరూ ఇప్పుడు చలాన్నికూడా వాడుకుంటున్నారని, దేవుని పేరుమీద ఏఏ దుర్గంధాన్ని సమర్థించారో దాన్నే ఇప్పుడు 'చలం' పేరుమీద కూడా సమర్థించ చూస్తున్నారని, చలం భగవాన్ ఆశ్రయంలో ఉండటం అనే స్థితి వాళ్ళకు ఇందుకోసం ఉపకరిస్తూ వున్నదని చలానికి తెలిస్తే రమణాశ్రమం నుంచి చలం పారిపోయి మళ్ళీ మన మధ్యకు వస్తాడని. అయితే ఇందుకు మినహాయింపు ఒక్కటే_పారిపోదామనుకున్న క్షణాన ఆయనకు ఆయన శారీరక, మానసిక ఆరోగ్యం అందుకు అనువుగా వుండాలి!

("ఔనా చలంగారూ! 'నన్ను వాళ్లు తప్పుడుగా వ్యాఖ్యానిస్తున్నారు_తిరుగుబాటును నేను సర్వదా సమర్థిస్తూనే వున్నాను_భగవాన్ కూడా సమర్థిస్తూనే వున్నారు_నన్ను మిస్ కోట్ చేస్తున్నారు_దానికి నా తప్పేంలేదు' అని సమర్థించుకుంటారా? ఉపనిషత్తులను, వేదాలను, మతాన్ని, సంప్రదాయాలను అన్నింటినీ మిస్‌కోట్ చేశారు! ఇంద్రుని పీఠంక్రింద దాక్కున్న తక్షకున్ని ఇంద్రుడు వదలించకోకపోతే_" సహేంద్ర తక్షకాయ స్వాహా! అనడం తప్ప గత్యంతరం ఉండదు.)

ఇందాక నేను మొదటే చెప్పినట్లు చలం ప్రధానంగా సాహిత్యకుడు. కనుక ఆయన ముద్రలు సాంఘిక సంస్కరణ అనే మహోద్యమం మీదికన్నా సాహిత్యంలో ఎక్కువగా కనపడుతూ వుంటాయి. సంఘంలో మార్పులు రావడానికి వీరేశలింగం పంతులుగారికున్న ఇంపాక్ట్ Impact సాంఘిక వ్యవస్థమీద చలానికుండక పోవచ్చు. అలాగే వీరేశలింగం సాహిత్యానికి కూడా అంత Impact ఉండదు,

సంఘ సంస్కరణకు చలం సాహిత్యం ఉపకరించినంత శక్తివంతంగా ఆయన జీవితం ఉపకరించదు; అలాగే వీరేశలింగం పంతులుగారి జీవితానుభవాలు ఉపకరించినంత బలీయంగా ఆయన రచనలు ఉపకరించవు.

వ్యాకరణ పండితుల్ని ఒక ప్రశ్న అడగాలనిపిస్తున్నది. వ్యావహారిక భాషలో రాస్తే — వ్యావహారిక భాష కాలంతోబాటు గబగబా మారుతూ వుంటుంది కనుక, ఈ కాలంలో రాసిన వ్యవహారిక పదజాలం పదేళ్ళ తర్వాత ఎవరికీ అర్థంకాకుండా పోతుందన్న వాదం ఎంత తప్పుడు వాదమో, అర్థ శతాబ్దం క్రింద చలం రాసిన పుస్తకాలు రుజువు చెయ్యడం లేదా ! అర్ధ శతాబ్ద దాకా తన రచనలు సజీవంగా బ్రతికి ఉండి, నిత్యనూత్నంగా, ఉండడం కన్న, సజీవంగా ఉంటూ వుండటంకన్న, ఏభయ్యేళ్ళ తర్వాత చదివినా ఇంకా కొత్త పరిస్థితులకి అనుగుణంగా నేటి సమాజానికి చూపుటద్దాలుగా ఆ రచనలు కనపడుతూ ఉండటంకన్న రచనకు సార్థకత ఏం కావాలి ? మరో ఏభై ఏళ్ళ తర్వాత ఆ భాష అర్థం కాకుండా పోతుందన్న బెంగకూడా లేదు — అయినా మరో యాభయి ఏళ్ళదాకా ఆ రచనలన్నీ సజీవంగా ఉంటూ ఉండాలంటే ఈ సంఘం ఇంకా ఇలాగే ఈ కుళ్ళు కంపుతో మరో యాభయ్యేళ్ళు కొనసాగాలన్న దుష్టకాంక్షలేదూ మనసులో ?

చలం ఉండనీ పోనీ; రమణాశ్రమంలో దాక్కోనీ — మ్యూజింగ్స్ రాసుకోనీ — భగవాన్‌కు అర్పితం కానీ — అత్యంత మూఢ విశ్వాసాలను పట్టుకొని వేళ్ళాడ్డానికి కొత్తగా పన్నాగాలు పన్ననీ — అష్టగ్రహ కూటాలను నమ్మి మిత్రులకు కార్డులు రాయనీ — అర్థ శతాబ్దం క్రితం చలం సాహిత్యం సంఘంలో తెచ్చిన తిరుగుబాటు మాత్రం చల్లారదు. దాని ప్రాధాన్యత మాత్రం తగ్గదు — దాని పరిణామాలను సంఘం అనుభవించక తప్పదు. జీవితాంతం పెళ్ళిళ్ళు చేసుకోకుండా — (సన్యాసాశ్రమాలూ స్వీకరించక) నలుగురిలో తిరుగుతూ "నాకు స్వంత పెళ్ళాం లేదు." అనో "నాకు స్వంత మొగుడు లేడు" అనో సగర్వంగా చెప్పుకుంటూ పరువూ ప్రతిష్ఠల్తో తలెత్తుకుని తిరుగుతున్న స్త్రీ పురుషులను ఇవాళ సంఘంలో చూడగలుగుతున్నామా లేదా? చాటుకు వీళ్ళను తిట్టుకుంటూ వుండేవాళ్ళు చాలామందే ఉండనీగాక; కాని వాళ్ళు తాము నడుస్తున్న దారులను తలెత్తుకుని నడుస్తున్నారా లేదా ? తమ బ్రతుకులను సగర్వంగా బ్రతుకుతున్నారా లేదా ? తిరుగుబాటు చేస్తున్నందుకు వచ్చే బాధలను — సహర్షంగా స్వీకరిస్తున్నారా లేదా ? వీరికి చలం సాహిత్యం గుండె నిబ్బరాన్ని కలుగజేయడానికి ఉపకరించడం లేదూ ?

ఆనాడు చలం స్త్రీని బంధాలు తెంచుకొమ్మన్నాడు — ఇప్పుడు బంధాలు తెంచుకున్నానంటున్న స్త్రీని "కొత్త బంధాలు తగిలించుకోక !" అని హెచ్చరిస్తున్నాడు.

అనాడూ— ఈనాడూ కూడా చలం బంధాల్లో ఉండటమే స్త్రీకి శ్రేయస్కరం— భూషణం అని అనలేదు; అనడని నా విశ్వాసం. చిన్నప్పుడు తలిదండ్రులకూ, యవ్వనంలో భర్తకూ, ముసలితనంలో కొడుకులకూ మొత్తానికి చిరకాలం స్త్రీ మగాడికి బానిసగానే ఉండాలెగాని "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని చలం ఇంకేనాటికీ అనడని నా విశ్వాసం.

చలాన్ని తలచుకున్నప్పుడల్లా ఆయన బ్రతుకు గురించి కాదుగాని, చావు గురించి బాధాకరమైన విషయం తోస్తూ వుంటుంది. సంఘాన్ని, కాలాన్ని గడగడలాడించి, అనేకమంది కలల్లో సైతం కనపడుతూ తుఫానులా విజృంభించిన ఒకనాటి చలం చివరికి ఎవరూ ఏమీ అనుకోకుండా... మౌనంగా అసువులు వదులాడా అని? పోతే పోయాడు! పోయినందువల్ల ఒరిగిన నష్టమేమీ లేదు!" అన్న ధీమా ఈ సంఘానికి కలుగజేస్తుందా ఆయన మృత్యువు?

———

పెద్దవారి యడల దేవుళ్ళ యడల గురువుల యడల నరకం యడల భర్త యడల పాపం యడల వున్న యిప్పటి భయమంతా, భక్తిగా మారనన్నా మారాలి, పోనన్నా పోవాలి. ఈ చిన్నప్పటి భయాలే, లోకంలోని, యీ మూర్ఖానికీ, బానిసత్వానికీ, క్రూరత్వానికీ, కారణం. కనక భయాలను నిర్మూలం చెయ్యగలిగితే ప్రపంచం యింతకన్న చాల ఆరోగ్యవంత మౌతుంది. ప్రజల స్వభావాలు యింతకన్న చాలా ఔన్నత్యాన్ని పొందుతాయి.

— చలం

(భయం—బిడ్డల శిక్షణ)

# చలమంటే అన్వేషణ

—'జయసూర్య'

లలనా,

ఈ లోకమింతే !

ఏ సత్యమూ లేని

దూరమూ కాలమూ అనే పడుగు పేకలపై

జ్ఞానకాంతి మెరిపి చే తళుకు రూపాలు

ఇదో బొమ్మలాట !

'సుధ' లో చలం

ఒక్క నిమిషంకూడా విశ్రాంతి యివ్వక మహాప్రణయ మారుత వేగాల మీదనో, అగాధ వియోగ భారం కిందనో చీల్చి నలిపి ఊపిరాడనీక తన జీవితాన్ని శాసించి పాలించిన స్త్రీలోకానికి చలం సందేశం యిది. చలం హృదయం నీళ్ళలేక ఎండి పోతున్న గడ్డిపోచ ఆర్తనాదాన్ని గాని, కాలికింద నలుగుతున్న చీమల రెక్కలచప్పుడు గాని వినలేదు. ఆ నాటి చలాన్ని అతి బలీయమైన కోర్కెతో చీల్చుకుపోయే పతితుల హృదయాలు కరిగించాయి. బూజుపట్టిన పాతివ్రత్యనియమాలు, నీతి చట్టాల కబంధ సాంఘిక నిబంధనలలో మగ్గుతున్న యువకతరాన్ని ఉత్తేజంతో శాసించారు. దరీ తెన్నూ లేని వ్యామోహంతో, తృప్తితీరని వాంఛలతో ఆక్రోశించే హృదయాలను దహిస్తూ కాలంలోంచి మనుషుల మధ్యలోంచి ఎదురుతిరిగి వ్యథను, బాధను తయారు చేసి అమృతం పంచిపెట్టారు. ఈశ్వరుడు లేని ఆయన 30 సంవత్సరాల జీవితం ఒకతీవ్ర

అన్వేషణగా రూపొంది మన సాంఘిక జీవనంలో స్వేచ్ఛాయుత జీవనానికై తీవ్ర కల్లోల సాహిత్యాన్ని సృష్టించింది.

"జాతకాల తుక్కు నా మనసులో ప్రవేశపెట్టి భీకరమైన దేవుళ్ళతో, నీచమైన దేవతలతో నా జీవితాన్ని నరకంచేసి కర్మజన్మల ఆంక్షలూ, భయమూ నా మనసులో పెట్టి పైగా యిప్పుడు మాట్లాడకుండా తప్పుకొంటున్నాడు" అని 1933 లో దీక్షితులు గారికి వ్రాసారు చలం. అప్పటికే ఆయన తర్కోక్షణతకు జంకి దిక్కులేకుండా దాక్కున్న భక్తిభావనా విహంగాలు కిలకిలమంటో ఆయన హృదయం పైన వాలు తున్నాయి. ఆధ్యాత్మికానందం నిద్రపోతూ మామూలుగా బ్రతికేవారికి లభించకపోవచ్చు కాని చలం వాంఛించిన సామాజిక సత్యాల మార్పులు, తనంతటతాను ఏకాకిగా లోన వెతుక్కుని నిస్సహాయంగా నలుగురిలో నలిగి, ధైర్యంతో నిలిచి తపించి అక్షర రూపంలోకి తెచ్చిన ఆ రచనలు మన సాహితీ సీమలో చిరస్మరణీయంగా నిలిచి తరించ లేని ఆరాధకులను తపింపచేస్తాయి.

"నా గ్రంధాలన్నీ అపార్ధమయ్యాయి దివ్యజీవనాన్ని నా పుస్తకాలలో ఎత్తి చూపాను. కాని నా పాఠకులు నీచశృంగారాన్నే రుచి చూసారు" అంటారు నేడు వేదనా యుతమైన చిఱునవ్వుతో అరుణాచలం నీడలలోని రమణాశ్రమంలో చలం. వ్యక్తిత్వం అనుభవంతో కూడిన జీవితానికి లొంగిపోతుంది హృదయం వున్న మేధావులు మనస్సులు అలిసి పోయేవరకు ఆలోచించటం సహజం. చలం తీవ్ర అన్వేషణ ప్రేమ నుంచీ, తన్మయత్వం నుంచీ పరిపూర్ణమైన మానసిక శాంతినీ, దివ్యమైన చిదానందాన్నీ పొందగలగటం ఆయన మానసిక అనుభూతి. తన పూర్వాశ్రమంలోని రచనలను ఈ స్థితిలో కూడా ఆయన సమర్థించు కోవటం భావ్యం కాదనిపిస్తుంది. "లోకంలో సుఖంగా జీవించటానికి కావలసిన ఆలోచనా సరళిని నా పుస్తకాలలో అందించాను. అమలులోఉన్న నీతుల, ఆచారాలు ఎట్లా ప్రపంచాన్ని కసాయికొట్టుగా మారుస్తున్నాయో చూపాను, ఉత్తమమైన నీతి ప్రేమ అనీ, ప్రేమంటే అర్పించుకోవటమని బోధించాను. అసలు నేను చాలా కొద్ది మందికొరకే వ్రాసాను. ఈ సంగతి పుస్తకాల్లోనే వివరించాను. జాగ్రత్తగా చదివితే మీకే తెలుస్తుంద" అంటున్నారు. కాని వ్యక్తిత్వపు పోకడ మారి వారి గ్రంథాలను అధిగమించిందనటంలో అతిశయోక్తి లేదు.

కరుణాంత రంగుడైన రమణుని దివ్య సన్నిధిలోని ప్రేమామృతా స్వాదన వలన చలం నేడు మహర్షి, ఆ లోకం సంగతి వేరు. 'జీసస్ జీవితం', 'శుభవార్తలు', 'భగవద్గీతా వ్యాఖ్యానం' మున్నగు రచనలతో ధర్మ ప్రబోధం చేస్తున్న యోగి, 'దైవమిచ్చిన భార్య', 'శశిరేఖ' 'ప్రేమ లేఖలు' ఉధృతమైన పదును సాహిత్యాన్ని సృష్టించిన చలం యికలేడు. ''నా జీవితాన్ని యీ భూమి మీదనే అమృతంతో నింపగల స్త్రీని యిచ్చారు భగవాన్ నాకు. తృప్తితో నిండిపోయినాను. కాని అంతటితో నాకు.

తనివి తీరలేదు. ఆ వెలుగుపైకి ఎక్కడికో ఇంద్రియాలతో అందుకోలేని ఆనందం వైపు చూపుతోంది" అంటారు 1945 లో చలం మహత్తర ఆధ్యాత్మిక అనుభవాల తర్వాత.

ఒక్కటి మాత్రం నిజం. చలం ఒక్క అంగలో నేటి ఆధ్యాత్మిక ప్రశాంతతను అందుకో గలిగితే తెలుగు సాహిత్యం ఎంతో కోల్పోయేది. ఆధునిక యువతరంపై చలం చైతన్యం ఎప్పటికీ ఉంటుంది. కాని సాహిత్య-లోనే కాక జీవితంలోను నూతనత్వాన్ని, నవ్యతను వాంఛించి తపిస్తున్న తిరుగుబాటు దారుల గమ్యం ఎటు ? చలం లాంటి విప్లవ సమాజ తేజోద్దీపకులు తమ తీవ్ర తపనలో అన్వేషించి సాధించిన మార్గమే శరణ్యమా? అందరికీ చలంలా శాంతి లభిస్తుందా? జీవితంలో నగ్నతను వాంఛించిన బీట్ త రాన్ని విధి వంచించటం గమనిస్తున్నాం. ఆంతరంగికమైన అనుభూతుల అన్వేషణలో విపరీత మానసిక కల్లోలాన్ని ఎదుర్కొంటూ చీకటి దారుల గుహలలోకి ఆవిమ తత్త్వంలో పయనిస్తున్న ప్రపంచ తిరుగుబాటు యువకుల ఆక్రోశ, ఆవేశాలు, అవిశ్రాంతత, సంఘర్షణల ఉప్పెనలు చల్లారుతాయా? ఉద్రేక ఉన్మాదాలతో గుప్తరోగాల ఆసుపత్రులలోకి, స్వేచ్ఛకోసం చట్టాల వ్యతిరేకం వలన జైలు కటకటాల లోకి, పిచ్చాసుపత్రుల బంధనాలలోనికి వెళ్ళిపోయిన యువకుల గమ్యం అదేనా ? మహామానవుని స్వప్నసాఫల్యంకోసం కృత్రిమజ్ఞానాన్ని తన్ని మనిషి తనలో నగ్నంగా వుండే ఘర్షణకోసం యువతరం పిలుస్తోంది. బహుశా మహర్షి మహేష్‌యోగి ధ్యాన శిక్షణకై మరిజువానా మత్తు జాజ్ సంగీతం వదిలి వచ్చి ఆకర్షితులైన బీటిల్స్ శాంతి పొందితే తుఫానుల కల్లోల ప్రజ్వలన క్షీణించవచ్చు.

క్షణికమైన జీవిత వైచిత్రినుంచి ఉద్భవించిన చైతన్యంలో చుట్టూ చీకటి, సంఘర్షణ, వేదనల మధ్య భావ స్వాతంత్ర్య తేజస్సుతో జీవిత రహస్యాలను అనుభవించి, శోధించి మృత్యువు సమీపించకుండానే ప్రాపంచిక శక్తులకు అతీతమైన ప్రశాంతతను సాధించిన చలం విజేత.

---

పిల్లలకి భయం లేకుండా వుండాలంటే ముందు పెద్దవాళ్లు తమ భయాల్ని వొదులు కోవడమూ మనసులోంచి కూడా భయాల్ని తరిమెయ్యడమూ తప్పదు. దెయ్యాలు, రైళ్లు, దొంగలు, పోలీసులు, అధికార్లు డాక్టర్లు, నీళ్లు,నిప్పులు, పాపాలు,కర్మాలూ, ఈభయాల్ని తామే కాక, ఇంట్లో బిడ్డలతో కలిసే మనుషుల నుంచి వొదిలించాలి. భయం లోపల వుంచుకొని బిడ్డకి ఆ భయం వుందని బిడ్డకి తెలియకుండా ప్రవర్తించడం అసాధ్యం.

— చలం
(భయం_బిడ్డల శిక్షణ)

# చెలం కథలు

—శ్రీపతి

శాస్త్రీయ దృక్పథమూ ప్రయోజనాత్మక కళా నిపుణత ఆధునిక సాహిత్య లక్షణం. ఈ ఆధునికత తెలుగు సాహిత్యంలో మొదటికథకుడు గురజాడతోనే ఆరంభ మయింది. సాహిత్యంలో చైతన్యం ప్రవేశించింది. ఒక సంఘంలోని జీవితపు విలువలకు ఏ శక్తులు మూలాధారమో తెలుసుకోవడమే శాస్త్రీయ దృక్పధం. ఈ శాస్త్రీయ దృక్పధానికి తెలుగు సాహిత్యంలో సన్నిహితంగా వచ్చిన వాళ్ళల్లో చెలం ఒకడు. సంఘంలో నెలకొనిఉన్న ఆచారాలు, సంప్రదాయాలు, సిద్ధాంతాలు, విశ్వాసాలు, శాసనాలు పరస్పర విరుద్ధంగా కనిపించి అతని తర్కానికి, వివేచనకి, ప్రశ్నలకి నిలబడ లేక పోయేసరికి తనదైన అన్వేషణ మార్గాన పడ్డాడు చెలం. దీన్నే ఆనాటి పెద్దలు విశృంఖ లత్వమన్నారు. సెక్స్ అన్నారు. బూతు అన్నారు. అవినీతిని ప్రోత్సహిస్తున్నాడన్నారు. అణచాలని ప్రయత్నించారు. కాని సాహిత్యంలోనూ, జీవితంలోనూ చెలం హేతువాది అయ్యాడు. అతడి ప్రభావం అనివార్యమయింది. సమకాలీన సాహితీ స్రష్టలను వెనక్కి నెట్టి అతడు ముందుకొచ్చాడు.

కథా వస్తువు —

సరదాకో, కీర్తికో చెలం కథలు రాయలేదు. తన లక్ష్య సాధనకోసం రాసాడు. తనచుట్టూ అసత్యాలన్నీ సత్యాలుగా చెలామణి అవుతున్నాయి. అన్యాయాలన్నీ పరువు ప్రతిష్టలని కొని తెస్తున్నాయి. డాంబికమూ, ఆత్మవంచన, శుష్కనాగరికత రోగాలుగా పెరిగి పోతోఉంది. మూర్ఖత, కౌర్యం, జడత్వం మనుషులలో సభ్యతగా సంస్కృతిగా

స్వీకరించబడుతోంది. వాటి సమష్టి ప్రభావం అతడిని కూడా అల్పత్వంలోకి ఇరికించేస్తోంటే మొదట తను తప్పించుకోవాలనీ, తనని సమర్థించుకోవాలనీ తర్వాత తన జాతిజనులను కదిలించాలనీ, ఆత్మలను జాగృతం చేయాలనీ, సొంత ఆలోచనా ధోరణిని ఏర్పరచాలనీ విముక్తి పోరాటం సాగించాడు. అందుబాటులో సాహిత్యాయుధం అతడి చేతికిదొరికింది. దాన్ని పుచ్చుకున్నాడు జీవితాన్ని ప్రతిబింబించటం, కళాత్మకంగా చెప్పటం కాదు అతడికి కావలసినది. జ్ఞానాన్ని మేల్కొల్పటం. సామాజిక అవ్యవస్థకి కారణంగా అతడి బుద్ధికి వివాహ వ్యవస్థ కనిపించింది. లైంగిక జీవితప్రాధాన్యత, ఆర్థికశక్తుల ప్రభావమూ వివాహ వ్యవస్థలోని కూటమిగా కనిపించాయి. అక్కడ కుటుంబ వ్యవస్థకి మూలముఉంది. సంఘనిర్మాణ ప్రమాణం (యూనిట్) అది. అంచేత వివాహ వ్యవస్థ రూపురేఖలని అన్ని కోణాలనించి చూపించాడు. ఆ వ్యవస్థలో పురుషుడు రక్షణ పొంది, స్త్రీని కీలుబొమ్మగా చేయటం చెలానికి కనిపించింది. స్త్రీ పురుషులు సంఘంలో సమానంగా భావించబడలేదు. మగవాడు నియంత అయ్యాడు, స్త్రీని దానిసని చేసాడు. జాతినీ సంఘాన్నీ బలహీనం చేశాడు. క్షుద్రం చేశాడు కృతకం చేసాడు.

అందుచేత చెలం వివాహ వ్యవస్థలోని ప్రేమ, శృంగారం, స్వేచ్ఛ, మోహం, ఆనందం, భావోద్రేకం (emotion), సహజాతం (instinct) యవ్వనం, ఆరాధన, అర్పణ, త్యాగం, స్వార్థం, సహనం, సౌందర్యం, వెతుకులాట, విరహం, విషాదం, మానసిక శారీరక జాడ్యాలూ, వంకరలూ, వ్యగ్రతలూ, భౌగోళికాధికారం, మానవ ప్రకృతుల గురించి చెప్పాడు. ఆ పరస్పర ప్రభావిత శక్తుల పోరాటాన్ని ఒప్పందాలని, పరాభవాలని విజయాలని ఎత్తి చూపించటానికి చేసిన బహుముఖ ప్రయత్నం ఆయన కథల్లో ప్రతి వాక్యంలోనూ, ప్రతి పదంలోనూ, ప్రతి విరామచిహ్నంలోనూ మనకి ఎదురవుతుంది ఆ కథలన్నిటా ఆయన తేల్చిన సిద్ధాంతం ఆత్మవికాసానికి ఆత్మని నిత్య జాగృతంగా నిలుపుకోవటానికి స్వేచ్ఛ ప్రధానం అని. ఆ స్వేచ్ఛలేకుండా వివాహం తల్లి పేరుతో, తండ్రిపేరుతో, భార్య పేరుతో, నీతి పాతివ్రత్యాల పేరుతో అరికట్టుతోండడం కనిపించింది.

వివాహం అంటే ఒక ఒప్పందం. పరస్పరం వాంఛించుకునే స్త్రీ పురుషుల మధ్యనా ఆ ఒప్పందం, లేక వాళ్ళ అవసరాలని గుర్తించిన పెద్దల (సంఘం) దా అన్న దగ్గరే చెలం తగాదా. పెద్దలని అంటేనే సంఘం పెత్తందనానికి, నియంతృత్వానికి వ్యక్తిని బలివ్వటం. పెద్దలు తమ స్వార్థ ప్రయోజనాలని చేర్చి ఒప్పందాన్ని క్లిష్టంచేసి అంగీకరింపచేయటం.

స్త్రీ పురుషుల్లో కూడా ఒకరిమీద ఒకరు తమ అధికారాన్ని ప్రకటించుకోవటం చెలం సహించలేడు. ఆత్మోన్నత్యంతో, మనోబలంతో, హృదయ విశాలతతో, స్వీయ

అర్పణతో, త్యాగాలతో, దీక్షతో ఎదుటివారి ఆరాధనని యోగ్యతని సంపాదించుకో మన్నాడు. ఇది ఆచరణలో కఠినతరమైనది. ఆచరించితే సాధించితే ఆజాతి సర్వోత్కృష్టమయిన దవుతుంది. పరిపూర్ణ మానవతావికాసం చెలంఅక్కడ దర్శించాడు.

ఐశ్వర్యాలని, అధికారాలని చెలం నిర్లక్ష్యంచాడు. గాంధీ, మార్క్సులకి ఈ అంశంలో చెలంవాదం సన్నిహితం. ఆస్తి సంపాదనకి ఎంతటి అప్రధాన్యత ఇచ్చాడంటే ఆ లేమితో వాళ్లు పరాన్నభుక్కులుగానో, ఆర్థిక బానిసలుగానో తయారయేంత వరకు ఇది చెలం పెద్ద బలహీనత.

'ఎందుకు?' కథలో నాయకి జమీందారిణి. పెళ్ళయిన నాలుగేళ్ళలో భర్త చని పోతాడు. తర్వాత ఆరేళ్ళవరకు ఆమెలో మార్పులేదు. తర్వాత ఏడాదికి ఆమెకీ కమతగాడికీ సంబంధం ఏర్పడతుంది. లేచిపోతుంది. పేదరికంలో దుమ్ముతో కంపుగా తయారయింది. తిండీలేక కృశించింది. మురుగుకాల్వల పక్కన దుమ్ము పేలికలతో బతుకు. వాడు తాగుతాడు. తన్నుతాడు. ఇంత పతనాన్నికూడా తన్నడాన్నికూడా చెలం అక్కడ సమర్థిస్తాడు. ఏమని అడిగితే 'రక్తాలు కక్కుకునేట్టు స్త్రీని గుద్దడం చూశాను, మొగాళ్ల మొహాలు కసితో కొరుక్కోవడాలు చూశాను' అని ఆ నాయికి సంప్రదాయ సంఘంలోని మనుషులను ద్వేషించి, 'నాకోసం మీరు పడే డిగులుచూసి నాకు నవ్వుగా ఉంది. మాటలతో చెప్పడం కష్టం. పురుషుడినించి మీరెరిగిన ఆదరణ నగలూ, చీరెలూ– భార్యలూ– వండిపడుకుని కనే మనుషులు– అంతే ఎట్లా చెప్పను? నువ్వు—ప్రత్యేకంగా నువ్వు అనేగుర్తు–తన్నడానికైనా నువ్వేకావాలి నిన్ను గుర్తించి, నిన్నేకోరి, మాటలతో సాధ్యం కాదు ఆ అనుభవం–నీ లోపల్నించి. నిన్ను తెలుసుకొని బంధించనీ, చంపనీ, లాలించనీ–ఎంతో గొప్ప తృప్తి–చెపితే తెలీదు___' తనని సమర్థించుకుంటుంది.

ఈ వాదాన్ని చలం వేదాంత ప్రమాణ గ్రంథమైన యోగవాశిష్టంలోని కథతో బలపరుస్తాడు. ఇంద్రద్యుమ్నుడి భార్య అహల్య ఇంద్రుడనే ఒక తిరుగుబోతుతో సంబంధం పెట్టుకుంటుంది. తెలిసికొని రాజు వాళ్ళను చెరువులో పారేయిస్తాడు. ఆ నీళ్ళలో వాళ్లు నవ్వుతారు. కాగేనూనెలో వేయిస్తాడు. దాంట్లోంచి కూడా 'రాజా ఇద్దరం కలిసే ఉన్నామనే ధ్యాసలో మేము వోలలాడుతున్నాము.' అంటారు. ఏనుగుచేత తొక్కిస్తాడు. ఇనప కడ్డీలతో. కొరడాలతో కొట్టిస్తాడు. వాళ్ళకి బాధ కలిగినట్టు కనపళ్ళేదు. రాజు ఆశ్చర్యపడి పిలిచి ప్రశ్నిస్తాడు.

'రాజా, ఏ శిక్ష, బాధ మమ్మల్ని వేరు చెయ్యలేవు. లోకమంతా అహల్య రూపంతో నా రూపంతో నిండింది. అన్నిట్లో మేము ఒకరికొకరం కనబడుతున్నాం. నేను ఆమె మొహంకేసి చూస్తాను. ఆమె నాకేసి చూస్తుంది: ఆ ఆనందంలో మా

శరీరాలు మారుతెలీవు. మనసు దేనిలోనన్నా లగ్నమైతే ఆ శరీరంలో బాధగోచరించదు- లోకంలో ఏదికూడా తాను ప్రేమించే వాస్తువునుంచి మ న సు ను కదల్చలేదు. ఈ శరీరాన్ని నశింపజేసినా, మనసులు తమకి ఇష్టమైన కొ త్త శరీరాలని తీసుకుంటాయి.' అని సమాధానం.

అపును యోగవాశిష్టమూ నిజమే. చలమూ నిజమే. మన సత్వశాస్త్రం అంగీక రిస్తుంది. మనసు దేనిలోనన్నా లగ్నమైతే ఆ శరీరంలో బాధ గోచరించదు. లోకంలో ఏదికూడా తాను ప్రేమించే వస్తువునించి మనసును కదల్చలేను. కాని కథలోని నాయకి కమతగాడు ఏళ్ల కలిసి జీవించినా పిల్లలు కలుగరు. వాళ్లు వ ం ధ్యు లా? లేక కని చంపుతున్నారా! ఆ పిల్లల జీవితం ఏమిటి? ఆకలికీ, రోగాలకీ, పేదరికానికీ, అల్పాయుష్కతకీ వారసత్వమేనా వాళ్ళకి దిక్కు. ఈ ఉద్దేశంనించి చలం తప్పించు కుంటాడు.కథలోనికి రానివ్వడు. దాన్ని ఆలోచింపకుండా రీడర్ని తన బలంతో నెట్టుతాడు. కాని దీనికి చలం సమాధానం ఉంది.

'వివాహానికి ఇంత ప్రాముఖ్యత ఇవ్వడంలో వొచ్చిన భేదం అది.'

'కామం తీర్చుకోవడం స్త్రీ హక్కు, ఆ ఉద్యమంలో ఇవన్నీ (సంపదలూ, స్నేహాలూ, అనురాగాలూ) త్యాగం చేయవలసి రావడం దుర్మార్గపు సంఘ నియమాల వల్ల.'

'ఎందుకు' కథలో నాయికకి పిల్లలేరు. లేచి పోగలిగింది. మరి పిల్లలే ఉంటే చలం ఆ స్త్రీ సమస్యను ఎట్లా చూపుతాడో 'వొంటరితనం' కథలో తెలుసు కోవచ్చు.

'వొంటరితనం' కథలో నాయకుడు వెంకట బ్రహ్మం డిప్టీ సూపరింటెంట్. అతడంటే దొంగలకే కాదు, మంచివాళ్ళకీ, మేస్ట్రీటుకీ, తక్కిన ఇన్‌స్పెక్టర్లకీ హడలు. అతడి భార్య సుభద్ర, ముగ్గురు పిల్లలు. పిల్లలే అతనికి ప్రాణం. తన భార్యతో రైటర్‌కి సంబంధం. అది తెలుస్తుంది. దాంతో తన ముగ్గురు పిల్లలు తన వాళ్ళవునా కాదా అన్న సందేహం అతని గుండెల్ని పీకుతుంది. అతడు భార్యను కఠి నంగా మాట్లాడేటప్పటికి ఆమె 'నేనే బయటికి వెళ్ళిపోతా' అంటుంది. ఆమె వెళ్ళిపోతే అతడికి సంఘంలో అవమానం. చివరికి రైటర్‌ని బదిలీ చేయించాడు. రైటర్ సెలవు పెట్టి ఊళ్ళోనే ఉంటాడు. వీధిలో తన్నించలేక పోతాడు. ఇంట్లో పట్టకానే సరికి భార్య పిల్లలతో సహా రోడ్డుమీదపడి గోల చేసేసరికి సిగ్గుపడి తన్నలేకపోతాడు. తనే బదిలీ చేయించుకుంటాడు. చిక్కులన్నీ వి డి పో తా య ని, కాని సుభద్ర రానంటుంది విధిలేక పిల్లల్ని తీసుకుని బదిలీమీద వెళ్తాడు. అక్కడ పిల్లలు తల్లిని స్మరించుకోనడం సహించలేడు. నౌకర్లు పిల్లలను సరిగా చూడటంలేదని బాధ. పిల్లవాడికి

జబ్బు వస్తుంది. చచ్చిపోతాడన్న భయంకొద్దీ తీసుకుపోయి తల్లిదగ్గర పిల్లల్ని పెడతాడు. రైటర్‌తో భార్య ఉంటుంది. మూడేళ్ళు గడుస్తాయి. పిల్లల్ని చూడాలన్న వ్యామోహంతో వెళ్తాడు, తండ్రిలేని లోటు గుర్తించకుండా పిల్లలు చదువుతోనో, ఆడుకుంటూనో కన్పిస్తారు. భర్త స్మృతన్నా లేకుండా చిన్నపిల్లకి పాట నేర్పుతో ఉంటుంది భార్య. రైటర్ ఈజీ చైర్లో కూచుని చుట్ట కాల్చుకుంటుంటాడు. అంతా కంఫర్టబుల్ ఫామిలీగా కన్పిస్తుంది. బాధతో వెళ్ళిపోతాడు వెంకటబ్రహ్మం. తరువాత నాలుగేళ్ళకి రైటర్ చనిపోతే మళ్ళీ వెంకటబ్రహ్మం వచ్చి సంసారంలో తన స్థానాన్ని నిలదొక్కుకుంటాడు. అదీకథ.

ఈ కథలో కుటుంబ వ్యవస్థమీద చెలం తిరుగుబాటు స్పష్టంగా కన్పిస్తుంది. వివాహం కల్పించలేని రక్షణ ఈ కథలో కట్టుబయలు చేస్తాడు. సుభద్ర తిరుగుబాటు ఫలిస్తుంది. రైటరుగాని, సుభద్రగాని వ్యభిచారులుకారు. బలమైన ఏకాగ్రత ఉన్న వాళ్ళు, పారిపోరు. జడవరు,పర్యవసానానికి సిద్ధపడతారు. పరిస్థితులను తమకి అనుకూలం చేసుకుంటారు. వాళ్ళకి పాపమూ పుణ్యమూ పట్టవు. పిల్లలని తనపిల్ల లన్నట్టుగానే చూసుకుంటాడు రైటర్. సొంతపిల్లలే కానక్కర్లేదు. ప్రేమ వాత్సల్యాలు తోటివారి అందరికీ స మా న ం. స్వార్థంతోకాదు ప్రేమవిజయం. మానవత్వంలో ప్రేమకి నిండుతనం. గెలుపు. అదే అతని సంస్కారం. అదే మనోబలం. అదే హృదయ విశాలత. ఇంతవరకు చెలం తనవాదనకి దగ్గరగా వచ్చాడు. కాని ముగింపులో తప్పటడుగు వేశాడు

రైటర్ చచ్చిపోతేనేకాని సమస్యకి పరిష్కారం లేకపోయింది. రైటర్‌ని చంపటంతో చలం తన సిద్ధాంతానికి వెతిరేకించాడు. సుభద్ర భర్తతో రాజీపడుతుంది. పిల్లలతో వెంకటబ్రహ్మం తనవారా కాదా అన్న అనుమానం మాని రాజీపడతాడు. అంటే కుళ్ళుబతుకునే సంప్రదాయబద్ధంగా నే బతుకుతారు. ఈ సంఘటన చెలం ఉద్దేశం లోని తీవ్రతని ధ్వంసంచేసింది. విప్లవానికి విజయంలేదు. రాజీ. కాని కథకి చెలం పెట్టిన పేరునుబట్టి సామాజిక సమస్యకి కాక వ్యక్తిగత స మ స్య కి ప్రాధాన్యత ఇచ్చినట్టు తెలుస్తున్నది. వెంకటబ్రహ్మం సెంటిమెంట్ల (రసభావాల) పుట్ట. భార్య అంటేపాతివ్రత్యం అనీ,పిల్లలంటే తనకీ తనభార్య పాతివ్రత్యానికీ దీపాలుఅనీ, భార్య తన ఆస్తిఅనీ - ఈ రకంగా వివాహం ఇచ్చిన రక్షణని వినియోగించుకోవాలను కుంటాడు. కాని తన యోగ్యతలను పెంచుకుని తన వ్యక్తిత్వాన్ని వికసింపజేసుకోడు, దుర్బలుడు. అతడికి కుటుంబం రక్షణ కావాలి. ఏకాంతాన్ని భరించలేడు. న్యూనతగా బాధ పడతాడు. సభ్యజగత్తు లోని కుటుంబ వ్యవస్థలోని కపట నాటకాన్ని కళ్ళముందు పెట్టడానికి ఈ కథ ప్రయోజనం పరిమితమయిపోయింది.

వివాహంకాని దాంపత్యం గురించి 'ఆమె త్యాగం' కథలో చలం దృక్పథానికి ఒక సూత్రీకరణ దొరుకుతుంది. ఆ కథలో నాయిక తలిదండ్రులు లేనిది. లోకానుభవం లేనిది. ఆమె బావ నమ్మించి ద్రోహం చేసాడు. ఒక ధనికునికి తర్వాత అమ్మాడు. ఆ ధనికుడు ఒక మిత్రునికి దానం చేసాడు. అట్లా దుర్వృత్తికి బలయింది. కథలో నాయకుడు శీతారామయ్య ఆమెని గౌరవిస్తాడు. తన ఏడైవేల ఆస్తిని ఆమెని అలంకరించేందుకు నైవేద్యంగా వెదజల్లుతాడు. చివరికి-రోగంవస్తే రక్షించుకోలేని పేదరికానికి గురవుతాడు. అయినా ఆమె తన కృతజ్ఞతతో శీతారామయ్య సేవ చేస్తుంది. వివాహ వ్యవస్థలో ఏ కట్టుబాట్లయితే స్త్రీ పురుషుల పరస్పర రక్షణకి ప్రధానమో అవన్నీ ఆమెలో ఉంటాయి. సహిస్తుంది. సొంత సుఖాలని విస్మరించి సేవ చేస్తుంది. నిగ్రహాత చూపుతుంది. ప్రియుడిని రక్షించుకోవటానికి తన సర్వం త్యాగం చేయటానికి సిద్ధపడుతుంది. అయాచితమైన దయా దాక్షిణ్యాలని తిరస్కరిస్తుంది. చివరికి రక్షించుకుంటుంది.

స్త్రీ పురుషుల మధ్య పవిత్రతకి ఒక ఒప్పందం అవసరం లేదు. ఒక ఔన్నత్యం కావాలి. యోగ్యత కావాలి, అని స్పష్టంగా చెప్పటం చలం ఈ కథలో చేసినపని. పెళ్ళి ప్రాధాన్యత ఎంతవరకు తగ్గించాలో అంతవరకు తగ్గించి చూపించడమే చలంఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యం వరకూ ఈ కథ సరిపోతుంది. ఏడైవేల ఆస్థిని ఆమెను అలంకరించేందుకు వెదజల్లాడు అనడంలో ఏ సంపదా ఆమె అవ్యాజానురాగానికి, అర్పణకి సాటిరాదు అని చెప్పటమే. మానవత్వపు విలువల దగ్గర ఐశ్వర్యాన్ని నిలబడనీయడు. ఆమెను దుర్వృత్తినుంచి రక్షించి శీతారామయ్య తనఔదార్యాన్ని చూపుకుంటాడు. ఆ ఔదార్యంలో తన అర్హతను సాధిస్తాడు. ఇదీ చలం కోరే యోగ్యత, పవిత్రత. మనసులో మలినమై బయటికి భక్తి నటించటం కాదు.

'ఓ పువ్వు పూసింది' కథలో తన దృక్పథంలోని సాంఘిక వ్యవస్థకు రాజ్యాంగ చట్టాన్ని రచిస్తాడు చలం. వివాహ వ్యవస్థను తొలగించిన సమాజ సృష్టికి తన ఆదర్శాలలో రూపకల్పన చేస్తాడు. మాతృ ప్రాధాన్యతగల సమాజంఅది. ఈ లోకానికి నూతన జన్మని ఆహ్వానించటానికి తల్లి సర్వస్వాన్ని త్యాగం చేయగల మాతృమమత మాధుర్యాన్ని మానవతా సంపదగా, సామాజిక ఐశ్వర్యంగా చూపుతుంది. తండ్రి-గాలి వెలుతురూ లాంటి ఒక శక్తి. అక్కడ ఆస్తులను మనుషులు దాచుకునే కృత్రిమ సంఘం లేదు. ఆ సంఘాన్ని రక్షించే శాసనాలు లేవు. వాళ్ళ దేవుడు పాపభీతి కలిగించడు. సృష్టిలయాల చిద్విలాసం అమృత వర్షం అక్కడ. పువ్వు పుట్టిన తర్వాత తండ్రిని గురించి తెలుసుకోబోతుంది.

తల్లి సమాధానం 'నేనే తెచ్చుకున్నాను నిన్ను; నా గారాబాన్ని, నా బంగారాన్ని నా ముద్దుల మురిపాన్ని నిన్ను'

పువ్వు జన్మానుభూతిని గురించి 'నువ్వేనా నా చేతిని పట్టుకుని నక్షత్రాల మధ్య నించి ఆకులో, నవ్వుతో నన్నిక్కడ దించింది.' పువ్వు తొలిసారిగా ఈ లోకంలో ఆకలి తీర్చుకున్న ఆనందం గురించి 'పువ్వు నోట్లోకి వెచ్చగా, తియ్యగా, వొంటినంతా సంతోషంతో నింపుతో పాలు వొచ్చాయి.'

పువ్వుకి యవ్వనం వచ్చిన శృంగారం—'తనలోకి ఆ లేత ఎండ, వెన్నెల, కింద గడ్డి నవనవ, ఆకాశంలోని నీలపు నునుపు, తన తండ్రి కొమ్మలబలం, కోవెలకంఠంలోని జాలి, గాలిలోని అర్థంలేని అల్లరి. తన తల్లి వేళ్ళకింది అనర్గళ సారం—అన్నీ ప్రవహించాయి.

'తన రేకల్లో తళతళలు. తన యీనెల్లో నున్నటి వృబుకు, తన బొడిపెల్లో పగలడానికి సిద్ధమైన మదపు సౌరభం, తన తొడిమలో విశాలమౌతున్న బలం, తన సమస్తంలో అగని, అంతులేని కారణంలేని కాంతి– 'అకస్మాత్తుగా తనని ముంచుతో' చీలుస్తో. పైన దొర్లి సముద్రం అలలుమల్లే, మూర్ఛలు తెప్పించే పరిమళం, తనని తల్లినీ గాలినీ, ఆకాశాన్ని నింపి పొర్లే అలలుగా, జ్వాలలుగా తనలోంచి పరిమళాలు–'

ప్రతి అక్షరం కావ్యాన్ని మించిన విలువల బరువుతో తను వాంఛించిన మధురమూ మహిమాన్వితమూ అయిన లోకాన్ని చూపిస్తాడు చెలం. ఆత్మపరమైన తాత్విక చింతన హృదయంగా గల అవ్యక్తజ్ఞాన తేజోవలయంగా ఆ కథని దృశ్యాలతో, శబ్దాలతో పరిమళాలతో మందపు పొరలఅడుగున దాగిన పాఠకుడి ఆత్మకి అందిస్తాడు చెలం.

**కథాశిల్పం :**

సాంఘిక పనితనం దృష్ట్యా చలం కథలు అపురూపమైనవి, విలువైనవి చాలా వున్నవి. రచనలో శిల్పశోభతో కళామయం చేస్తాడు కథని. ఒకే ప్రయత్నంలో మనసుకి గుండెకి బరువెక్కిస్తాడు. చెలం సృష్టించిన వాతావరణంలో ఆ పాత్రల సంఘర్షణలో లీనమై స్పందనతో రసానుభూతి పొందుతూ కథ ఆరంభించటంలో పాత్రలని పరిచయం చెయ్యటంలో, కథని పోషించటంలో, సంఘటన కల్పనలో, సంభాషణలలో, వాతావరణాన్ని నిర్మించటంలో తన ఉద్దేశాలవేపు కథని తీసుకుపోవడంలో పాఠకులని తన వేగంతో నడిపించటంలో, ముగింపులో, పాఠకునిచేత విశ్వసింప జేయటంలో, ఆలోచింపజేయటంలో తన విశిష్టతనే, విలక్షణతనే చూపిస్తాడు. పాఠకుని మేధావిగా భావించి గౌరవిస్తాడు. ఆ స్థాయిలో రాస్తాడు.

కథలో శిల్పంలో అతి ప్రధానమైనది వాస్తవికతను సాధించటం, వాస్తవికతని

సాధించలేకపోతె ఆ కథ కట్టుకథగా తయారవుతుంది. బిగి, బిగి పోతాయి. ప్రయోజనం చెడుతుంది. కథ మొత్తం చదివిన తర్వాత పాఠకుడికి తన చుట్టూ జరుగుతున్నట్టు అనిపించాలి. తను కూడా ఆ కథా లోకంలో ఒక పాత్రగా అనుభూతి పొందాలి. ఈ వాస్తవికతను సాధించటానికి ప్రధానంగా చెలం సాంఘిక వాతావరణాన్నీ, సమకాలీన సమస్యలనీ ఎన్నుకున్నాడు. అతడి భాషలున్న కొత్తదనం కూడా ఎంతో మెరుగుపెట్టింది.

"ఈ కాలంలో న్యూసుపేపరు రిపోర్టర్లతో, రేడియో మనుషులతో పనిలేనివాణ్ణి ఒక్కణ్ణి చూపించు. వాడికి నా ఖర్చుతో శిలా విగ్రహం కట్టిస్తాను.

"ఇంతవరకు మీరు రికార్డుల సంగీతం విన్నారు. అన్న మహా తెలివైన వాక్యం చెప్పడమేగా నువ్వు చేసేపని.

"ఆ మైక్‌కి ఉరేసుకుని చావరాదూ" —'కళ్యాణి' కథలో.

ఈ వాక్యాల్లోని న్యూసుపేపరు రిపోర్టరూ, రేడియో మనుషులు, శిలావిగ్రహం, రికార్డుల సంగీతం, మైక్‌లాంటి మాటలు వర్తమాన జీవితాన్ని ధ్వనింప చేస్తాయి పాఠకుని కాలంతో ముడివేస్తాయి. దాంతో పాఠకుడిని చుట్టుకుంటాయి.

"ఈ వివాహం జరగడానికి వీలుకలిగించిన అయ్యదేవర కాళేశ్వరరావుగారికి నమస్కారంతో ఈ కధని ప్రారంభించకపోతె చాలా కృతఘ్నులమౌతాము"

—మర్యాదస్తునికో కథ.

"అందుకనే పరిశ్రమలను జాతీయం చేయడం చాలా మూర్ఖమంటాను" అన్నాడు ఒక సేట్ అసందర్భంగా,

"రష్యాసంగతేమిటి?"—

"ప్రౌఢ స్తమానం వొడకాలి. ఎందుకంటే శుద్ధ ఖద్దరు ధరించేది"

—ముక్కాలిపీట

"సాయంత్రం లోపున ముసలమ్మను ఏం చేయదలచుకుందో నోటీసు ఇస్తోంది చిట్టి-కాంగ్రెస్‌వాదిమల్లే"

"మా క్లాసుకు అతడే మానేటర్. రెండేళ్లు మా టీచర్‌కన్నా మాపైన గొప్ప అధికారి అతను. అణా సెనగపప్పు కొనుక్కుంటే అర్ధణాకి పైగా అతనికి ముట్టేది"

—సినిమాసాయం

"ఎబ్బే యీ ప్రభుత్వం చేసే శాసనాలు ఏం లాభంలేదు. ఎన్నటికీ కలుషకోరు మమ్మల్ని (హరిజనుల్ని) ఎన్ని శిక్షలతో బెదిరించినా, ఇంకా రంధ్రాలు వెతికి తప్పించుకుంటారు. అట్లాకాదు. హరిజనులు విప్లవం చేసి మీ స్త్రీలకి హరిజన బిడ్డల్ని కనాలి" అనేవాడు.

—హరిజన సమస్య.

సాంఘిక వాతావరణాన్ని, చరిత్ర పరిణామ వేగాన్ని మెళుకువచూపి పట్టుకోవడం చెలానికి చేతనవును. దాంతో తన ఇతివృత్తానికి వర్తమాన జీవితపు బలాన్ని సాధిస్తాడు. చలంతోపాటు రాసిన చాలామంది కథకుల రచనలు ఈ రోజు పాతబడి పోవటానికి కారణం ఈ వాస్తవికత లోపించటమే. ఇతివృత్తంలో ఎంత బలమున్నా ఉండనీగాక వాస్తవికత ముఖ్యం. ఈ వాస్తవికతను సమగ్రమైన వివరణలను ఇచ్చి, శాస్త్రీయ జ్ఞానాన్ని జోడించి కూడా సాధించవచ్చును. కాని చెలం మాత్రం సాంఘిక వాతావరణాన్నీ, సమకాలీన చరిత్రనీ ఆధారంగా తీసుకున్నాడు. దాంతో ఆధునికత కూడా కనిపించింది రచనలో.

వాతావరణానికి భౌగోళిక పరిసరాలకి చెలం కథల్లో పాత్రలకి ఇచ్చినంత ప్రాధాన్యత ఇచ్చాడు. అసలు వాతావరణాన్ని తన కథల్లో ఒక పాత్రగా చేసాడు చెలం.

"వాళ్ళ వాంఛతో గాలినే నింపారు. ఎండకే మెరుగులు పెట్టారు, వాళ్ళ చూపులతో. వాళ్ళిద్దరూ దగ్గర చేరితేచాలు—విద్యుచ్ఛక్తులు మెరుస్తాయి, ఎండు హృదయాలను మండిస్తో."

జీవితశక్తే ఒకనూతన వికాసంతో ఎదిగే గడ్డిలో నవ్వుతోంది. పురుగులు తాగి తొక్కిన పువ్వులు ఊగుతో పాటపాడుతో గదిలోకి తొంగిచూసి స్వాగత మిచ్చాయి వాళ్ళిద్దరికి.

'కిటికీ వెనక సంపెంగ పొదమీదనే కూచుని వున్నాడు మన్మధుడు విల్లెక్కుపెట్టి, బాణం సంధించి, ఈ వేడి దేశపు ఉధృతపు హృదయ విదళితాలైన పరిమళాలతో దట్టించిన పుష్పాల్ని పొదలో ఇముడ్చుకుని పైగా ఆ సంపెంగ తీగమీద విల్లెక్కుపెట్టుకుని, చంపక పుష్పం సంధించి అనంగుడు పకపకనవ్వుతో' —పాపఫలాలు.'

'అతన్ని ఆనుకునే కూచుంది ఏడుపుమాని నల్లని సముద్రం వంకచూస్తో. శని అంగారకులు ఎర్రగా కనిపెట్టున్నారు వాళ్ళని.

'ఒక వేపునించి నవ్వుతు నీటి అక్షతలు చల్లి ఆశీర్వదిస్తోంది సముద్రం'

—తరుణుల చిత్తంబు.

'చంద్రవంక ఇంకొంచెం తూర్పుకి వొంగి నిన్నటి పరిచయాన్ని జ్ఞాపకం

చేసింది. తోళ్ళవాసనని నెట్టిగాలి పీస్తోంది దక్షిణం నించి, వసంత రహస్యాలని రక్తానికి పలుకుతో'
—స్టేషన్ పంపు.

'వాళ్ళమధ్య ఐక్యంచేసే మల్లెపువ్వుల పరిమళం. వాళ్ళిద్దర్నీ పలకరించి స్నాతకుల్ని చేసే దక్షిణపు గాలి.

'దక్షిణంనించి SOUTHERN CROSS లో పెద్ద నక్షత్రం వాళ్ళమీద మెరుస్తోంది.

'మెల్లిగా నవమినాటి చంద్రుడు పుబ్బతో ఉదయిస్తున్నాడు.

'పక్కమీద కూచుని కిటికీలోంచి ఆలస్యంగా పూసిన మామిడి పూతలతో ఆడుకునే మిణుగురు పురుగుల్ని చూస్తున్నాడు.'
—వెన్నెల తోటలు.

'బృహస్పతి నడినెత్తిన పొడిచాడు. విదియనాటి చంద్రవంక పసుపుమబ్బు సందుల్లోంచి జన్మనిచ్చుకుంది.

'ఆకాశం మధ్య వెలిగే సింహంలోని బృహస్పతి ఆలకిస్తున్నాడని పించింది.'
—ఎందుకు.

తన వాతావరణ వర్ణనతో కథ చెప్తాడు. కథలోని రసాత్మక భావాలని అలంకరిస్తాడు. తన ఉద్దేశాలకి సత్యసంపద నిస్తాడు. సమర్థించుకుంటాడు. ప్రతీకలుగా వినియోగించు కుంటాడు. పాఠకుని సెంటిమెంట్లని గౌరవించుకో పోతాడు పాఠకుడికి తెలీని అందాలని పరిచయం చేస్తాడు. దాంతో నవ్యత, రమ్యత సాధిస్తాడు. వాతావరణంలో చెలాని సామాజిక వాతావరణం కంటె భౌగోళిక వాతావరణం ఎక్కువ ఆకర్షించింది. నక్షత్రశాస్త్రంతో మంచి పరిచయాన్ని ధ్వనింపజేస్తాయి ఆయన వాక్యాలు.

'పడవవాళ్ళు ప్రేమ పాటపాడు తున్నారు'.
—వెన్నెల తోటలు.

'కాంతారాయుడు మూడుహత్యలకన్నా కారకుడని ప్రసిద్ధి లక్షాధికారి. ప్రభుత్వపు మంత్రులలో ఒకరిని సింహాసన మెక్కించిన మనిషి. డ్రైవర్ కట్టరు కళ్ళు తెరిచాడో లేదో బొబ్బిలి పాపారాయుకి మల్లే, ఒథెల్లో వేషంలో రాఘవాచారి మల్లే శబ్దం లేకుండా గర్జించాడు.'
—హరిజన సమస్య.

దూరంగా రొదచేసే మిలటరీ రైలు నాకు మెళకువ నిచ్చింది.

'శారదాంబను కనుక్కుందామంటే ఆమె నాటకాలజట్టులో ఆంధ్రదేశం పర్యటన చేస్తోంది.

'ఆరోజు శాంతారాం మద్రాసు వొస్తున్నాడు. మద్రాసు సినిమా ప్రపంచమంతా సెంటర్లో చేరుతోంది '
—మర్యాదస్తునికో కథ.

కాకినాడకి కాంగ్రెస్ వచ్చినప్పుడు సుందరశివరావు వాలంటీర్ల అధిపతికింద చిన్న అధిపతిఐ ప్రత్యేకంగా ఆఫీసు తెరిచాడు.

'బైటనించి జనసమ్మర్థపురొదా, రెండుమూడు భాషల్లో అప్పుడప్పుడు కీర్తనలూ, తాటాకు వాసనతో కలిసిన వాయిద్యాలూ కాంగ్రెసు భవనాలు యుద్ధ శిబిరం వలెనూ, తానొక నాయకుడి వలెనూ—

'అంత యెక్కువగా యీ మహమ్మదీయ మతంతో చేతులు కలపడం యీ హిందూమత సాంప్రదాయానికి విరుద్ధంగా కనబడుతోంది.

'సాయంత్రం కాంగ్రెసు జరుగుతోంది. అన్ని యేర్పాట్లు చేసి అలిసివచ్చి బొలీసుకి జేరబడ్డాడు.

'వూరినిండా పోస్టర్లు అతికించాలి.

'అసహ్యమైనవాళ్ళని వెళ్ళకొట్టడానికి కాంగ్రెసు నించి

'మర్నాడు సాయంత్రం అతన్ని యువకులు ఉపన్యాసమిమ్మన్నారు. వెళ్ళేటప్పటికి టీపార్టీ అయిపోయింది. నౌకర్లు తప్ప ఎవరూ లేరు.

'ఆమె ఒక్కతా వంటశాలల వెనక కూచుని వుంది.

ఇంగువతాలింపుల వాసనలు కొడుతున్నాయి.' —ప్రేమ పర్యవసానం.

ఇలాంటి వాక్యాలలో చెలం సాంఘిక వాతావరణాన్ని పట్టుకుంటాడు. ఆనాటి చరిత్ర కనిపిస్తుంది. కాకినాడలో కాంగ్రెసు జరిగినప్పుడు ఆ శిబిరాల్లో జరిగిన దేశ భక్తుల ప్రేమకి సంబంధించిన ఇతివృత్తం ఉన్నకథ ఇది. సాంఘిక వాతావరణానికి చెలం కథల్లో ప్రాధాన్యత బాగా తక్కువయినా లోపం కన్పించదు. ఉన్నకొద్దివాక్యాలూ అప్రయత్నంగా, సహజంగా, సాంఘిక జీవనాన్ని ధ్వనింపజేసేట్లు వొస్తాయి. 'అసహ్యమైన వాళ్ళని వెళ్ళకొట్టడానికి కాంగ్రెసులోనుంచి' అన్నమాటలో నైతిక క్రమశిక్షణ పాటించని కార్యకర్తలని బహిష్కరించి సంస్థను పటిష్టం చెయ్యాలి అన్న కాంగ్రెసు సంస్థలోని ఆందోళన ఇమిడి ఉంది, 'అంత యెక్కువగా యీ మహమ్మదీయుల మతంతో చేతులు కలపడం యీ హిందూ సాంప్రదాయానికి విరుద్ధంగా కనబడుతోంది' అన్న వాక్యంలో కాంగ్రెసులో కాకినాడలో ఆరంభమయిన జిన్నా మతతత్వం స్పష్టమౌతోంది. పాకిస్థాన్ ఏర్పాటుకి పడిన బీజాలు కనిపిస్తున్నాయి.

కథని ఆరంభించటంలో అద్భుతమైన ప్రతిభని, మెళుకువనూ చూపిస్తాడు చెలం కథనీ, కథలోని ప్రధాన ధ్యేయాన్ని, విశిష్టతనీ మనోహరంగా పరిచయం చేస్తాడు. సూటిగా, క్లుప్తంగా సుందరంగా చెప్పటం కథని ఆరంభించటంలోని ఆతడి అందం.

'శంకర్ చాలా ఆంబిషన్‌గల యువకుడు. యం. ఎస్. సి. ఐనాడు. కాని ఉద్యోగాలు లేవు. జర్నలిజంలో వినుతికెక్కాలని అతని ఆదర్శం. భార్యని కాపరం చేయించమని తొందరచేస్తున్నారు అత్తవారు తప్పదు. ఏదో ఉద్యోగంలో ప్రవేశించాలి '

—'ఆరంభింపరు'.

ఈ వాక్యాలు అప్రయత్నంగా కథలోని ప్రధాన పాత్రనీ, అతడి పరిస్థితినీ, మనస్థితినీ పరిచయం చేస్తాయి. భార్యను కాపరం చేయించమని తొందర చేస్తున్నారు అత్తవారు అన్నవాక్యంలో నాయకుడికి పెళ్ళి అయిందని చెప్పడం జరుగుతుంది. అంతే కాకుండా అతడి సమస్యలోని నిజాయితీ ధ్వనిస్తుంది. కథలో రాబోయే సమస్యకు సూచన దొరుకుతుంది. ఎం. ఎస్. సి. పాసు ఐనాడు. కాని ఉద్యోగాల్లేవు. ఏదో ఉద్యోగంలో ప్రవేశించాలి అన్న వాక్యాల్లో సమాజ స్థితిగతులు, అతడి ఆందోళనా, జీవితాధార సమస్యలు వ్యక్తమవుతాయి. జర్నలిజంలో వినుతి కెక్కాలని ఆతడి ఆదర్శం, అన్న వాక్యంలో ఆ రోజుల్లో ఆంధ్రుల్లో జర్నలిజం అంటే చూపించిన మోజు, గౌరవం స్పష్టంగా కనిపిస్తుంది. స్పష్టత, క్లుప్తత, సహజత ఉన్న ధోరణిలో కథలోకి పాఠకుడిని లాక్కుపోవటం చెలంకి సులభంగా చేతనవుతుంది.

'గంటకి నలభై మైళ్ళ వేగంతో ఎగిరిపోతున్న కారు ఏమీ మారుమాట లేకుండా ఆగిపోయింది రోడ్డుమధ్య. అరగంటసేపు డ్రైవర్ కెలికిచూసినా, ఉలకలేదు పలకలేదు. ఈ అద్దెకార్లు ఇంతే. నమ్మడానికి వీల్లేదు అనుకున్నాడు వెనకసీట్లో కూచున్న డైరెక్టరు. అనుకుంటే చాలు యజమాని మాటని గ్రహించి పరుగెత్తే సజీవమైన జంతువుమల్లే. మంత్రబలంతో ఎగిరే పుష్పకంమల్లే వెళ్ళేకారు, ఏమాత్రం ఇన్టిమేషన్ లేకుండా వుత్తరాయిమల్లే అయిపోవడం ఎంత ఆశ్చర్యం అనుకున్నాడు అతనిపక్కన కూర్చున్న కథకుడు.

— హరిజన సమస్య.

"ఈ అద్దెకార్లు ఇంతే, నమ్మడానికి వీల్లేదు' అన్న వాక్యంలో డైరెక్టరు లౌకిక దృష్టి, "యజమాని మాటని గ్రహించి పరుగెత్తే సజీవమైన జంతువుమల్లే, మంత్రబలంతో ఎగిరే పుష్పకంమల్లేఅని అన్న ఉపమానాల్లో కథకుడి భావనాదృష్టిని చెప్పటంలో వాళ్ళ మన స్తత్వాలని పరిచయం చేస్తాడు. కారు మధ్యలో చెడిపోవడం, నిస్సహాయస్థితి రాబోయే సంఘటనకి ప్రవేశిక సిద్ధం చేస్తాడు.

'అర్ధరాత్రి అడవిలో పువ్వుపూసింది. చుట్టూ చీకటినిచూసి భయమేసి 'అమ్మా' అని ఏడ్చింది. ఆకులూ తొడిమలూ దగ్గరగా తీసుకుని భయంలేదని వూయించాయి ఆ తెల్లని పసిపువ్వుని'

—ఓ పువ్వు పూసింది.

అర్ధరాత్రి (అనంతమైన కాలం) అడవి (ప్రపంచం) పువ్వు పూసింది. (అహం ఆకారం దాల్చిన ఆత్మ జన్మ) చుట్టూ చీకటిని చూసి (లౌకిక విలువల మానవ సంఘం) భయమేసి (అర్థంకాక అలవాటు పడలేక) అమ్మా అని ఏడ్చింది (కొత్త జీవితంతో పోరాటం) ఆకులూ తొడిమలూ (ఆప్తులూ బంధువులూ) భయంలేదని వూయించాయి (సాంఘిక విలువలను నేర్పే బాధ్యత తీసుకుని) వూయించాయి (ఓదార్చాయి) ఆ తెల్లని పసిపువ్వుని (స్వచ్ఛమైన లేత ఆత్మని).

"స్టుడియో కేఫ్‌లో కూచుని వున్నారు వెంకుబాబూ, జాలయ్యా పకోడీలు నములుతో. దూరంనుంచి ఆర్కెస్ట్రా వినబడుతోంది. మూడువందలో మాటు ఆ పాడు పాటని వాయిస్తో___"

— తరుణుల చిత్తంబు

స్టుడియో, కేఫ్, పకోడీ, ఆర్కెస్ట్రా, మూడువందలోమాటు, నములుతో, వాయిస్తో___అన్నమాటలు జీవితంలోని ఇరుకుతనాన్నీ, విసుగునీ, గానుగెద్దు బతుకునీ, నిర్వ్యాపారతనీ, అసహనాన్నీ, మోడు జీవితాన్నీ ధ్వనించి ఒకబాధని వ్యక్తంచేస్తాయి వాతావరణమూ సిద్ధమవుతుంది.

"ఆమెని మొదట రైలుస్టేషను నీళ్ళపంపుదగ్గర చూచాడు సూర్యారావు. అతనికి ఆ వూరు గూడ్సు స్టేషన్‌కి బదిలీఐ ఆమెనుచూసీ, టిక్కెట్లుయిచ్చే గుమస్తా పని అయి వుండకూడదా అనిపించింది. ఆమె తక్కిన ఆడవాళ్ళతోరాదు నీళ్ళకి _ "

స్టేషన్ పంపు.

"నాకు సంఘంలోంచి వెలి. చర్చిలోంచి వెలి. నా తలిదండ్రులూ బంధువులూ దగ్గరికి రానీరు. స్నేహితులు మొహం తప్పించేశారు. నేను పాపాత్మురాలిని; నా బుద్ధి స్వతహా పాపబుద్ధి; తలిదండ్రులు బోధకులు, భర్త, దేవుడు, యేసుక్రీస్తు, అంతరాత్మ, దేవమాతలు, అందరూ వద్దని నాకు బోధిస్తూవున్నా కావలసి పట్టుబట్టి పెడబుద్ధితో దుర్నీతి మార్గంలో ప్రవేశించానని పుణ్యాత్ముల ఉద్దేశ్యం. జరిగిందేమిటో చెప్పనా ?"

___"నేనేంచెప్పను"

'On such night as this' అని ఆగాడు రాజయ్య ఉమ్మేసుకొనడానికి కిటికీ తెరచి వెన్నెలవంక చూస్తో _ "

___ ఆరాత్రి

"శ్రీధరరావు పల్లెటూరు చూసి ఎన్నాళ్ళయింది ! తన ఏభై ఏళ్ళల్లో మొత్తం మూడు నెలలన్నా గడిపాడో లేదో పల్లెటూళ్ళో, ఈనాడు గడపవలసి వొచ్చింది. కరణంగారి యింట్లో. గొప్పప్లీడరు, ఆ జిల్లాకి కాంగ్రెస్ ప్రభుత్వపు కౌన్సిల్ మెంబరు, పైగా తనవలె ఆరువేల నియోగులు తన వూరు, తన యింటికి వొచ్చారని గొప్ప

చేసాడు కరణం. భాగ్యవంతుడైన కరణంకన్నా శ్రీధరరావు నాలుగురెట్లు ఆస్తిపరుడు మరి.

— వెన్నెలతోటలు.

కథ మొదటివాక్యంలోనే పాత్రల స్వభావాలనీ, సాంఘిక పరిస్థితిని, వ్యక్తిత్వాన్నీ మెళుకువతో పరిచయం చేస్తాడు చెలం. దాంతో రచనలో స్పష్టత సాధ్యమవుతోంది. కథమీద, పాత్రలమీద, ఆ వాతావరణంమీద ఆసక్తి కలిగింపజేసి పాఠకుడినిపట్టి చదివింపజేస్తాడు. ఒక రచననిపాఠకుడు ఆసక్తితో చదవలేకపోతే ఆ రచన నిష్ఫలం. రచయిత అక్కడే ఓటమి. మరి పాఠకుడు చదువుకుంటూ, రచయితని అనుసరించుతూ పోవాలంటే అసమానమైన ప్రతిభ చూపాలి. తన భాషా సంపదతోనో, భావ సంపన్నతతోనో, కళా నైపుణ్యంతోనో, ఇతివృత్త బలంతోనో, రచనని సాధించి పాఠకుడిలో ఉత్సాహాన్ని కలిగింపజేయటం చెలానికి చేతనవును. ఎఫర్ట్‌లెస్‌గా వస్తుంది అతడి వాక్యాలకి ఆ బలం. ఎక్కువసార్లు చెలాన్ని ఓ పరిశోధకునిగా, సత్యాన్వేషిగా భావించి అతడి అభిప్రాయాలకోసం చదివినా – సహజమైన రచనా సౌందర్యం కూడా చెలం ఆరంభాల్లో ఉంది.

చెలం ముగింపుల్లో సమస్యను పరిష్కరించేసిన ఒక ధ్వనిని విడిచిపెడ్తాడు. దాంతో పాఠకునికి సంతృప్తి కలుగుతుంది. ఆ ముందుచెప్పిన భావాలతో కల్లోల పడతాడే తప్పించి ముగింపులోని బలంతోకాదు. అందుకే కథల ముగింపుల విషయంలో చెలం శ్రద్ధ తీసుకున్నట్టు కనిపించదు. మపాసా, ఓ హెన్రీల్లాంటి మెరపులు, మెలికలు, మలుపులు, చూపించటానికి ప్రయత్నం చేసినట్టు అన్పిస్తుంది. కళారాధన, ఆరంభింపరు, ఆమె త్యాగం, నేను మా ఆవిడ మిగిలాం, మోసంచేసిందా, కళ్యాణి, సినిమాసాయం కథల ముగింపులు మనకి ఈ విషయాన్ని ధృవపరుస్తాయి ఆ ముగింపులు బలహీనమైనవి. హంపీకన్యలు, దోషగుణం, కర్మఫలం, రావణదర్శనం, మర్యాదస్తునికోకథ, ఏకాంతరితనం, ప్రేమలేఖపంపు కథల్లో చెలం ఒరిజినాలిటీ కన్పిస్తుంది. అవి గొప్ప ముగింపులు.

తెలుగు సాహిత్యంలో మన స్తత్వ శాస్త్రం గురించి పట్టించుకున్న రచయితల్లో చలం ముఖ్యుడు. చలం 'బిడ్డల శిక్షణ'శిశు మన స్తత్వశాస్త్రం. చలం స్వీయ పరిశోధనల విజ్ఞాన గ్రంథమది. అట్లాంటి గ్రంథం తెలుగులో అదొక్కటే ఇంతవరకూ. ఈ శాస్త్రీయ దృక్పథం ఉంటం వల్లనే అతడు ఎన్నో సెంటిమెంట్లని అంగీకరించలేకపోయాడు. మనోరూపాలని యథాతథంగా చూపించాడు. దాంతో మనుషుల్లోని పిరికితనం, కుళ్లు, కపటం, కుట్ర, దొంగబుద్ధి, పాపభీతి లాంటి గుణాలు బయట పడ్డాయి. భౌతిక అవసరాలతో ముడిపడిఉన్న నీతి అవనీతులని ఎనలైజ్ చేయగలిగాడు, చలం పాత్రలు చైతన్యానికి, సహజతకి సజీవతకి విస్పష్టమైన సునిశితమైన పరిశీలనే కారణం. అతి సున్నితమైన, స్వల్పమైన గుణావస్థల్లో కూడా సహజమైన ఉద్రేకాన్ని

ధ్వనింప జేశాడు. సెక్స్‌తో సంబంధించిన సందర్భాల్లోని ఉద్రేకాలని చెప్పేటప్పుడు కవితావేశాన్ని సమృద్ధిగా ఉపయోగించు కున్నాడు.

ముఖ్యంగా చెలం కథల్లో కథకుడుకాక విమర్శకుడు, సంస్కర్త (తరచు చెలం) ఉంటారు. విమర్శకుడు, సంస్కర్తల జోక్యంతో కథలోని వస్తుగత గుణం దెబ్బ తింటుంది. కథకుడి స్వేచ్ఛ పోతుంది. ఈ రకమైన విమర్శకుడు, సంస్కర్తల గొంతులు సాధారణంగా రచనయొక్క ఏకాగ్రతనీ ఏకోన్ముఖతనీ భంగ పరుస్తాయి. కాని చెలం రచనలలో విమర్శకుడు, సంస్కర్త, రచయిత ఒకరికొకరు తోడై, విచిత్రమైన సమ్మేళనతో కళాత్మకమైన కొత్త ప్రయోజనాన్ని, నమ్మించే వాస్తవికతనీ ఆలోచింపజేసే ప్రేరణనీ, అనుభూతినిచ్చే ఉద్రేకాన్నీ కలిగిస్తుంది. ఆ ప్రయత్నం ఏది ఇతర రచయితలకి బలహీనతో అదే చెలంకి విశిష్టతనీ బలాన్నీ తెచ్చింది.

'ఆ రాత్రి కలయికని ఏ చెలమో కథలా రచించాడంటే ఏదో గొప్ప జ్యోతి వాళ్ళిద్దరి హృదయాల్లోనూ వెలిగిందనీ, దివ్య పుష్పవర్షం కురిపించారనీ అట్లా ప్రేమించుకున్న తరువాత వాళ్లు సాధారణ మానవత్వాన్ని దాటిపోయారని రాస్తాడు'
— మర్యాదస్తునికో కథ.

ఈ వాక్యంలో చెలం వాదాన్ని ఎత్తి చూపే విమర్శకుడు ప్రత్యక్ష మౌతాడు

'చలం పుస్తకాలంటే నాకు అసహ్యం. ఎందుకంటే కాయితాలు పక్క దుప్పట్లనుకుంటాడు అతను. ఆ మైదానం మధ్యకి పోయినాడా ఎవడన్నా అర్ధరాత్రి—మంచం చుట్టూ చీకట్లన్నీ స్త్రీ రూపాలు ధరిస్తాయి.' —కళారాధన.

'కథలోకి ఇద్దరు ఆడవాళ్ళను తీసుకొచ్చి, చలం ఇంత సేపు పూరుకున్నాడేం? అని తొందర పడుతున్నారా? వొస్తున్నాను. పాఠకుల్ని నిరాశపరిచే పాపం కట్టుకోను,' పాపఫలాలు.

'ఆ దైవం కనికరిస్తాడో లేదో చెప్పలేనుగాని నేను ఆమెకి ఆ వరమివ్వదలచు కున్నాను, నేను నా కలంతో మంత్రించి ప్రాణమిచ్చిన ఇంకో పుణ్యవతి – నేను యముణ్ణి. నా కలం పోటునించి ఎవరూ తప్పించుకోలేరు. వాళ్ళ పుణ్యఫలాలు అనుభవిం చిందాకా. ఆమె జీవితాన్ని సాఫల్య పరచిగాని వొదలను. ఆ లేడీనీ, ఆమెనే కాదు మిమ్మల్నీ విడవను. నా కథ చివరి అక్షరం మీ కళ్ళల్లోంచి వెళ్ళి, మీ నరాల్లో అగ్ని రేపి, మీ హృదయాల్ని కారుణ్యంతో— మీ హృదయాలేమిటి మిమ్మల్ని కరిగించి ఆర్ద్రం చేసేదాకా.' పాపఫలాలు.

'అదో చిత్రమైన కధ, ఈ లోకంలో యెన్ని తమాషాలనీ! బయటికి చెప్పామా అన్నీ అబద్ధాలంటారు ప్రతిష్టకోసం! నీకధలెందుకు వాస్తవం ముందు.'

అమ్మగారి అవసరం.

'చలం ఏమీ పాపం కాదన్నాడు' —కర్మ ఫలం.

'అందుకనే చలాన్ని చూస్తే నాకిష్టమైనా- సుప్రసిద్ధ రచయిత దుస్తులు ధరించినప్పుడు ఆ చలాన్ని దూరంగా కూడా భరించలేను.

'చచ్చినవాళ్ళ మీదకన్న బతికివున్న వాళ్ళమీద ఎక్కువ శ్రద్ధ చూపాలన్నారు, చలం శ్రీశ్రీ మొదలైన కవులు' —తరుణుల చిత్తంబు.

'ఏంరా ఆ చలం పుస్తకాలు చదువుతున్నావా ఏంటి ?' —స్టేషన్ పంపు.

చలం రచనలలో ఆత్మవిమర్శ ఘట్టాలు ఎక్కువ. అవి తులనాత్మక పరిశీలనతో ఉంటాయి, తనని మూడో వ్యక్తిగా చూసుకుని నిర్దాక్షిణ్యంగా నిశితంగా ఖండించుకుంటాడు, కఠినంగా క్రూరంగా దూషించు కుంటాడు గొప్పగా, అద్భుతంగా స్వీయ ప్రతిభనీ, ధీరతనీ ప్రచారం చేసుకుంటాడు. ఇవి రచయిత నిర్మల చిత్త ప్రవృత్తిని ఆంతరంగిక ఆందోళనని ఆత్మ చైతన్యాన్నీ వినిపింపజేస్తాయి. నిజాయితీని ప్రకటిస్తాయి, ఆవేదననీ, ఆత్మ స్థైర్యాన్నీ ఉన్నదున్నట్టు ఎప్పటికప్పుడు ఏ దాపరికమూ నటన, వంచన, సిగ్గు, చిన్నతనమూ లేకుండా సూనృతశక్తితో చూపుతాయి. తను చేర్చిన వ్యాఖ్యానాలు, విమర్శలు, శ్లాఘనలు ఆ కధలోని సన్నివేశానికి, సందర్భానికి అందంగా అతుక్కుపోతాయి. మరింత సహజతని చూపుతాయి. ప్రయోజనాన్ని రుజువు చేస్తాయి. శిల్పస్థాయితో కళాత్మకత పెంచుతాయి.

శిల్పంలోని సాంకేతిక పనితనాలతో కధ మొదటి అక్షరం నించి చివరి అక్షరం వరకు అందంగా వస్తువును పరచుకొస్తాడు. అదే కధారచనలో చలం సాధించిన కళాత్మకత,

చలం తన కధల్లో శృంగారానికే కాకుండా, హాస్యానికీ, వ్యంగ్యానికీ, హేళనకీ, విమర్శకీ, దూషణ భూషణలకి కూడా పెద్ద ప్రాధాన్యతనే ఇచ్చారు. అసంతా అతడి ఎమోషన్స్‌ను వచ్చింది వచ్చినట్టుగా చెప్పేవాక్యంలోని ఉద్వేగపూరితమైన దాచుకోలేని సంస్కరించని భావప్రకటన ఫలితం. ఆ గుణమే ఆయన వాక్యంలో కన్పిస్తుంది. చలం వాక్యం సంభాషణ శీలమైనది. సంభాషణలోని ఊపు, వేగం, విరుపు, నడక, ఉద్రేకాలను ఆ వాక్యాలు చూపిస్తాయి. కర్త కర్మ క్రియల క్రమత నియమాలను

పట్టించుకోడు. కామాలతో, సెమికోలన్‌లతో విరామ గీతలతో అస్పష్టతనించి తన వాక్యాన్ని శుద్ధి చేస్తాడు. ఎప్పుడో భవిష్యత్తులో క్రమాభివృద్ధి ఫలితంగా వచ్చే వాక్యం కొన్నిదశాబ్దాలు ముందుగానే స్వీకరించాడు చలం. నుడికారంలేదు. కాని పదప్రయోగాల్లో ఆంగ్లములోని పోకడలను తెలుగులో జూపించాడు. భాష చెలంకి స్వతీ ఉలీ అయింది. ఒక్కమాటలో – చెలం కథలు తెలుగు సాహిత్యంలో గర్వించే అమూల్యమైన నిధులు! అతడి సిద్ధాంతాలకి ప్రతినిధులు!



ప్రస్తుతపు విద్య బాగా లేదు. బడులు ఘోరంగా వున్నాయి. చాలా కాలం ఈ బడులలో చదివితే, బిడ్డకి కలిగే లాభాలకన్న నష్టాలు ఎక్కువ కలుగుతున్నాయి. ఆరోగ్యం నశిస్తోంది. మెదడు మందగిస్తోంది ఏది నమ్ముతున్నదో బిడ్డకే తెలీదు. జీవశక్తి నిశ్చయశక్తి ఆనందించే శక్తీ నశిస్తున్నాయి. మనుషులతో, కుటుంబంతో చక్కగా మెలిగి సౌఖ్యపడే తెలివి అసలు లేకుండా పోతోంది. జీవితంలో ముఖ్యమైన ఆనందం, శరీరం వెముకలలోంచి వాస్తోంది. సుఖమైన భోజనం, చక్కని స్నేహం, మనసులో శాంతి, స్త్రీని గొప్పగా అనుభవించడం ఆరోగ్యం– ఇవీ ముఖ్యం. ఇట్లాంటి శాంతినిచ్చేవే సరైన విలువలు. ఈ విలువలు పోయి, ధనార్జనా, అధికారం, పలుకుబడీ, ఆస్తీ, కీర్తీ, దర్జా, ఈ విధమైన విలువలు మనసులో స్థిరపడి, వాటి ప్రయత్నంలో ఏ సౌఖ్యము లేని అనాధలౌతున్నారు ఈ విద్యావంతులు. ఈ కొత్త విలువలు మనసు పైపైన పని చేస్తాయిగాని. లోపల ఏమి సుఖాన్నివ్వవు. అందుకనే అంత అశాంతిగా మిజరబుల్‌గా కనపడతారు ఈచదువుకున్న మనుషులు. ఇళ్ళకూడ పరీక్షలనే భూతాలు ఏమీ ఆటలకీ, విశ్రాంతికీ, స్నేహానికీ, అభిరుచులకీ వ్యవధినివ్వక, మనిషిని శరీరం మనసూ హృదయం పిండి పిప్పిని చేస్తున్నాయి. విద్య అనేపేరుతో ఎందుకూ కొరగాని జ్ఞానాన్ని మనసుల్లో ఎక్కిస్తున్నారు. చాలవరకు అది విషప్రాయ మవుతోంది.

— చలం

(విద్య–బిడ్డల శిక్షణ)

# చలం నవలలు

నవీన్

ఆ రోజు వాళ్ళింట్లో 'కార్యం.' ముత్తయిదువులు అమ్మాయిని అందంగా అలంకరించి అబ్బాయి గదిలోనికి త్రోసి గడియ వేశారు. లోపలున్న అబ్బాయి తననేం చేస్తాడో తెలియని అమ్మాయి హడలిపోయి అరిచింది. మొత్తుకుంది. కాని గది తలుపులు తెరచుకోలేదు భయపడుతున్న అమ్మాయిని దగ్గరకు తీసి, నెమ్మదిగా ఆమె భయాన్ని పోగొట్టే ఓపిక, సంస్కారం గదిలో ఉన్న అబ్బాయికి లేవు. ఆకలితో ఉన్న మృగంలా ఆమెమీద పడ్డాడు. ఇంకా భయపడిపోయిన అమ్మాయి పెడబొబ్బలు పెట్టింది. యేడ్చింది. హృదయవిదారకమైన ఆ అమ్మాయి రోదన ఆ యింట్లో అరణ్య రోదనమే అయ్యింది. అదంతా మామూలేనని ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు ఆ యింట్లోని పెద్దవాళ్ళు, ముత్తయిదువలు. కాని ఆ యింట్లోనే ఒక గదిలో అద్దెకుండి చదువుకుంటున్న మరో అబ్బాయికి ఇదంతా అతి ఘోరంగా, అతి అమానుషంగా కన్పించింది. ఆ యింట్లోని వాళ్ళంతా కసాయి వాళ్ళలా కన్పించారు ఆ గదిలో గుండెలు పగిలేటట్లు రోదిస్తున్న అమ్మాయిని ఒక బలి పశువులా ఊహించుకున్నాడు. ఆ అమ్మాయిని ఆదుకోవాలని అతని హృదయం వెర్రిగా మూల్గింది. అశ్రులు రాల్చింది. ఆక్రోశించింది. ఆనాటి ఆ సంఘటన ఆ యువకుని జీవితంలో అతి ప్రధాన పాత్రని వహించింది. నాలుగు గోడల మధ్య నిస్సహాయంగా తన కన్యాత్వాన్ని ఒక కసాయి వాడికి అర్పించిన ఆ అమ్మాయి ఆ యువకుడిలో స్త్రీజాతి పట్ల వాత అచంచలమైన అవ్యాజమైన అనురాగాన్ని, అభిమానాన్ని, ఆప్యాయతను సృష్టించింది. తరతరాలుగా మగవాడి ఆధిక్యత, అహంకారం క్రింద పడి నలిగిపోతున్న స్త్రీ జాతి ఉద్ధరణకోసం అతడు ఆ రాత్రే కంకణం కట్టాడు. కలం పట్టాడు. ఆ కలం కత్తికంటే వాడియైనది ఆ కలం తెలుగు వాడిని ఆపాదమస్తకం కదిలించివేసింది,

ఆ నాడు ఆ యింట్లో అద్దెకుండి ఆ భీకర హృదయవిదారక దృశ్యానికి కదిలి, కరిగిపోయి, కన్నీరుకార్చి కలం పట్టిన యువకుడే తర్వాత గుడిపాటి వెంకటచలంగా తెలుగు దేశంలో ప్రఖ్యాతిగాంచిన రచయిత.

చలంగారు రాసిన యే రచనను అర్థం చేసికోటానికైనా ఆయనకు స్త్రీ జాతిపై గల ఒక ప్రత్యేక అభిమానాన్ని అర్థం చేసికోవాలి. 'స్త్రీ' అనే తన పుస్తకాన్ని స్త్రీ లోకానికి అంకితంచేస్తూ చలంగారు యిలా రాశారు :

"ఒక్క నిమిషం నాకు విశ్రాంతి నివ్వక మహాప్రణయమారుత వేగాలమీదనో, అగాథ వియోగభారం క్రిందనో చీల్చి, నలిపి ఊపిరాడనీక నా జీవితాన్ని పాలించే స్త్రీ లోకానికి నివేదితం."

అలాగే తన శైలిని పొగిడేవాళ్ళకు సమాధానంగా చలంగారు ఇలా రాశారు :

"నాకు శైలి అనేది అసలు తెలీదని, ఆ విషయం శిరోమణిని అడిగి తెలి[illegible]కోవచ్చునని: నా జీవితం[illegible] ఈ స్త్రీ సమస్య వచ్చి నా హృదయంలో రక్తాన్ని ఉడికించినదాకా, ఈ విషయమై స్త్రీలని అర్థం చేసికోక సంఘం పెట్టే బాధల్ని నేను తెలిసికొని మండిపడ్డదాకా, నేను రాయగలననే నాకు తెలీ[illegible]ని ఇప్పటికీ ఆ విషయం తప్ప యింకేమీ వ్రాయటం నాకు చేతకాదని యెట్లా తెలియ చెయ్యను."

సంఘం క్రిందపడి నలిగిపోతున్న స్త్రీ చలం సాహిత్యానికంతా మూలం. స్త్రీ జాతి ఉద్ధరణకోసం రచన సాగించిన చలంగార్కి సాహిత్యంయొక్క ప్రయోజనం కేవలం సౌందర్యాన్ని, కళని సృష్టించటమే కాదు. ఒక సాంఘిక విప్లవాన్ని సాధించటం కోసం సాహిత్యం ఉపకరణం కావాలి. అందువల్ల తన సాహిత్యం ద్వారా సమాజంలో తను కాంక్షించే సాంఘిక విప్లవాన్ని తేవాలనుకున్నాడు చలం. ఒక నవలని చదివాక పాఠకుడు ఆ నవల బావుందనో, బాగాలేదనో అనుకొని ఆ నవలని మరచిపోతే ఆ నవల ప్రయోజనం వ్యర్థమే. ఒక నవల పాఠకుడిలో తుఫానుని సృష్టించాలి. అతని మస్తిష్కానికి పదును పెట్టాలి. అతన్ని ఆలోచించేట్లు పురిగొల్పాలి. మంచికైనా చెడ్డకైనా అతని జీవితాన్ని influence చెయ్యాలి. అప్పుడే ఆ నవలకి సార్థకత. ఇదే భావాన్ని చలంగారు దీక్షితులుగార్కి రాసిన ఒక ముఖ్య ఉత్తరంలో ఇలా చెలిబుచ్చారు :

"మంచి సారస్వతం రెండు రకాలు.

1. అందమైన పటమల్లే గోడని వేళ్ళాడుతో మనసుని అందాలతో నింపేది.

2. ఉరిమి, చించి, చెండాడి మంచికో చెడ్డకో జీవితాన్ని influence చేసేది.

మొదటి రకం సాహిత్యం ఇప్పుడు బళ్ళకొద్ది తయారౌతోంది. రెండో రకం చాలా స్వల్పం, రెండోరకం సాహిత్యాన్ని దేశానికిచ్చేది నేనొక్కణ్డే."

సాంఘిక విప్లవం లేక సంఘ సంస్కారం ప్రధానాశయంగా పెట్టుకున్న సాహిత్యం చలంగారిది. అందువల్ల చలంగారి నవలల్లో కథ, ఇతివృత్తం, పాత్ర చిత్రిణ, నాటకీయత, యదార్థ జీవిత చిత్రణ మొదలైనవాటికోసం వెదికితే లాభం లేదు. ఆయన నవలల్లో భావాలు ప్రధానం. చలంగారు తన కిష్టమైన భావాలతో పాఠకుడిని "ఉరిమి, చీల్చి, చెండాడి, మంచికో చెడ్డకో అతని జీవితాన్ని influence చెయ్యటం ఆయన నవలలో ప్రధాన లక్ష్యం. అయితే ఇలాంటి నవలలు సాహిత్య పరంగా ఎంత విలువైనవి? అన్నది విమర్శకులకు ముఖ్యం. ఏ రచన అయినా సమకాలీన సమాజాన్ని చిత్రిస్తూ, కొంత శాశ్వతత్వాన్ని సంతరించుకున్నప్పుడే అది సాహిత్య పరంగా విలువైనదౌతుంది. భావాలు ప్రధానంగా పెట్టుకున్న రచనలకు కాల దోషం పట్టే ప్రమాదం ఉంది. ఒకప్పుడు యెంతో కొత్తగా, కొట్టవచ్చినట్టు కన్పించే భావాలు కాలక్రమేణా మామూలై పోతాయి. పాతబడిపోతాయి, అందువల్ల వొకప్పటి ఆ భావాలని ప్రచారం చెయ్యటానికి రాయబడ్డ రచనకూడా పాతబడి పోతుంది. వొక ప్పుడు చలంగారు తన నవలల ద్వారా, తన అనేక రచనల ద్వారా యే భావాలనైతే ప్రచారం చేసారో అవ్వి ఇప్పుడు పాతబడిపోయినట్టనిపిస్తుంది.

ఉదాహరణకి ఆయన సాహిత్యానికంతా మూలమైన భావం–స్త్రీ స్వాతంత్రియాన్నే తీసికుందాము. ఈ రోజుల్లో పురుషులు స్త్రీ స్వాతంత్రియాన్ని అంగీకరించినట్లే కన్పిస్తు న్నారు. ఆడవాళ్లు ఇప్పుడు విరివిగా ఉద్యోగాలు చేస్తూఉన్నారు. వొక స్త్రీ ఈ దేశాని కల్లా అత్యున్నతమైన పదవిని ఆక్రమించ గలిగింది. అందువల్ల స్త్రీ స్వాతంత్రియాన్ని ప్రధానంగా పెట్టుకున్న చలంగారి నవలలు కాలగర్భంలో కలిసిపోతాయానే విమర్శకులు ఉండవచ్చు. కాని చలం నవలల కీర్తి, భవిష్యతులు కేవలం ఆ నవలల్లో చలం ప్రచారంచేసిన భావాలమీదనే ఆధార పడిలేవు. భావాలతోపాటు, శాశ్వతంగా నిలిచే సాహిత్య విలువలెన్నో ఆనవలల్లో ఉన్నాయి. అయినా ఆయన భావాలు కూడ యింకా పాతబడి పోలేదనవచ్చు. స్త్రీ స్వాతంత్రియాన్ని సాధించినట్లే కాన్పించినా, చలంగారు యే స్త్రీ స్వాతంత్రియాన్నైతే కాంక్షించాడో అది ఇంతవరకు సాధించబడలేదు. 1930లో రాసిన "స్త్రీ"అనే పుస్తకానికి 20 యేళ్ళ తర్వాత ఆ పుస్తకానికే రాసిన ఉపోద్ఘాతంలో చలంగారు ఈ క్రింది గొప్ప వాక్యాలని రాసారు:

"అత్త అధికారం నుంచీ, భర్త అధికారం నుంచీ తప్పించుకుంటున్న నవీన స్త్రీ షోకులకు, సంఘగౌరవానికి బానిస అవుతోంది. ఒక పురుషుడి నీడక్రింద నుంచుని లోకాన్ని ధిక్కరించ గల్గే యిల్లాలు ఈనాడు సంఘ గౌరవం పేర, విద్యపేర, ఉద్యోగం పేర, ఫ్యాషన్ పేర వెయ్యిమందికి దాస్యంచేస్తోంది. నవీన స్త్రీకి తన చుట్టూ స్త్రీలందరూ అత్తలయ్యారు."

ఈ నాటికి స్త్రీపడే పాట్లని నవలలుగా రాస్తూనే ఉన్నారు. ఈ నాటికి స్త్రీపడే పాట్లని సినిమాలుగా చూపించి డబ్బు చేసికుంటూనే ఉన్నారు. అందువల్ల చలంగారి సాహిత్యానికి ఆధారమైన 'స్త్రీ స్వాతంత్రియం'యే మాత్రం పాతబడి పోలేదు.

'స్త్రీ' పుస్తకంనుండే మరో ఉదాహరణ. అధిక సంతానంతో పడే అగచాట్ల కంటే గర్భం రాకుండా చేసికోవటం మంచిదనే సలహా యిచ్చాడు స్త్రీలకి. చలంగారు సలహా యివ్వటమే కాకుండా గర్భం కాకుండ ఉండటానికి కొన్ని సులభమైన పద్ధతుల్ని కూడా ఆ పుస్తకంలో సూచించాడు. అది ఆనాటి సాంప్రదాయ వాదులకి అతినీచంగా కన్పించింది. చలం భ్రష్టుడై పోయాడని గుండెలు బాదుకున్నారు. అవినీతిని వ్యభిచారాన్ని ప్రోత్సహిస్తున్నాడన్నారు చలం పుస్తకాల్ని కాల్చిపారెయ్యా లన్నారు (చలం గారే అన్నట్లు వొకసారి రహస్యంగా చదివాక!) హిందూ సంస్కృతిని మంట గలుపు తున్నాడన్నారు. కాని ఈ నాడు ఊరూరా, వాడవాడలా గర్భం రాకుండా చేసికోమని ప్రభుత్వం ఘోషిస్తున్నది. గర్భం రాకుండా ఉండటానికి యేంచెయ్యాలో రాయటమే కాదు, సినిమాల్లో చూపిస్తున్నారు. ప్రతిఉదయం వేంకటేశ్వర సుప్రభాతాన్ని ప్రసారం చేసే ఆలిండియా రేడియో గర్భం రాకుండా ఉండటానికి యేం చెయ్యాలో సవివరంగా తెలియ జేస్తున్నది.

నిజానికి చలంగారు యేక్రొత్త భావాన్నీ original గా ప్రతిపాదించలేదు. ఆయన భావాలు చాలావరకు ఈ శతాబ్దపు ఆరంభంలో యూరపులో బహుళ ప్రచారంలో ఉన్నవే—యూరపులో ఇబ్సన్, బెర్నార్డుషా లాంటి రచయితలు తమ సాహిత్యం ద్వారా యే భావాలని, యే సాంఘిక విప్లవాన్ని ప్రచారం చేసారో యించుమించు అలాంటి భావాలనే, అలాంటి సాంఘిక విప్లవాన్నే చలంగారు తెలుగు దేశంలో ప్రచారం చెయ్యడానికి ప్రయత్నించాడు. చాలావరకు కృతకృత్యుడయ్యాడు. చింతా దీక్షితులు గార్కి 25-1-1929 నాడు రాసిన వొక ఉత్తరంలో చలంగారు తన సాహిత్యాన్ని గూర్చి ఇలా రాసు కున్నారు.

"మన సారస్వతంలో (New channels of thought, and path of art) అభిప్రాయాల్లో కొత్త కాలవలూ, కళలో క్రొత్త మార్గాలూ ప్రారంభించిన వాళ్లు కొద్ది మంది ఉన్నారు, వాళ్ళల్లో నేనొకణ్ణి. ఈకాలపు రష్యన్, ఫ్రెంచ్ నాటకాలలో ప్రశస్తి

మైన వాటి రకాల్ని తెలుగులోకి ప్రవేశపెట్టాను. పశ్చిమ సారస్వతంలోంచి స్కాట్ తరువాత ఉద్దేశ్యాలేమీ తెలుగులోకి రానేలేదు ఇంతవఱకు నేను కొన్ని చాలా మంచివి రాసాను. కాని నా టెక్నిక్ అండ్ ఐడియాస్ చాలా పాశ్చాత్య వాతావరణాన్ని సూచిస్తాయి. కనక మన నేలమీద ఆరోగ్యంగా అభివృద్ధి చెందవు.

రాజకీయంగా, సాంఘికంగా ముందుదేశం యే విధంగా మారబోతుందో దాన్ని పట్టి ఉంటుంది. నా పుస్తకాల విలువ. ఒక్క మల్లే చేతల్లోను, ఆలోచనలలోను, యూరప్‌ని అనుకరించబోతే నేను గొప్ప పూజల్ని పొందుతాను."

సరిగ్గా అదే జరిగింది. మనం ఈనాడు అన్ని రంగాలలోను, మాటలలోను, ఆలోచనలలోను యూరప్‌ని, తదితర పాశ్చాత్య దేశాల్ని అనుకరిస్తున్నాము. అందువల్ల ఈనాడు చలంగారి నవలల విలువ హెచ్చిందేగాని తగ్గలేదు.

చలంగారు నవలల్ని రాసేముందు తెలుగునవల స్థితి ఎలా ఉందో గమనిస్తే చలంగారు తెలుగు నవలని ఒక ఆధునిక సాహిత్య ప్రక్రియగా ఎంత అభివృద్ధి చేసాడో తెలుస్తుంది. చలానికి ముందు తెలుగునవల సర్‌వాల్టర్‌స్కాట్ నవలల స్థితిలో ఉంది. ఆనాటి తెలుగు నవలల్లో జరిగే అభూత కల్పనల్ని, అసహజమైన శైలిని పరిహసిస్తూ చలంగారు "తెలుగు నవల" అనే ఒక వ్యంగ్య రచనని రాసారు. చలంగారి సమకాలికులు కూడా సాహిత్య ప్రక్రియగా నవల స్థానమేమిటో గమనించినట్టు కనిపించదు. ఉదాహరణకి అడివి బాపిరాజు నవలలు చదివితే తెలుస్తుంది. ఆధునిక సాహిత్య ప్రక్రియ అయిన నవలని, బాపిరాజు 16వ శతాబ్దపు ప్రబంధంగానో, కావ్యంగానో రాయబోయాడు. చలంగార్కి ముందు తెలుగు నవలని ఆధునిక సాహిత్య ప్రక్రియగా మలచిన రచయిత మరొకరు లేరనే చెప్పాలి. అలాంటి రచయిత ఎవరైనా చలంగార్కి ముందు తెలుగుదేశంలో పుట్టిఉంటే అతడు గురజాడ అప్పారావు. కాని గురజాడ నవల రాయకుండానే కన్ను మూసాడు. ఆ లోటుని చలంగారు తీర్చారు.

ఆధునిక యుగంలో సాహిత్యానికి, సామాన్యునికి మధ్య తఱిగిపోతున్న దూరంలో 'నవల' అతి ప్రధాన పాత్రని వహిస్తుంది. ఒకనాడు సాహిత్యం రాజులు, రాణులు, జమీందార్లు, పండితులు మాత్రమే అనుభవించ తగింది అనే అభిప్రాయం ఉండేది. వాళ్ళ అభిరుచులకు తగ్గట్టుగానే రచయితలు రచనలు చేసారు. ప్రపంచ చరిత్రలో కాలక్రమేణా రాజుల యుగం, రాణుల యుగం, జమీందారుల యుగంపోయి ప్రజ్వామ్యయుగం వచ్చింది. అలాగే సాహిత్యంలో కూడా ఈనాడు ప్రజాస్వామ్య యుగం సాగుతోంది. ఈనాడు సాహిత్యం యే ఒక్క తరగతి సొత్తుకాదు. సమాజంలోని ప్రతీ మానవుడు సాహిత్యాన్ని ఆనందించవచ్చు. సాహిత్యం ప్రతిమానవుడికి ఆనందాన్ని కల్గించాలంటే అది సామాన్యమానవుడికి అందుబాటులో ఉండాలి. సామాన్య

మానవుడి కలలూ, కన్నీళ్ళూ, బాధలూ, గాథలూ ఆ సాహిత్యంలో కళాత్మంగా దర్శన మివ్వాలి. అతని మస్తిష్కానికి సాహిత్యం పదను పెట్టాలి. అతనికి తనేమిటో తెలుసు కోవాలనే జిజ్ఞాసను సాహిత్యం కల్గించాలి. ఇలా సాహిత్యం సామాన్య మానవుడికి అర్థమై అతని సాంఘిక, ఆర్థిక సమస్యలకి కళారూపం యిచ్చి, అతనిలోని 'ఆత్మ'ని అతనికి తెలియజేసే జ్ఞానాన్ని యివ్వటంలో 'నవల' విజయవంతమైనట్లుగా మరే సాహిత్య ప్రక్రియ విజయవంతం కాలేదు. అందువల్ల ఆధునిక యుగంలో నవల కున్నంత ప్రాముఖ్యత మరే సాహిత్య ప్రక్రియకు లేదు. కాని ఆనాటి యింకా ఫ్యూడల్ వ్యవస్థని అంటిపెట్టుకున్న తెలుగు నవలా కారులు సాహిత్య పరిణామంలో క్రొత్తగా ఉత్పన్నమైన 'నవల' స్థాన మేమిటో గుర్తించలేక—నవలని కూడా పూర్వపు సాహిత్య ప్రక్రియల్లాగే ఉపయోగించుకో బోయారు. రాజులు, రాణులు, జమీందార్లు వీళ్ళనవలల్లో పాత్రలు. 18వ శతాబ్దపు కావ్యాల్లో యే కృతక గ్రాంథిక భాషను రాసారో ఆ భాషే, ఆ శైలే వీళ్ళ నవలల్లో దర్శనమిచ్చింది. సమకాలీన సమస్యలు, మారుతున్న సమాజం, మారుతున్న భావాలు, మారుతున్న విలువలు కాకుండా తమ అభూత కల్పనలతో, వేదకాలంనాటి భావాలతో తమ నవలల్ని నింపేసారు. గురజాడలాంటి ప్రతిభావంతుడైన రచయిత కారణంగా తెలుగు నాటకం, కవిత, కథానిక, ఈ వాతా వరణంనుండి బయల్పడి కొంత ఆధునికతను సంతరించుకున్నాయి. సరిగ్గా అలాంటి ఆధునికతను నవలకు ప్రసాదించి, నవలనొక mass media గా తీర్చిదిద్దిన ఘనత చలంగారిది.

గురజాడ అప్పారావుతో ఆరంభమైన వ్యావహారిక భాషా ఉద్యమం చలంగారి నవలతో శిఖరాగ్రం చేరుకుంది. ఈనాటికి కూడా చలంగారు రాసినంత సొగసైన వ్యావహారికాన్ని మరే తెలుగు రచయిత రాయలేదనుకుంటాను. వ్యావహారిక భాషా ఉద్యమ వ్యాప్తిలో చలంగారి రచనలు - ముఖ్యంగా నవలలు యేనాటికి చెరిగిపోని కీర్తిని సంపాదించుకున్నాయి.

చలంగారి నవలల్లో శిల్పంగాని, పాత్రచిత్రణగాని అంత ముఖ్యం కావు. నిజానికి చలంగారు రాసిన యే నవలనికూడా గొప్ప నవల అనలేము. అసలు గొప్ప నవల రాయటం ఆయన ధ్యేయంకానేకాదు. కథ చెప్పే నేర్పు, విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తుల్ని పాత్రలుగా మలచటం, తన సమకాలీన జీవితాన్ని యదార్థంగా నిష్పాక్షికంగా చిత్రించగల్గటం, ఆత్మ సంయమనం — వీటన్నిటిని కళగా రూపకల్పన చెయ్యటానికి కళాకారుడికి కావలసిన క్రమశిక్షణ - మొదలైనవి గొప్ప నవలరాసే నవలాకారుడికి ఉండాల్సిన ముఖ్యాంశాలు. ఇవన్నీ చలంగారిలో లేవనటంలేదు. కాని వీటన్నిటిని క్రోడీకరించుకొని గొప్ప నవలరాసే ప్రయత్నం ఆయన చెయ్యలేదు. పైగా కళాకారుడుగా చలం చాలా విశృంఖల జీవి. ఆయన కళకు నియమాలు,

నిబంధనలు లేవు. కళను ఒక ఫ్రేములో బిగించగల కళాకారుడు కాదు చలం. ఆయన జీవితంలో యే సంపూర్ణ స్వేచ్ఛని కోరాడో ఆయన కళలోను అంతే_ వొక ఆవేశపు ఉరవడిలో రాసుకుపోవటమే _ చలం D. H. Lawrence వలె conscious artist కాడు. conscious artist కాకుండా గొప్ప నవలకారుడు కాలేడు. కాని చలంగారి కీర్తి ఆయన గొప్ప నవలాకారుడు అవటం మీదగాని, కాకపోవటం మీదగాని ఆధారపడిలేదు. అసలు చలంగారే _ గొప్ప నవలాకారుడు కాదల్చుకో లేదు. ఆయన సాహితీ మార్గదర్శకుడుగా (pioneer)గా విప్లవకారుడుగా (Rebel) తన్నుతాను గుర్తించుకున్నాడు. అందుకే తెలుగు సాహిత్యంలో ఆయన స్థానం మార్గదర్శకుడుగా సుస్థిరం.

చలంగారు యే గొప్పనవలని రాయకున్నా ఆయన నవలలన్నీ మంచినవలలు. ఆయన నవలలన్నీ భావప్రధానమైన నవలలే అయినా, ఆ నవలల్ని పాఠకులు వాటి లోని భావాలు ఎంత పాతపడిపోయినా చదువుతూనే వుంటారు. అందుకు కారణం భావాలతోపాటు సాహిత్యపరమైన విలువలు కూడా చలంగారి నవలల్లో పుష్కలంగా ఉన్నాయి. చలంగారి నవలలన్నింటిలోను ఆయన అతి స్వచ్ఛమైన, అతి సున్నితమైన, అతి నిర్మలమైన కవి హృదయం పాఠకుడిని ఆకట్టుకుంటుంది. అలాగే ఏనాటికి సౌందర్యం అరిగిపోని ఆయన మాటలు _ ఆ మాటలతో ఆయన తన నవలలనిండా మలచిన వర్ణచిత్రాలు పాఠకుడిని గొప్ప సౌందర్య విలసిత లోకాలకి తీసుకుపోతాయి. ఆయన నవలలకి శాశ్వతకీర్తినిచ్చేది యిదే _ ఆయన గొప్ప శైలి _ యే అడ్డంకులు లేకుండా సహజంగా _ మైదానంలో ప్రవాహంలా సాగిపోయే ఆయన గొప్పశైలి. చలంగారి శత్రువులు కూడా, చలంగారి శైలిని మెచ్చుకున్నారు. కాని చలంగారు 'శైలి' అనే దాన్ని వొక ప్రత్యేక అంశంగా ఎప్పుడూ భావించలేదు. రచయిత భావోద్రేకాన్నిబట్టి శైలి దానంతట అదే అప్రయత్నంగా వస్తుంది. అందువల్ల భావాన్నీ, శైలినీ వేరుచేసి భావాన్ని అంగీకరించక, శైలిని మెచ్చుకున్న విమర్శకుల్ని చలం ఎన్నడూ సహించలేదు. అలాంటి వాళ్ళకి జవాబుగా చలంగారు ఇలా రాసారు:

"ప్రయత్నించి శైలికి నునుపు తేగలరు కాని వుద్రేకం హృదయంలోంచి అప్రయత్నంగా రావలసిందే: మాటల్ని యేర్చి కూర్చి మన నేర్పుకి యితరుల్ని ఆశ్చర్యపడ చెయ్యగలంగాని వాళ్ళ హృదయాల్ని ప్రజ్వలింపచెయ్యలేము. బాధపడాలి, నలగాలి జీవిత రథ చక్రాలక్రింద, కలంలోంచి నెత్తురు వొలకాలంటే: అక్షరాలా, పాండిత్యమా, కాదు. సంవత్సరాల మూగవేదన, అంధకారంలో అన్వేషణ, నాబోటి దీన జీవుల రహస్య హృదయాంతర విషాదం, దిక్కులేని దుర్బలుల జీరణ ఆవేశం _ ఎవరితోనూ, చెప్పుకోలేని అధమ చారిత్రల గర్భ శోకం _ యిదీ నా శైలి"

చలంగారి శైలికి మచ్చుతునకగా ఆ పై వాక్యాలు చాలు. ఆయన నవలలని చాలాకాలం వరకు నిలిపేది గొప్ప కవిత్వంతో తులతూగే ఈ శైలే.

ఇక ఈ విషయాల్ని background గా, చలంగారి నవలల్ని చర్చిద్దాము ఈ చర్చకు ఆయన వ్యక్తిత్వాన్ని, ఆయన భావాల్ని ప్రతిబింబించే నాలుగు ముఖ్యమైన నవలల్ని యెన్నుకోవడం జరిగింది.

## దైవమిచ్చిన భార్య

"దైవమిచ్చిన భార్య"లో చలంగారు సమాజంనుండి, సాంప్రదాయంనుండి, పురుషుని ఆధిక్యతనుండి స్వతంత్రంగా బతకాలనుకున్న స్త్రీని సమాజం, సాంప్రదాయం, పురుషులు ఎలా లొంగదీస్తారో చూపిస్తాడు. ఈ నవలలో ఇద్దరు స్త్రీ పురుషులు సాంప్రదాయ సిద్ధమైన వివాహానికి ఎదురుతిరిగి స్వతంత్రంగా జీవిస్తారు. అలా కొంతకాలం సాంప్రదాయం అనే ప్రవాహానికి ఎదురీదుతారు. ఆ స్వేచ్ఛలో గొప్ప ప్రేమను అనుభవిస్తారు. కాని చివరకు సాంప్రదాయమే గెలుస్తుంది.

రాధాకృష్ణ, పద్మావతి బాల్యంలోనే వొకర్నొకరు తెలుసుకున్నారు. వాళ్ళ హృదయాల్లో ప్రేమకు అంకురార్పణ జరిగింది. పద్మావతిని రాధాకృష్ణ సమాజం దృష్టిలో శాస్త్రీయంగా పెళ్ళిచేసుకొన్నా వాళ్ళిద్దరిమధ్య లౌకిక విలువలకి అతీతమైన ఆధ్యాత్మిక అనుబంధం యేర్పడింది. పద్మావతిని తన spiritual wife గా – దైవమిచ్చిన భార్యగా రాధాకృష్ణ గుర్తిస్తాడు. కాని సమాజం వాళ్ళిద్దరిమధ్య యేర్పడిన ఈ అనుబంధాన్ని గుర్తించలేదు. పద్మావతి పెద్ద జమీందారీ కుటుంబానికి చెందిన యువతి. ఆ కుటుంబానికి తగ్గ హోదా వాడితో పద్మావతి పెళ్ళి అయిపోయింది. కాని సమాజంకోసం జరిగిన కృత్రిమమైన ఈ పెళ్ళి పద్మావతి, రాధాకృష్ణుల మధ్య సహజంగా జరిగిపోయిన 'పెళ్ళి'ని పద్మావతి, రాధాకృష్ణుల హృదయంనుండి తొలగించలేక పోయింది. పెళ్ళి, నియమాలు, సాంప్రదాయం మొదలైన లౌకిక విలువలు అంటని రాధాకృష్ణ హృదయం పద్మావతికి పెళ్ళైనప్పుడు తల్లడిల్లిపోయింది.

పద్మావతి, రాధాకృష్ణ తిరిగి నిండు యౌవ్వనంలో ఉన్నప్పుడు కలిసికుంటారు. పద్మావతి పెళ్ళి చేసికున్నా భర్తతో కలిసి ఉండటంలేదు. ఆమె భర్త 'న్యాయమూర్తి' పై చదువులకు ఇంగ్లాండు వెళ్ళాడు. యేడేళ్ళ తర్వాత మళ్ళీ కలిసికున్న పద్మావతి రాధాకృష్ణుల హృదయాల్లో ఎప్పుడో అంకురించిన ప్రేమబీజాలు హరించిపోలేదు. పద్మావతిమీద ఆరాధన రాధాకృష్ణలో వెయ్యింతలు పెరిగింది.

" ఆ ఎండాకాలం అంతా నా యవ్వనం పద్మావతితో నిండిపోయింది. ముందు వెనకా తెలియదు. కళ్లు కనబడవు. యెందుకు యేంచేస్తున్నా అనే ఆలోచనేలేదు. ఆమెనడిచిన నేలమీద దుమ్ముతీసి కళ్ళకద్దుకున్నాను"

రాధాకృష్ణలోని పద్మావతిపై ఈ ఆరాధనాభావం త్వరలోనే ఆమెను శారీరకంగా అనుభవించాలనే వాంఛగా మారుతుంది. స్త్రీ పురుషుల ప్రేమయొక్క ఆఖరుమెట్టు శారీరక కలయిక (sexual union) అని చలం నమ్మకం. Platoric ప్రేమమీద ఆయనకు నమ్మకం లేదు. స్త్రీ పురుషులకి వొకరిమీద వొకరికి మోహం ఏర్పడినప్పుడు వాళ్లు శారీరకంగా కలుసుకోవచ్చు వివాహం అయిన స్త్రీపురుషులే శారీరకంగా కలుసుకోవటానికి అర్హులు అనే భావాన్ని చలం యెన్నడూ అంగీకరించలేదు. వివాహం అయినంత మాత్రాన స్త్రీ పురుషులకు వొకరిపై వొకరికి మోహం, కోరిక జనించక పోవచ్చు. అయినా 'వివాహం' జరిగింది కదా అని వొకరిపై వొకరికి ఆ మోహం, ఆ కోరిక లేకున్నా శారీరకంగా కలుసుకోవటం వ్యభిచారం కంటె హీనం అని చలం వాదించాడు. స్త్రీ పురుషులమధ్య మోహం, ప్రేమ సహజంగా ఉదయించాలి. నియమాల ద్వారా, నిబంధనల ద్వారా, వివాహం ద్వారా, సాంప్రదాయం ద్వారా అవి ఉదయించవు. పద్మావతికి న్యాయమూర్తితో వివాహం జరిగినా అతనిమీద ఆమెకి ప్రేమ కల్గలేదు అతనితో శారీరకంగా కలసిపోవాలనే కోరిక కల్గలేదు. స్త్రీ పురుషులు వొకర్నొకరు హృదయ పూర్వకంగా ప్రేమించుకున్నప్పుడే 'శారీరక కలయిక' దైవత్వంతో సమానమైన గొప్ప ఆనందాన్ని యిస్తుందని చలం నమ్మాడు. స్త్రీ పురుషులు వొక సంపూర్ణ ఐక్యతని 'శారీరక కలయిక' ద్వారా సాధిస్తారు. అందువల్ల స్త్రీ పురుషుల ప్రేమయొక్క ఆఖరిమెట్టు శారీరక కలయిక. అయితే ఆ స్త్రీ పురుషులు ఆ చివరిమెట్టును చేరుకోవటానికి యెంతో యెదగాలి. 'దైవత్వం' తో సమానమైన ఆ అనుభవం యిచ్చే గొప్ప ఆనందాన్ని అనుభవించటానికి తగిన అర్హతని సంపాదించాలి. 'శారీరక కలయిక' అంటే అర్ధరాత్రి నరాల బలహీనతని తీర్చుకోవటానికి కళ్ళు మూసికొని చేసేది కాదు. స్త్రీ పురుషుల ఆత్మలు ఐక్యం పొందే గొప్ప క్షణమది. అందువల్ల ఆ గొప్ప క్షణంలోని ఆనందాన్ని పొందటానికి స్త్రీ పురుషులు కొంత సాధన చెయ్యాలి. కోరిక జనించటం తోటే కలసికోకూడదు. అందువల్ల పద్మావతి రాధాకృష్ణలు వొకరిపై వొకరికి కోరిక జనించటంతోటే కలుసుకోరు. కొంతకాలం యిద్దరూ విరహంలో తమనుతాము కాల్చుకొని తమ హృదయాల్ని క్షాళనం చేసికుంటారు. పద్మావతి ప్రేమకు అర్హుడు కావటానికి రాధాకృష్ణ తన్నుతాను తీర్చి దిద్దుకుంటాడు. స్త్రీపై కోరిక, స్త్రీ అందాన్ని అనుభవించాలనే పురుషుడిలోని గాఢమైన కాంక్ష పురుషుణ్ణి గొప్పపనులు చెయ్యటం వైపు పురికొల్పాలని చలంగారి అభిప్రాయం, పురుషుడిలో నిద్రాణమై ఉన్న యెన్నో నిర్మాణాత్మక శక్తుల్ని స్త్రీ జాగృతం చెయ్యాలి. అతనిలోని నిజాన్ని అతనికి చూపాలి. పద్మావతి అదే చేస్తుంది.

రాధాకృష్ణని గొప్ప పనుల వైపు పురిగొల్పుతుంది. అతనిలో నిద్రాణమైన శక్తుల్ని జాగృతం చేస్తుంది పద్మావతి ఇలా అంటుంది.

"స్త్రీని యెందుకనుకున్నావు వుంది ? జీవితమంటే ఎంత ఉన్నతమైందో, గాఢమైందో పురుషునికి తెలిసేట్టు చెప్పేందుకు. పురుషుల్ని ప్రోత్సహించాలి. స్వర్గానికి యెత్తెయ్యాలి. గొప్ప పనులకి. గొప్ప ఆదర్శాలకి, గొప్ప ఊహలకి ఉత్సాహమివ్వాలి, అగ్నితో నింపెయ్యాలి. నిర్జీవమైన బ్రతుకులోంచి రక్షించాలి".

పద్మావతి ప్రయత్నం ఫలిస్తుంది. రాధాకృష్ణ పెద్ద దేశ సేవకుడౌతాడు. స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటాడు. కొంతకాలం యెడబాటు తర్వాత మళ్ళీ పద్మావతి, రాధాకృష్ణలు కలిసికుంటారు. శారీరికంగా కలిసికోవాలనే కోరిక యిద్దర్లోను యింకా గాఢమౌతుంది. ఇప్పుడు పద్మావతి, ఆమె భర్తతో కలిసి ఉంటున్నది. అందువల్ల పద్మావతిని ఆమె భర్త అనుభవిస్తున్నాడనే 'జెలసీ' రాధాకృష్ణలో జనిస్తుంది. తనకి పద్మావతి దూరమౌతోందేమోనని భయపడ్తాడు తను పద్మావతిని శారీరకంగా కలిసికుంటేనే ఆమె తనదౌతుందని రాధాకృష్ణ నమ్మకం. కాని పద్మావతికి ప్రేమకోసం గాని, మరి దేనికోసంగాని, తన స్వాతంత్రియాన్ని కోల్పోవటం యిష్టంలేదు. పద్మావతికి అన్నింటికంటే తన స్వాతంత్రియం ముఖ్యం. రాధాకృష్ణ తనదానివై పొమ్మని పద్మావతిని అడిగినప్పుడు ఆమె అంటుంది.

"రాధా ! నేను నాదాన్నే అయివుంటా__. వొకరి దాన్నవటం నాకిష్టంలేదు. యెందుకు కావాలి!"

"ప్రేమవల్ల" అంటాడు రాధాకృష్ణ. నిజానికి రాధాకృష్ణ పద్మావతిని తనదానిని కమ్మంటున్నది ప్రేమవల్లనే కాదు. పద్మావతి తనభర్తకి వశమౌతున్నదనే జెలసీ వల్ల, ఆమెను శారీరకంగా అనుభవించాలనే కోరికవల్ల. ఇది తెలిసికున్న పద్మావతి:

"నా జీవనం నేను జీవిస్తా_ నీపని నువ్వు చూసుకో_ ప్రేమ ఉంటుంది" అంటుంది. ఇంతకాలం లోకానికి భిన్నంగా జీవించాలనుకున్న రాధాకృష్ణ,

"లోకంలో అల్లానా మరి" అంటాడు

"లోకం ఖర్మం. మన మెందుకు ఇలా ఉండకూడదు. ప్రేమ పేరుపెట్టి నన్నొక్కడికో యెత్తుకుపోవాలని చూస్తా వెందుకు ? అప్పుడుగాని ప్రేమ ఉండదా ?" అంటుంది పద్మావతి.

భార్యాభర్తల్లో ప్రేమ సహజమై, నిత్యనూతనమై ఉండకపోవటానికి కారణం... ఇద్దరూ వొకరికొకరు మామూలై పోవటం. అన్నివేళలా అన్నివేషాల్లో వొకరికొకరు

కన్పించుకోవటం_ అందువల్ల తన్ను ప్రేమించే స్త్రీని చూసినప్పుడు పురుషునికి, తన్ను ప్రేమించే పురుషున్ని చూసినప్పుడు స్త్రీకి వొక థ్రిల్_ గగుర్పాటు కలటంలేదు. అందువల్ల ఇద్దరిమధ్య ఆకర్షణ సన్నగిల్లుతున్నది. ఎప్పుడో నరాలబాధ తీర్చుకునే అవసరం కలిగినప్పుడు తప్ప, వొకరి శరీరంమీద వొకరికి ఆరాధనా భావం లేనేలేదు. అందువల్ల ప్రేమించుకునే స్త్రీ పురుషుల మధ్య యెడబాటు అవసరం. అందువల్ల రాధాకృష్ణతో కలిసి ఉండటానికి పద్మావతి వప్పుకోదు.

"ఎప్పుడూ పొద్దున్నా, సాయంత్రం వొకరికి కనబడు :', రాత్రంతా వాళ్ళతో ఉండి వాళ్ళకి పాతదాన్నయి అసహ్యం అయిపోను. ఆఖరుకు నీకూ్కడా" అంటుంది పద్మావతి. ఇలా పద్మావతిని తనదాన్ని చేసికోవాలని రాధాకృష్ణ, రాధాకృష్ణని ప్రేమిస్తూ తన స్వాతంత్రియాన్ని కాపాడుకోవాలని పద్మావతి పెనుగులాడుతారు. కాని ఎప్పుడో అప్పుడు పద్మావతి రాధాకృష్ణుల ఈ ప్రేమ చలం నమ్మే ఆ ఉన్నత శిఖరం_ శారీరక సమాగమనం_ చేరుకోవాలి తన భర్తతో మరోచోటికి వెళ్ళిపోయే ముందు పద్మావతి తన్నుతాను రాధాకృష్ణకి అర్పించుకుంటుంది. తనహృదయమంతా నిండిన రాధాకృష్ణపై ప్రేమను పద్మావతి ఇలా కురిపిస్తుంది:

"నీ ప్రేమనంతా చూపించు. ఇంకెప్పుడూ వీలుండదేమో, అన్నట్లు ప్రేమించు నన్ను. అంతా_ నన్నూ అనుభవించనీ_ అందంగా ఉన్నానా ? చూడు ఈ వెన్నెల్లో ఎలా కనబడుతున్నాను చెప్పు_ మాట్లాడు_ యిలా రా"

వాళ్ళ ఆ గొప్ప కలయికని చలం యిలా వర్ణిస్తాడు.

"మెత్తని చల్లనివెన్నెల కప్పింది మమ్మల్ని. మా సంతోషంతో గాలివణికింది. మా ప్రేమ పువ్వులలో ప్రతిధ్వనించి వాసనలు రేపేసింది. మమ్మల్ని చూడటానికి సృష్టి ఊపిరి బిగపట్టి ఆగింది. వెయ్యికన్నులతో ఆకాశం తొంగిచూసింది. గాలికీరనలు పాడింది. మా రక్తం సృష్టి మాధుర్యంతో కలిసి పొంగి ప్రవహించింది. ఒకరిచేతుల్లో వొకరం యిమిడిపోయినాము"

తర్వాత పద్మావతి తన భర్త న్యాయమూర్తితో కాపురం పెడ్తుంది. దాన్ని రాధాకృష్ణ అంగీకరించలేడు. పద్మావతి తనది. తనకి 'దైవమిచ్చిన భార్య' పద్మావతి. ఆమెను 'న్యాయమూర్తి' తన భార్యగా తీసికపోవటం రాధాకృష్ణకి అన్యాయంగా కన్పిస్తుంది. అందువల్ల పద్మావతిని తనతో ఉండమంటాడు. లేచిపోదామంటాడు. కాని పద్మావతి అందుకు వప్పుకోదు. లేచిపోవటాన్ని ప్రోత్సహిస్తాడని ప్రఖ్యాతిగాంచిన చలంగారు లేచిపోవటంలోని కష్టాల్ని, ప్రమాదాల్ని పద్మావతిద్వారా ఎంతో యదార్థంగా చెప్పిస్తాడు. (చలంగారు లేచిపోవటాన్ని సమర్థించింది వొక negative aspect

లో మాత్రమే. సంసారంలో ఉండి పడే అగచాట్లకంటె లేచిపోవటం నయం అన్నాడే గాని దానొక positive solution గా ఆయన యెన్నడూ సూచించలేదు.)

తర్వాత పద్మావతిని ఆమె భర్తకు తెలియకుండా కలుసుకుంటూ ఉంటాడు రాధాకృష్ణ. ఈ లోపల రాధాకృష్ణకి చిన్నప్పు డెప్పుడో పెళ్ళయిందని, యవ్వనవతి యైన 'శకుంతల' అతని భార్య అని తెలిసినప్పుడు రాధాకృష్ణతోపాటు పాఠకులు కూడా షాక్ తింటారు. పద్మావతిని తన spiritual wife గా నమ్ముతున్న రాధాకృష్ణ, శకుంతలని భార్యగా అంగీకరించలేడు వొకరోజు పద్మావతిని రహస్యంగా కలుసుకుంటూ ఆమె భర్త కళ్ళల్లో పడ్తాడు. పద్మావతి భర్త న్యాయమూర్తి– పెద్దపలుకుబడి గలవాడు. అతనితో పోట్లాడుతాడు రాధాకృష్ణ. పద్మావతి నిజంగా తనభార్య అంటాడు. పద్మావతి తనదని న్యాయమూర్తి, తనదని రాధాకృష్ణ పోట్లాడుకోవటం పద్మావతికి అసహ్యం వేస్తుంది. తను "ఎవరిది" కాదు. తనొక స్వతంత్రజీవి. స్త్రీని వస్తువుగా తమ ఆస్తిగా భావించే పురుషుల మనస్తత్వాన్ని ఖండిస్తూ పద్మావతి ఇలా అంటుంది.

"న్యాయమూర్తిగారూ నేను మీ పదార్థాన్నిగాదు. మీరు చెప్పినట్లు మీ ఆజ్ఞకిలోబడి ఉండేందుకు. రాధా ! నీదాన్నికాదు నీతో వొచ్చెయ్యటానికి. నాకోసం మీ యిద్దరూ యెందు కిలా బొమికి ముక్కకోసం కుక్కల్లాగ పోట్లాడుతారు. ఇది నాయిల్లు, నే నిక్కడే ఉంటాను".

అంతే– అంతటితో పద్మావతి రాధాకృష్ణకు దూరమౌతుంది. పద్మావతిని తీసికొని న్యాయమూర్తి దూరంగా సింగపూర్ వెళ్ళిపోతాడు. అతనితో వెళ్ళటం పద్మావతికి తప్పనిసరి ఔతుంది. ఇది మొదటిసారి పద్మావతి తన స్వాతంత్రియాన్ని కోల్పోయిన సన్నివేశం. ఇది మొదటిసారి పద్మావతి తన జీవితంలో యెదుర్కొన్న అపజయం. అలాగే రాధాకృష్ణ కూడా సమాజానికి యెదురీదటం మానేసి సమాజంలో వొకడుగా చేరి పోతాడు. భార్యతో కాపురం పెట్టి పిల్లల్ని కంటూ వ్యాపారం చూసుకుంటూ ఉంటాడు. ఇలా యవ్వనం గడిచి నడివయస్కులవటంతో పద్మావతి రాధాకృష్ణలు సమాజానికి యెదురీదగల్గే శక్తి కోల్పోతారు. అయినా యవ్వనంలో అనుభవించిన వాళ్ళ మధుర ప్రేమ వొక మధుర స్మృతిగా, వొక మధుర స్వప్నంగా వాళ్ళని వెన్నాడుతూనే ఉంటుంది. వొకసారిఇద్దరూ అనుకోకుండా, అప్రయత్నంగా ఎక్కడోదూర ప్రదేశంలో కలిసికోవటం సంభవిస్తుంది. ఇద్దరూ గొప్పమధుర స్మృతుల్లో మునిగి పోతారు, ఇద్దరి లోను ఇప్పుడు శారీరకంగా కలిసికోవాలనే వాంఛలేదు. వొకరి సాన్నిధ్యంలో వొకరు గొప్ప ఆనందాన్ని పొందుతారు.

"సృష్టి సౌందర్యంలో— వొకరు యింకొకరి సౌందర్యంలో లీనమై పోయినారు, వొకరి నొకరు తాకనన్నాలేదు తాకాలనే బుద్ధేలేదు, తాకక్కర్లేదు. ఈ భౌతిక శరీరాలకి

అతీతమైన ఆనందం అనుభవించారు. అంతసేపూ వారిద్దరికి శరీరాలు లేనట్టే ఉంది."

ఇలా పద్మావతి, రాధాకృష్ణల ప్రేమ బాల్యం, యవ్వనం గడిచి నడివయస్సులో శరీరాలకి అతీతమైన ఆధ్యాత్మిక ప్రేమగా భాసిల్లుతుంది.

కాని పద్మావతి, రాధాకృష్ణలు మళ్ళా కలిసికోవటాన్ని సమాజం సహించదు. ఆ రాత్రి పద్మావతి, రాధాకృష్ణలు కలిసి ఉన్నారని పద్మావతి భర్తకు తెలుస్తుంది. రాధాకృష్ణని కోర్టుకీడ్చి జైలుకు పంపిస్తానంటాడు. ఇప్పుడు ప్రేమకోసం జైలుకి వెళ్లే సాహసం రాధాకృష్ణ చెయ్యలేదు. అతన్నిప్పుడు లౌకిక విలువలు పూర్తిగా లోబరచుకున్నాయి. ఇది పద్మావతికి తెలుసు. తన కారణంగా రాధాకృష్ణ జైలుకెళ్ళటం ఆమెకిష్టంలేదు. అందుకు ఆమెకు కన్పించింది ఒకటేమార్గం. తను ఆత్మహత్య చేసికోవటం. తను ఎలాగుతనకు ప్రాణప్రదమైన స్వేచ్ఛని కోల్పోయింది. అందువల్ల పద్మావతికి తను జీవించినా జీవచ్ఛవంలాగే జీవిస్తానని తెలుసు. కాని రాధాకృష్ణ అలా కాదు. అతను అతని భార్యకోసం, పిల్లలకోసం, వ్యాపారంకోసం బ్రతకాలి. రాధాకృష్ణ తనకి దూరమై ఈ లౌకిక విలువలకిబానిసై పోవటానికి కారణం తనుఅతని దాన్నవకపోవటమే—తను అతని నుండి స్వతంత్రంగా జీవించటమే కారణమనే నిర్ణయానికి కొస్తుంది. చివరకు పద్మావతి తను ఆత్మహత్య చేసికొని రాధాకృష్ణను రక్షిస్తుంది. ఆ ఆత్మహత్యతో స్వతంత్రంగా—తనకు తానుగా బ్రతకబోయిన ఒక స్త్రీ సమాజం చేతిలో పొందిన ఓటమి పూర్తవుతుంది.

ఈ నవలలో చలం తన భావాలని చెప్పటమే ప్రధానంగా పెట్టుకున్నా అది కళాత్మంగాజరుగుతుంది.ఇతివృత్తం, పాత్రచిత్రణ,నాటకీయత, objectivity, సంయమనం మొదలైనవి కూడా చలం ఈ నవలలో చూపించాడు. నవలలో ముఖ్యపాత్ర పద్మావతిలో—చలం నాయికలకుండే గొప్ప సౌందర్యం, సహజమైన తెలివితేటలు, బలమైన వ్యక్తిత్వం—స్వాతంత్ర్య పిపాస, త్యాగశీలత్వం.—మొదలైనవన్నీ ఉన్నాయి. కాని పద్మావతి 'మైదానం'లోని రాజేశ్వరివలె rebel కాదు. సమాజపు ఫ్రేములో ఉంటూనే స్వాతంత్రియంగా జీవించ బోయింది. అది సాధ్యమయ్యే పనికాదు. అందువల్లనే పద్మావతి చివరన ఓడిపోయింది. అటు సాంప్రదాయానికి, ఇటు ఆదర్శానికి మధ్యపడి నలిగిన స్త్రీ మూర్తిగా 'పద్మావతి' పాఠకుడి హృదయాన్ని చూరగొంటుంది. రాధాకృష్ణ చలం చూసిన పురుషుడిలోని స్వార్థపరత్వానికి చక్కని ఉదాహరణ. పురుషుడు ఎంతసేపూ స్త్రీని తనస్వంతం, తన ఆస్తి చేసికోవటానికే ప్రయత్నిస్తాడు. అప్పుడే పురుషుడిలోని తను స్త్రీకంటే అధికుడిని అనే అహం, తృప్తి పొందుతుంది. రాధాకృష్ణ పద్మావతిని తనకి 'దైవమిచ్చిన భార్య'గా భావించి ఆమెను తన స్వంతం చేసికోవాలనుకున్నాడు. కాని పద్మావతి అందుకు ఒప్పుకోలేదు. అందుకు రాధాకృష్ణ

హర్షించలేదు. ఇంత ప్రేమించినా స్త్రీ తన స్వంతం కాకపోవటాన్ని, స్త్రీ స్వతంత్రంగా జీవించటాన్ని పురుషుడు హ ర్షిం చ డ నే చలం భావానికి రాధాకృష్ణ చక్కని ఉదాహరణం.

మైదానం :

హిందూ మధ్య తరగతి కుటుంబాల్లో స్త్రీ పురుషులు మోహించు కోవటం__ శారీరకంగా కలిసికోవటం వొక పాపమనే అభిప్రాయం యేర్పడింది. భార్యాభర్తల మధ్యకూడా లైంగిక కలయిక అనేది ఎక్కడో నాలుగుగోడల మధ్య రహస్యంగా ఎప్పుడో భర్తసరాల బాధ తీర్చుకోవటానికి చేసే కార్యంగా తయారయ్యింది. ఈ కారణంగా 'లైంగిక కలయిక' వల్ల స్త్రీ పురుషులు పొందే సహజమైన ఆనందం పోతున్నది. లైంగిక కలయిక వల్ల వచ్చే గొప్పఆనందాన్ని స్త్రీపురుషులు పొందాలంటే అది స్వేచ్ఛగా, సహజంగా జరగాలి. నాలుగు గోడల మధ్యనుండి మైదానంలోకి, సృష్టిలోకి, ప్రకృతిలోకి పక్షుల్లా స్త్రీ పురుషులు యెగిరిపోవాలి. వొకరి శరీరంతో వొకరు ఐక్యమై పోవాలి. పురుషుడి మోహతీవ్రతని స్త్రీ, స్త్రీ మోహతీవ్రతని పురుషుడు తీర్చాలి. పరస్పరంప్రేమించుకున్న స్త్రీపురుషులు స్వేచ్ఛగా లైంగికంగా కలిసికోవటం పాపంకాదు. లైంగిక కలయిక సృష్టికి మూలం. స్త్రీ పురుషులకు సృష్టి ప్రసాదించిన గొప్పవరం. ఆ వరంలోని గొప్ప ఆనందాన్ని పొందే హక్కు ప్రతి స్త్రీపురుషుడికి ఉంది. కాని సాంప్రదాయం, సమాజం, మతం, నీతి మొదలైన మానవ కల్పిత కృత్రిమ విలువలు స్త్రీ పురుషుల్ని ఈ వరాన్ని ఉపయోగించుకోకుండా చేస్తున్నాయి. ఈ సృష్టి కార్యం పట్ల స్త్రీ పురుషుల్లో వొక విముఖత్వాన్ని. పాపభీతిని, అసహ్యాన్ని కల్గించే ప్రయత్నం చేస్తున్నాయి. ఈ లౌకిక విలువల క్రింద పడి అతిసహజమైన లైంగిక వాంఛ నలిగిపోతున్నది. ఈ వాంఛని, స్వేచ్ఛని, ప్రకృతి ప్రాంగణంలో, విశాల మైదానంలో, యే పాపభీతి, యే రహస్యంలేకుండా అనుభవించాలని చెప్పేందుకు చలంగారు 'మైదానం' రాసారు.

రాజేశ్వరి అమీర్‌తో లేచిపోయింది. రాజేశ్వరి సౌందర్యానికి, మోహ తీవ్రతకి తగిన భర్త ఆమెకులేడు. అందరిలా సంఘంలో యిమిడిపోయి, తన సహజ వాంఛల్ని తనలోనే హరింపజేసుకొని, ప్రతి రాత్రి భర్తని తన శరీరంతో నరాలబాధని తీర్చుకోనిస్తూ, జీవచ్ఛవంలా బ్రతికి, సమాజం చేత పతివ్రత అనే యోగ్యతా పత్రం పొంది తృప్తిపడే స్త్రీ కాదు రాజేశ్వరి. అమీర్ ఆమెలో నిద్రాణమై ఉన్న స్త్రీత్వాన్ని మేల్కొల్పాడు. అంతకు పూర్వం ఆమెభర్త ఆమెనొక స్త్రీగా చూడలేదు. స్త్రీగా ఆమె సహజమైన కోరికల్ని తీర్చలేదు. లైంగిక కలయికలోని ఔన్నత్యం అతనికి తెలియదు. స్త్రీని తనకున్న ఆస్తిలో వొక ఆస్తిగా చూసికోవడం తెలుసు. తన భర్తను గూర్చి రాజేశ్వరి ఇలా అంటుంది:

"భయానికి, మోహానికి భేదం తెలియని ఆయనతో వొక మంచం మీద పడుకోవడం కన్న మన్మథునికి అపకారం వేరే యేమన్నా ఉందా? యేదన్నా లాపాయింటు అడుగు. దేనికది చీల్చి వివరంగా అరగంటసేపు చెప్తాడు. ఎదుటి సాక్షి హృదయ పరీక్షచేసి, చీల్చి తికమకలు పెడ్తాడు. భార్య కావలించుకోవటం మోహం వల్లనో, భయం వల్లనో, భేదం తెలియదు. ఇట్లాంటి వారు మన భర్తలు. వీళ్ళకి పెళ్ళాలు కావాలా? లాయరు హంగులో మనమూ వొక భేషజం. ఆ పుస్తకాల బీరువాలు, గుర్రపుబండీలాగే ఎవరన్నా వస్తే వంటినిండా నగలువేసి మనని చూపించవచ్చు. దేహంలో అక్రమంగా కల్గే ఆ కామరోగాన్ని మన ద్వారా కళ్ళుమూసికొని నయం చేసికోవచ్చు."

ఇలాంటి భర్తతో కాపురం చేస్తున్న రాజేశ్వరికి అమీర్ కన్పిస్తాడు. అమీర్ ఆమెకి సృష్టి సహజమైన "పురుషత్వాని"కి చిహ్నంగా కన్పిస్తాడు. అతనిలోని దుడుకుతనం, తనకు కావలసిన స్త్రీని యే జంకూ గొంకూ లేకుండా దక్కించుకునే సాహసం రాజేశ్వరిని వెంటనే ఆకర్షిస్తాయి. అమీర్‌ని చూడటం తోటే తనకి కావలసిన పురుషుడు ఇతడేనని రాజేశ్వరి తన intuition తో తెలుసు కుంటుంది. ఆమె రక్తమాంసాలు చెప్తాయి— ఈ పురుషుడి కోసమే తను యింతకాలం ఎదురు చూస్తున్నదని, తన సౌందర్యాన్ని ఆరాధించేవాడు, తన మోహతీవ్రతని తీర్చేవాడు, తనని యేలుకునేవాడు, తన జీవితంలోకి క్రొత్త వెలుగుల్ని తెచ్చేవాడు అమీరేనని వెంటనే గ్రహిస్తుంది. అమీర్ ఆమెకేసి చూసిన వొక్క చూపు ఆమెలో నిద్రాణమై ఉన్న స్త్రీత్వాన్ని జాగృతం చేసింది.

అమీర్‌కూడా రాజేశ్వరిలోని అసాధారణ సౌందర్యాన్ని, తనలోని 'పురుషత్వాన్ని' పురిగొల్పిన ఆమెలోని మోహతీవ్రతని వెంటనే అర్థం చేసికుంటాడు. ఆమె తనకోసమే ఎదురు చూస్తున్నదని తెలిసికుంటాడు అందువల్ల అమీర్ ఆమె కోసం వెళ్ళటం, ఆమె ప్రమేయం లేకుండానే ఆమెను తన కౌగిట్లో బంధించి వెయ్యటం, ఆమెను తనతో రమ్మని అడగటం, ఆమె అందుకు సమ్మతించటం అంతా క్షణంలో— అంతా ఇదివరకే నిర్ణయించ బడినట్టుగా జరిగిపోతుంది. అమీర్ రాజేశ్వరి కలుసుకోవటం అంత సహజంగా— చలమే రాసిన "ఓ పువ్వు పూసింది" కథలో మధుపం, పువ్వు కలుసుకున్నట్టుగా ఉంటుంది. "ఓ పువ్వు పూసింది" కథలో ప్రకృతిలో సృష్టికార్యం ఎంత సహజంగా, స్వేచ్ఛగా, అందంగా, అప్రయత్నంగా ఉంటుందో మనోహరంగా వర్ణించాడు చలం. మానవుల్లో కూడా సృష్టికార్యం అలా జరగాలని చలం ఆశించాడు. అదే "మైదానం" లోచూపించాడు. "ఓ పువ్వు పూసింది" కథలోని పువ్వు మధుపం 'మైదానం' లో రాజేశ్వరి, అమీర్లుగా మారారు. ప్రకృతిలోని స్త్రీత్వానికి, 'పురుషత్వాని'కి ప్రతీకలైన రాజేశ్వరి, అమీర్లు కృత్రిమ విలువలతో

నిర్మించబడిన సమాజంలో యిమిడిపోలేరు. అందువల్ల ఇద్దరూ ఆ సమాజపు నాలుగు గోడల మధ్యనుండి విడివడి స్వేచ్ఛకి నిలయమైన "మైదానం" లోకి ఎగిరిపోతారు.

రాజేశ్వరి అమీరుతో లేచి పోయింది కేవలం కామం తీర్చుకోవడానికి కాదు. ఆ పని ఇంట్లో ఉంటూనే రహస్యంగా చెయ్యొచ్చు. అది ఎంతోమంది మర్యాదస్తుల యింట్లో జరుగుతూనే ఉంది. 'అమీర్'లో నిజమైన పురుషుణ్ణి చూసింది రాజేశ్వరి. తన లోని సృష్టిశక్తుల్ని జాగృతం చేసి, వాటిని తృప్తి పరచిన పురుషునికి స్త్రీ తన సర్వస్వమూ ధారవోస్తుంది. రాజేశ్వరి అదే చేసింది. తను అమీర్‌తో లేచిపోయింది కామం తీర్చుకోవటానికి కాదని చెప్తూ రాజేశ్వరి యిలా అంటుంది :

"అమీర్ ఒక్కసారి కూడా నన్ను తాకనన్నా సరే వెళ్ళి పోయేదాన్నే ! అతని పాదసేవకి, అతని సుఖదుఃఖాలు పంచుకునేందుకు, అతని ఆజ్ఞలే, అతని దయే, అతని పూజే నా మతంగా, నా ధర్మంగా, నా ఆనందంగా నా జీవనాన్ని అర్పించేందుకు, అతడు తన్ను ప్రేమించనీ, చంపనీ, పాలించనీ, వొదిలెయ్యనీ, ఆ కొత్తవాడు తురకవాడు అతన్ని సహజంగా నమ్మి— సమస్తమూ త్యజించి అతని చేతిలో నా ప్రాణాల్ని అర్పించాను. ఇంత విశ్వాసమూ, ఇంత త్యాగమూ, అంతా కామమేనా ? నా హృదయంలోని ఆ అప్రమేయానందమూ, అనిర్వచనీయ మాధుర్యమూ నా అల్పత్వమూ, క్షుద్రత్వమూ వొదిలి, నగలు, చీరెలు, మర్యాద అన్నీ అసహ్యాలనిపింప జేసిన అద్భుతానుభవం, కామమా ?"

మైదానంలో రాజేశ్వరి అమీర్లు గొప్ప ఆనందాన్ని పొందుతారు. ప్రకృతిలో కలిసిపోతారు. వాళ్ళకి బయటి ప్రపంచంతో సంబంధమే లేదు. రోజూ యింత తిండి తప్ప వాళ్ళకి వేరే ఆర్థికావసరాలు లేవు. ప్రకృతిలోని అందం—ప్రక్కన నది, మీద ఆకాశం, రాత్రి వెన్నెల, నక్షత్రాలు—వీటిల్లో భాగమై పోతారు. స్వేచ్ఛగా లైంగిక కలయికలోని అద్వితీయానందాన్ని అనుభవిస్తారు. వారి మోహతీవ్రతని గొప్పగా వర్ణిస్తాడు చలం.

కాని రాజేశ్వరి అమీర్ల మధ్య వొక అవాంతరం యేర్పడుతుంది. అమీర్‌కి మరో స్త్రీమీద వ్యామోహం ఏర్పడుతుంది. అతడు రాజేశ్వరికి దూరమయ్యే పరిస్థితి యేర్పడుతుంది కాని రాజేశ్వరి యిక్కడ గొప్ప త్యాగాన్ని ప్రదర్శిస్తుంది. అమీర్‌కి యే స్త్రీమీదనైతే మోహం ఏర్పడిందో ఆ స్త్రీ దగ్గరకు రాజేశ్వరి స్వయంగా వెళ్ళి ఆస్త్రీని అమీర్‌కి కలుపుతుంది. తను ప్రేమించిన పురుషుడి కోసం స్త్రీ ఎంత త్యాగాన్నైనా చేస్తుందని చలం ఈ సన్నివేశం ద్వారా చూపిస్తాడు. అయితే త్వరలోనే అమీర్‌కి ఆ స్త్రీమీద వాంఛ పోవటం, మళ్ళా అతడు రాజేశ్వరినే కోరటం జరుగుతుంది.

త్వరలోనే రాజేశ్వరి అమీర్లమధ్య మరో అవాంతరం యేర్పడుతుంది. రాజేశ్వరి గర్భవతి అవుతుంది. ఆమె గర్భం దాల్చటాన్ని అమీర్ సహించ లేక పోతాడు, తనకి రాజేశ్వరికి మధ్య ఆ రాబోయే శిశువు ఉంటుందని అతని భయం. ఆ గర్భాన్ని తీసేసుకోమంటాడు. కాని స్త్రీలో తల్లి కాబోతున్నప్పుడు ఉదయించే ప్రకృతి సహజమైన 'మాతృభావం' చాలా బలమైనది. రాజేశ్వరిలోను ఆ మాతృభావం మేల్కొంటుంది. స్త్రీకి మాతృ భావం ముందు ప్రియుడు తేలిపోతాడు. రాజేశ్వరి గర్భం తీసేసుకోవడానికి అంగీకరించదు. దానితో కోపగించుకొని అమీర్ ఆమెకి దూరంగా వెళ్ళిపోతాడు. అమీర్ ఆమెకు దూరంగా వెళ్ళిపోయినప్పుడు ఆ నిర్మానుష్య మైన మైదానంలో అండదండగా నిలుస్తాడు 'మీరా' అనే పదహారేళ్ళ కుర్రాడు. ఇంకా బాల్యం వీడని మీరా అంటే రాజేశ్వరిలోని మాతృ హృదయం ఉప్పొంగిపోతుంది.

రాజేశ్వరిని, అమీర్‌కి కలపడానికి మీరా రాజేశ్వరి కడుపు తీసేసే యేర్పాటు చేస్తాడు. అమీర్‌లేని ఆమె జీవితంలో యేర్పడిన శూన్యత్వంతో ఆమెలోని మాతృభావం సన్నగిల్లుతుంది. రాజేశ్వరి కడుపు తీసేయించుకున్న తర్వాత అమీర్ మళ్ళీ వస్తాడు. రాజేశ్వరికి అమీర్‌కి మధ్య మళ్ళీ ఆ పూర్వపు ఆనందం వెల్లివిరుస్తుంది కాని మళ్ళీ వాళ్ళిద్దరి మధ్య మరో సమస్య ఉత్పన్నమౌతుంది.

ఈసారి 'మీరా' రాజేశ్వరి జీవితంలో వొక ముఖ్యపాత్రని వహిస్తాడు. మీరాపై రాజేశ్వరికి మాతృభావమే అయినా 'మీరా' ఆమెను కోరతాడు. తనకోసం ఎంతో త్యాగంచేసిన 'మీరా'ని ఎంతో గాఢంగా ప్రేమిస్తుంది రా జే శ్వ రి. కాని 'మీరా'కి రాజేశ్వరికి ఎలాటి సంబంధాన్ని కూడా సహించలేకపోయాడు అమీర్. అతనిలో పురుష సహజమైన 'జెలసీ' అతి బలంగా ఉంది. అందువల్ల మీరాని ద్వేషిస్తాడు. అటు మీరాని ఇటు అమీర్నీ తృప్తిపరచలేక ఇద్దరిమధ్య నలగిపోతుంది రాజేశ్వరి. స్త్రీ పురుషుడి కోసం ఎంత త్యాగమైనా చెయ్యగలదు. కాని పురుషుడు స్త్రీ కోసం యేమాత్రం కూడా త్యాగం చెయ్యలేడని, అతనిలో స్వార్థంపాలు ఎక్కువని చలం నమ్మకం. పూర్వం అమీర్ కోరిన స్త్రీని అ మీ ర్ తో తను స్వయంగా కలిపింది రాజేశ్వరి. కాని రాజేశ్వరి మీరాని ఊరికే కలుసుకోవటమే సహించలేడు అమీర్. చివరకు మీరాని హత్య చెయ్యబోయి తన్నుతాను చంపుకుంటాడు అమీర్. అలా ముగుస్తుంది 'మైదానం.'

లోతుగా చదవలేని పాఠకులకు 'మైదానం' కేవలం సెక్సుని ఉద్రేకపరచాలనే ఉద్దేశ్యంతో రాయబడిన నవల అనే అభిప్రాయం కలుగవచ్చు. కాని వొకటి రెండు పేజీల్లో తప్ప సెక్సుని ఉద్రేకపరచే సంఘటనలు యేవిలేవు. 'మైదానం' ద్వారా చలం చెప్పదల్చుకున్నది స్వేచ్ఛగా సెక్సు ఆనందాన్ని అనుభవించటం తప్పుకాదని. అలా

అనుభవించటం ఆరోగ్యకరమని. 'సెక్సు'ని స్వేచ్ఛగా అనుభవించడ అణచుకోవటం వల్ల ఎన్ని అనర్థాలు ఉత్పన్నమౌతాయో ఫ్రాయిడ్ తెలియజేసాడు. ఈనాడు స్త్రీ పురుషులు లైంగిక ఆనందాన్ని స్వేచ్ఛగా అనుభవించాలని ప్రతివాళ్లు అంగీకరిస్తున్నారు.

'మైదానం' మీద మరో ముఖ్యమైన విమర్శ— 'మైదానం'లో చలం అవినీతిని ప్రోత్సహించాడని. పెళ్ళి చేసికున్నంత మాత్రాన భార్యకి భర్త మీద, భర్తకి భార్య మీదా స్త్రీ పురుషుల మధ్య జనించే మోహం జనించకపోవచ్చు. పెళ్ళి అనేది స్త్రీ పురుషుల మధ్య సంబంధాన్ని అప్రయత్నంగా జనించే సహజ ఆకర్షణని హరించివేస్తున్నది. త్వరలోనే భార్యకు భర్తమీద, భర్తకు భార్యమీద అయిష్టం యేర్పడుతున్నది. అయినా వాళ్ళిద్దరు కలిసి ఉంటూ— వొకరి శరీరం వొకరికి అయిష్టంగా— సమాజంకోసం, సాంప్రదాయంకోసం అర్పించుకోవటంలోని అవినీతికంటె ఆ భార్యా భర్తలు విడిపోవటం ఎక్కువ అవినీతికాదు. లేక భర్తకి తెలియకుండా భార్య తనకిష్టమైన పురుషుడితో రహస్యంగా భార్యకి తెలియకుండా భర్త తనకిష్టమైన స్త్రీతో రహస్యంగా కలుసుకోవటం కంటె—వారిద్దరూ బాహాటంగా విడిపోవటం అవినీతి కాదు. రాజేశ్వరి చాలామంది సంసార స్త్రీలవలె రహస్యంగా తన ప్రియుణ్ణి కలిసికుంటూ పైకి పతివ్రతగా చెలామణి కాలేదు. తనకిష్టమైనవాడితో లేచిపోయింది. దాంట్లో అవినీతి యేమిలేదు.

కాని 'మైదానం'ని— చలం భావాలని కాస్సేపు మరచిపోయి వొక నవలగా చదివితే విమర్శకు నిలువలేనివి యెన్నో ఉన్నాయి. యే స్త్రీయైనా తన ప్రియుణ్ణి, మరో స్త్రీ దగ్గరకు తీసుకువెళ్ళి, ఆ స్త్రీని బ్రతిమిలాడి— తన ప్రియుణ్ణి ఆ స్త్రీతో కలిపే త్యాగం చేస్తుందంటే నమ్మటం కష్టం. పూర్వం భర్తలకోసం పతివ్రతలు యేయే అసహజమైన నమ్మలేని త్యాగాలు చేసారని మన పౌరాణికులు రాసారో— ఇప్పుడు ప్రియుడి పేరుతో రాజేశ్వరిచేత అట్లాంటి అసహజమైన త్యాగాలు చేయించాడు చలంగారు. అలాగే మొదట బలమైన మాతృభావం ఉదయించటం వల్ల గర్భం తీసేసుకోవటానికి రాజేశ్వరి అంగీకరించలేదన్న చలంగారు తర్వాత ఆమె ఎందుకు అంగీకరించిందో తృప్తికరంగా చెప్పడు. అలాగే ఎంత ప్రేమించుకున్నా మానవులు ఆర్థికావసరాలకి అతీతంగా బ్రతకలేరు. 'మైదానం'లో ఉన్నంతకాలం రాజేశ్వరికి, అమీర్‌కి ఆకలి తీరడానికి కావలసిన 'తిండి' ఎలావచ్చిందో చలంగార్కి అవసరంలేదు. చలంగారు మనిషియొక్క ఆర్థికావసరాల్ని ఎన్నడూ పట్టించుకోలేదు. మనిషికి కావలసిన తిండి, బట్టా, కొంప మొదలైనవి సంపాదించుకోవటం అంత కష్టం కాదని ఆయన నమ్మకం.

నవలలోని ప్రధానపాత్ర రాజేశ్వరి ఉద్రేకం, instinct ప్రధానంగా కలిగినస్త్రీ. 'దైవమిచ్చిన భార్య'లో పద్మావతి వివేకంగల స్త్రీ. స్త్రీ యే పరిస్థితుల్లోనూ స్వాతంత్రియాన్ని కోల్పోకూడదని ఆమెకు తెలుసు. కాని రాజేశ్వరి కూడ గొప్ప ఉద్రేకంలో తనను పూర్తిగా అమీర్‌కి అర్పించుకొంది. తన స్వాతంత్రియాన్ని కోల్పోతుంది. 'మైదానం'లో రాజేశ్వరి గొప్ప విషాదాన్నే అనుభవించింది. కాని పాఠకులకి రాజేశ్వరిపై సానుభూతి కల్గటం కష్టం. ఎందుకంటె రాజేశ్వరి విషాదానికంతా కారణం రాజేశ్వరే న ని పి స్తుం ది. తర్వాత 'అమీర్'. స్త్రీని అనుభవించటమేగాని యే బాధ్యతలు మోయటానికి పురుషుడు సిద్ధంగా ఉండడు. అందుకు చక్కని ఉదాహరణ అమీర్. అమీర్‌కి స్త్రీని అనుభవించటం తప్ప మరేమీ తెలియదు.

'మైదానం'ను గూర్చి మరో ముఖ్య విషయం. చాలాకాలంగా మధ్యతరగతి కుటుంబాల్లో పాతుకుపోయిన నైతిక విలువల్ని షాక్ చెయ్యటం కూడా 'మైదానం' ద్వారా చలం ఆశించిన ప్రయోజనం. వొక బ్రాహ్మణ యువతి మహమ్మదీయ యువకుడితో లేచిపోవటాన్ని చిత్రించిన నవల ఆ షాక్‌ని కల్గించటంలో విజయవంత మైందనవచ్చు.

**అమీనా :**

చలంగారి నవలల్లో కల్లా 'అమీనా' చాలా విశిష్టమైనది. నవలకి కావలసిన కథ, పాత్ర చిత్రణ, సన్నివేశాలు — ఇవేవి అమీనాలో లేవు. రచయితకు, అమీనా అనే అమ్మాయికి మధ్య యేర్పడిన ఒక ఆధ్యాత్మిక అనుబంధాన్ని అతిమనోహరంగా చిత్రిస్తుంది 'అమీనా'. 'అమీనా'ని "Auto-Biogrophical Novel" అనవచ్చు. ఈ నవలలో కన్పించే చాలామంది వ్యక్తులు తెలుగు దేశంలో నిజంగా జీవించారు. కనీసం వాళ్ళ పేర్లయినా మార్చటానికి ప్రయత్నించడు చలం.

'అమీనా' అనే ముస్లిం అమ్మాయిని చూస్తాడు రచయిత. ఆ పిల్లని చూడటంతోటే స్నేహాన్ని కోరతాడు. 'అమీనా' కూడా వెంటనే "మీతోనే" ఉంటానంటుంది. కాని అంత త్వరగా "మీతోనే ఉంటానన్న" ఆ అ మ్మా యి ని నమ్మలేకపోతాడు రచయిత. "రేపు సాయంత్రం వచ్చి తీసుకుపోతా"నంటాడు. కాని "ఆ రేపు సాయంత్రం" సందూరి సుబ్బారావు యెంకిపాటలు వింటూ అమీనాని మరచిపోతాడు. ఆలస్యంగా అమీనా కోసం వెడతాడు. అమీనా తనకోసం "ఎదురుచూసి ఎదురుచూసి" తన యిల్లు వెతుక్కుంటూ వెళ్ళిందని తెలుసుకుంటాడు.

త్వరలోనే రచయితకు*, అమీనాకి ఉన్న సంబంధం— ఈ లోకానికి, ఈ ప్రాపంచిక విలువలకి అతీతమైనదిగా రూపొందుతుంది. అమీనా రచయిత ఆత్మకి ఒక బాహ్యరూపంగా ఒక సంకేతంగా మారుతుంది. దీన్నే ఆర్.యస్. సుదర్శనంగారు అమీనా రచయిత 'అంతఃకరణ'కి సంకేతమని సూచించారు*. అమీనాని చేరటం, అమీనాని తెలిసికోవటం రచయిత జీవిత లక్ష్యంగా మారుతుంది. అమీనాని తెలిసికొని అమీనాతో ఐక్యం కాగలిగితే—తన ఆత్మని తాను తెలిసికొని, తన ఆత్మతో తాను ఐక్యమైనట్లే. అప్పుడే రచయిత జీవిత బంధనాలనుండి విడిపడి గొప్ప శాంతిని సాధిస్తాడు. కాని అదంత సులభంగా జరగదు. అమీనాకి, రచయితకి మధ్య ఎప్పుడూ యేవో ఈ ప్రాపంచిక విలువలు అడుగోడల్ని లేపుతాయి. వాటన్నింటిని ఛేదించుకొని అమీనాని చేరలేక పోతాడు. కాని అమీనాకి దూరమైనప్పుడల్లా తీవ్రమైన అశాంతిని, ఆవేదనని అనుభవిస్తాడు. అమీనాకి దూరమౌతూ, అమీనాకోసం అన్వేషిస్తూ ఉంటాడు. 'అమీనా' నవలంతా ఈ అన్వేషణతో నిండి ఉంటుంది.

అమీనాని వచ్చితనతో ఉండమంటాడు. కాని పట్టాభి అనే స్నేహితుడు వచ్చి రచయితను అమీనాకి దూరంగా తీసికెడతాడు. అతడు తిరిగివచ్చేటప్పటికి యింట్లో అమీనాలేదు. తర్వాత మూడు రోజులకి 'అమీనా' ఒక బురద గుంటలో చేపలు పడ్తూ కన్పిస్తుంది. తను తన 'ఆత్మ'ని లేక 'అంతఃకరణ'ని నిర్లక్ష్యం చేసినప్పుడు అలాగే బురదగుంటల వంక పోతుందని ధ్వని. చేపలుపడ్తున్న అమీనాని తనతో రమ్మంటాడు. "అమీనా చచ్చిపోయిందంటుంది." కాని చివరకు తనతో రావటానికి వప్పిస్తాడు. తనని వంటమనిషిగా పెట్టుకోమంటు ది అమీనా. కాని అమీనా తల్లివచ్చి "జీత" మెంతిస్తారని అడుగుతుంది. అమీనాని తన ఆత్మకి బాహ్యరూపంగా యెంచుకుంటున్న రచయితకి అమీనాతో తన సంబంధాన్ని అతి లౌకికమైన "జీతం"తో ముడిపెటటం ఘోరంగా, నీచంగా కన్పిస్తుంది. అది సహించలేక పోతాడు. "జీతం యివ్వను పొమ్మంటాడు." అంతటితో అమీనా కథ ఆఖరు అనుకుంటాడు.

కాని 'అమీనా' కథ ఆఖరు కాలేదు. తనకేమి అక్కర్లేదనుకున్నా తన అమ్మకోసం మాత్రం రెండు రూపాయలు జీతం యివ్వమంటుంది అమీనా. ఆ మాట రచయితని తృప్తి పరుస్తుంది. అమీనా అతనికి దగ్గరైనట్టే ఔతుంది. కాని త్వరలోనే మళ్ళా అమీనాని నిర్లక్ష్యం చేస్తాడు. తన స్నేహితుడు డాక్టర్ వస్తున్నాడన్నవార్త రచయితని

---

* 'అమీనా' నవలని చర్చిస్తున్నంతసేపు 'రచయిత' అన్నప్పుడల్లా చలంగా రేనని గమనించాలి.

* భారతి — ఫిబ్రవరి 1965.

సర్వం మరచిపోయేలా చేస్తుంది. డాక్టర్ వస్తున్నాడన్న సంతోషంలో "అమీనా తన యింట్లోంచి వెడతేనే మంచిదేమో" అనుకునే స్థితికి వస్తాడు. ఈ నైర్లక్ష్యాన్ని అమీనా సహించలేదు మళ్ళా అతనికి దూరంగా వెళ్ళిపోతుంది.

రచయితలో మళ్ళా అశాంతి, ఆందోళన, అన్వేషణ మొదలౌతాయి. డాక్టర్ యిట్టేవచ్చి అట్టేపోతాడు. తర్వాత 'శ్యామల' అనే స్నేహితురాలి కోసం వెడతాడు. శ్యామల కూడా అతనికి వెంటనే దక్కదు. అమీనానివిడిచి శ్యామలకోసం వచ్చినందుకు బాధపడ్తాడు. "అర్ధరాత్రి యమున వొడ్డులో ఆడుకుంటూ ఒక్కసారి ఎండాకాలం మధ్యాహ్నం సహారామధ్యకి దూకి నట్టయింది" అనుకుంటాడు. యమున వొడ్డు అమీనా. 'సహారా' శ్యామల. కాని అమీనాని విడిచి వచ్చాకు. తను బానిస, జీతానికి బానిస, మరెన్నో లౌకిక విలువలకి బానిస. అందుకే స్వచ్ఛమైన స్వేచ్ఛాప్రియ అమీనాని చేరుకోలేక పోతున్నాడు. తనకి లోకంలోని యింకా కొన్నింటి మీద ఆశా, మమకారం పోలేదు. శ్యామల సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను కోరుతాడు. శ్యామలని తీసికొని అమీనా కోసం వస్తాడు. సర్వాన్నీ త్యజించి అమీనా కోసం రాలేదు. అందువల్ల ఇప్పుడు అమీనాకి, రచయితకి మధ్య శ్యామల నిలుస్తుంది. "తను ఉండగా అమీనా ఎందుకు? అమీనా ఎవరు?" అని అడుగుతుంది శ్యామల. 'అమీనా ఎవరు?' అని ఎవరడిగినా రచయిత తీవ్రంగా స్పందిస్తాడు. "అవును ఎవరు? అమీనా ఎవరు? ఎవరు? ఎవరు?" అని తన్నుతాను ప్రశ్నించుకుంటాడు. "అమీనా ఎవరు?" అనే ప్రశ్న తన ఆత్మనే తాను చేరలేక పోతున్న అతని అసమర్థతని సూటిగా తాకుతుంది. ఇలా కొంత కాలం శ్యామల అందంలోపడి ఆమెమీద శారీరక వ్యామోహంతో రచయిత తన అమీనాకి దూరమౌతాడు.

"చూపులతో గుండెల్లో చిల్లుల చేసే శ్యామల, గొలుసులకన్న బలమైన చేతుల శ్యామల, మనసుల్ని పెనవేసుకునే ఉక్కుతీగెల శ్యామల___" అలాంటి శ్యామలను వదిలి "వెర్రి అమీనా, పిల్ల అమీనా, పిచ్చి అమీనా, తురక అమీనా, చింకిరి అమీనా" కోసం వెళ్ళలేక పోతాడు.

కాని 'అమీనా'యే అతన్ని వెతుక్కుంటు వస్తుంది. అతని యింట్లో పని చెయ్యటానికి కుదురుతుంది. శ్యామల అమీనాని కొంచెం 'నాగరికంగా' మారుస్తుంది_ జుట్టు కత్తిరించి, కొత్తరిబ్బన్లు యిచ్చి. అతి సహజమైన 'అమీనా' మీద కృత్రిమ లోకం నాగరికత పేరుతో పూసిన పూతలవి. అంతాకలసి "పోతరాజు" అనే మిత్రునింటికి విందుకు వెళ్తారు. అక్కడ స్నేహితుల మధ్యలో పడి మళ్ళా 'అమీనా'ని నిర్లక్ష్యం చేస్తాడు. అమీనా వెళ్ళిపోతుంది. మళ్ళా 'అమీనా' కోసం దిగులు, అన్వేషణ

ఆ రాత్రి అమీనాని వెతుక్కుంటూ పోవాలను కుంటాడు. కాని యింకా శ్యామల ఆకర్షణని వదలించుకోలేడు. "పోనీ ఉందురూ" అన్న శ్యామలమాట శ్యామలతో ఆ రాత్రి గడపబోయే మధుర క్షణాలని జ్ఞాపకం చేసి అతడు అమీనా కోసం వెళ్ళకుండా ఆపుతుంది. "అమీనా—చూద్దాం తర్వాత ఈ రాత్రికి ఈ లోయల సౌందర్యమే నా పక్కన ఆహ్వానిస్తోంది" అనుకుంటాడు. కాని 'ఉండిపోదురు' అని ఆహ్వానించిన శ్యామల అతని కోర్కెను తీర్చనేలేదు. అతనిలో కోరికని రగిలించి, ఆ కోరికను తీర్చని శ్యామల మీద కసి, ద్వేషం జనిస్తాయి. అంతా మోసం, దగా, మాయ అనుకుంటాడు—నిజమొక్కటే—అదే అమీనా—అమీనాని చేరలేక పోయాడు. ఆ రాత్రి అటు శ్యామలతో గడపలేక, యిటు అమీనాని చేరలేక అతడు పడ్డ బాధని చలంగారు గొప్పగా యిలా వర్ణిస్తాడు.

"పక్కచుట్టు......గాజుల చప్పుడు......పమిటకొంగు చివర...వెల్లేకాళ్ళు...
చీకటి...చీకటి

ఒక్కచూపు...ఒక్కమాట...ఒక్క ఓదార్పు...యేమీలేవు...
చీకటి...లోపల...బైట...చీకటి...
మోసపడ్డ ద్వేషపు చిక్కని కాంతి......
బలిపడ్డ జంతువు గుండెల్లోని గడ్డకట్టిక నల్లని నెత్తురు...
కొడుకు చేతిలో దెబ్బలు తిన్న ముసలిదాని ప్రేమపు మూలుగు...
ఒక్కటే దారి...కసి_కసి_కసి_శాంతి—ఒక్కటే శాంతి_కసి—
క్షమించ లేని—ఎన్నాళ్ళకీ ఉపశమించని—మధురమైన కల
దేవత—కసి—
కసీ—ఓ కసీ—
నీ ముందు నా ప్రతిజ్ఞ—
నీ పాదాల ముందు నా కలం—
సిరాతో, నల్లని సిరాతో, నీకు అభిషేకం—
ద్వేష వాక్కులు నా రుక్కులు—
నా హృదయమే—నలిగిన—మన్నుతో తొక్కిన ఈ వేడి హృదయం...
నీకు నైవేద్యం—
రా—నీ చేదురసం పొయ్యి—నా కలంలో నింపు—
నిలవలేను—వెళ్లాలి—

సమస్తం__మిత్రత్వం__ప్రేమ__ధర్మం__అన్నీపదాలు__ఉత్త పదాలు__ మూఢుల అనృతాలు__

ఎవరు, ఎవరు, ఇంక__ఎవరు__

ఏది, ఏది__అమీనా__ఏది__"

ఈ అనుభవంతో "సమస్తం_మిత్రత్వం_ప్రేమ_ధర్మం_అన్నీ ఉత్తపదాలు_మూఢుల అనృతాలు_నిజ మొక్కటే_అదే అమీనా," అన్నజ్ఞానోదయం అతనిలో కలుగుతుంది. అంటే అతని ఆత్మని అతను గుర్తించే జ్ఞానం అతనికి కల్గిందన్నమాట. అమీనాకోసం పరుగెత్తుతాడు. యేడుస్తూ అతన్ని కౌగిలించుకుంటుంది అమీనా. తనని విడిచి ఎంత అశాంతితో కొట్టుకుంటున్నాడో తెలిసికున్న అతని ఆత్మ అతన్ని అమీనా రూపంలో గొప్పజాలితో అలా కౌగలించుకుని ఓదారుస్తుంది.

"అమీనా...అమీనా......నిన్ను వొదిలి నేనే మైనాను అమీనా......ఎందుకు నడిచాను__చీకటి నిప్పులోకి...అందమైన కంచెలోకి...గుండెలేని గులాబి దగ్గరకు" అనుకుంటాడు.

శ్యామల ఆకర్షణనుండి బయటపడి అమీనాని చేరుకున్న రచయితకి__అమీనాకి మధ్య మళ్ళా వొక పెద్ద అడ్డుగోడ వస్తుంది ఈ సారి సుబ్బులు__రచయిత భార్య__ అమీనాకి - రచయితకి మధ్య నిలుస్తుంది. అమీనాకి, తన భర్తకిగల ఆ అకారణ సంబంధాన్ని సుబ్బులు అర్థం చేసికోలేకపోయింది. అమీనాని తన యింట్లో పనిచేసే వొక సామాన్య దాసీదానిలా భావించి యింట్లోంచి వెళ్ళగొడ్తుంది. ఇంతకాలం రచయిత అమీనాకి తనకుతానై దూరమయ్యాడు. మొదలు స్నేహితుల కారణంగా, తర్వాత శ్యామల సౌందర్యంలోపడి __ కాని ఇప్పుడు __ ప్రాపంచిక విలువలు __ సమాజం, సాంప్రదాయం భార్యరూపంలో అతనికి అమీనాకి మధ్య నిలిచింది.

అమీనాకోసం మళ్ళా అన్వేషణ__అతనికి దూరమైన అమీనా మళ్ళా బురద గుంటలో - అమీనాకి తను తన స్నేహితుల పేరుతో, ప్రియురాండ్ల పేరుతో - తను తగిలించిన గాయాలు - "సత్య" చారల జాకెట్టు రూపంలో, 'శ్యామల' కట్టిన రిబ్బన్ రూపంలో, తాత కట్టిన 'పచ్చ రిబ్బన్' రూపంలో అతనికి కన్పిస్తాయి ఈ సారి అమీనా అతన్ని గుర్తించదు. మాట్లాడదు. ఇది భరించలేకపోతాడు. అమీనాకోసం తను కూడా బురద గుంటలో దిగటానికి సిద్ధపడతాడు. "బురదగుంటలోకి దిగితే అతని లాగు బురదై పోతుందంటుంది అమీనా, తనకోసం 'నాగరికత'ను వదిలి 'బురద'ని పూసుకోవటానికి అతడు సిద్ధంగా లేడని అమీనా అతన్నలా వ్యంగ్యంగా చెప్పుతుంది. కాని అతడిప్పుడు ఆ 'నాగరికత'ను వదిలేసాడు. 'అమీనా'యే సర్వస్వం అని

భావిస్తున్నాడు. అందువల్ల అతడు ఆ బురద గుంటలోకి నిస్సంకోచంగా దిగుతాడు. అమీనాని కావలించుకుంటాడు. అమీనా సర్వస్వాన్ని—"అమీనా దుమ్ముని, అమీనా బుట్టని, అమీనా పమిటని – అమీనా చెమటని" అన్నింటిలోను తను ఐక్యమవబోతాడు. కాని అమీనా అతనితో రావటానికి వప్పుకోదు. అతని భార్య ఉన్నంతకాలం తను రానంటుంది.

గొప్ప సంఘర్షణలో పడిపోతాడు. సుబ్బులు భార్య, సమాజం తనకి శాశ్వతంగా తగిలించిన లంకె, వదులుకోలేడు. అమీనా—తన ఆత్మ – ఆమెతో ఐక్యమయితేనే అతనికి శాంతి. ఇలా లౌకిక బంధనాలకి—అలౌకిక అనుబంధానికి—మధ్య పడి కొట్టుకుంటాడు.

మళ్లా అమీనా కన్పిస్తుంది. ఈ సారి అమీనా పెరుగుతుంది. రచయితని తనకొక చీర కొనివ్వమని అడుగుతుంది షాక్ తింటాడు రచయిత. తనలోని నిర్మలత్వానికి, స్వచ్ఛతకి, అమాయకత్వానికి, అలౌకికత్వానికి — అమీనాని బాహ్యరూపంగా యెంచుకున్నాడతను. 'అమీనా' బాహ్యంలో ఇవన్నీ అతనికి కన్పించాయి. కాని అమీనా తనని చీర కొనివ్వమని అడిగినప్పుడు అమీనా కూడా తనచుట్టూ ఉంటున్న లౌకిక విలువల్లో చేరిపోయిందని రచయిత భావిస్తాడు. 'చీర' అనేది వొక తుచ్ఛమైన లౌకిక విలువకి చిహ్నంగా కన్పిస్తుంది రచయితకు. "చీర కొనివ్వమని చెల్లెలు అన్నను అడుగుతుంది కూతురు తండ్రిని అడుగుతుంది బోగంది విటుణ్ణి అడుగుతుంది. అధికారి భార్య తన భర్తక్రింద పనిచేసే వాడిని అడుగుతుంది అమీనా తనకి యివేవీకాదు వీటన్నిటికంటే అతీతమైన అనుబంధాన్ని 'చీర కొనివ్వమని' అడిగి అతిచులకన చేసింది అమీనా. 'చీర కొనివ్వ'నని ఖచ్చితంగా చెప్పేస్తాడు.

"పోనీ...పోనీ...నా జీతం యివ్వ"మంటుంది అమీనా...

ఇదింకా క్రుంగదీస్తుంది రచయితను. ఆమెమీద ఇంతకాలం యేర్పరచుకున్న ఆధ్యాత్మిక అనురాగమంతా అణాలు, రూపాయల లెక్కగా మారిపోయిందనిపిస్తుంది. లెక్క చూసి 'అమీనా'కి యివ్వాల్సిన జీతం యిచ్చేసి అమీనాని మరచిపోయే ప్రయత్నం చేస్తాడు

కాని అమీనా మళ్ళీ వస్తుంది కొత్త వోణి వేసికొని రచయిత యిచ్చిన జీతంతో "అతని జ్ఞాపకార్థం ఆ వోణి కొన్నాన"ని చెప్తుంది మళ్ళా వొకసారి తన తప్పిదాన్ని గుర్తిస్తాడు రచయిత. అమీనాకి లౌకిక విలువలకి ముడిపెట్టిన అతని అజ్ఞానాన్ని తెలిసికొంటాడు, కాని అప్పటికే చాలా ఆలస్యమైపోయింది. అమీనా యిక అతనికి కన్పించకుండాపోయింది. ఆమెకోసం తన సర్వస్వాన్ని త్యజించి

వెళ్ళలేకపోతాడు. ఆమెను వెళ్ళకుండా ఆపలేకపోతాడు. అతనికి అన్నీ అడ్డమే— "గడ్డిబండి అడ్డం — మర్యాద కట్టుకున్న అతని కాళ్ళే అడ్డం — చదివి చదివి గుడ్డివైన అతని కళ్ళే అడ్డం — సబ్బుతో కడుక్కున్న అతని చేతులే అడ్డం." అంతే— ఎదగని పువ్వు అమీనా — అతన్ని విడిచి వెళ్ళిపోయింది.

కాని 'అమీనా' రూపంలో చూసికొన్న తనలోని 'ఆత్మ'ని అన్వేషించటం మానలేదు చలంగారు. ఆ రూపమే అతనికి రమణాశ్రమంలో సౌరిస్‌లో ప్రత్యక్షమయ్యింది. సర్వాన్ని పరిత్యజించి, ఆ రూపంలో ఐక్యమై గొప్ప "అద్వైతాన్ని" సాధించారు చలంగారిప్పుడు. చలం సాహిత్యాన్ని, వ్యక్తిత్వాన్ని మొదటినుండి గమనించిన వాళ్ళకి ఆయన యివ్వాళ్ళ రమణాశ్రమంలో ఉండటం యేమాత్రం ఆశ్చర్యం కలిగించదు. తనకి తెలియని వొకానొక రూపంకోసం "నిరంతరాన్వేషణ" చలం జీవితంలోను, సాహిత్యంలోను కన్పిస్తుంది. ఆ అన్వేషణకి పరాకాష్ఠ 'అమీనా'.

అన్నింటికంటే ముఖ్యం—సాహిత్యపరంగా—ఎంతో ప్రఖ్యాతి వహించిన చలంగారి శైలి 'అమీనా'లో అద్భుతమైన పరిపుష్టిని సాధించింది. చలంగారు తన హృదయాన్ని పిండి, సిరా రూపంగా మార్చి అక్షరాల రూపంలో 'అమీనా'గా మలచాడనిపిస్తుంది. మూగ హృదయపు అన్వేషణకి, ఆవేదనకి ఇంత గొప్ప కళారూపం యివ్వటం తెలుగు సాహిత్య చరిత్రలో చాలా అరుదు

'అమీనా'లో మరో ముఖ్య విషయం, చలం నవలలు మొదలే చెప్పినట్లు భావ ప్రధానమైన నవలలు. కాని 'అమీనా'లో చలం తన భావాలన్నింటిని మరచిపోయాడు. తనకు అమీనాకు ఉన్న ఆ అలౌకిక అనుబంధాన్ని చిత్రించటం తప్ప చలం 'అమీనా'లో మరే విషయం జోలికిపోలేదు అందువల్ల సాహిత్యపరంగా శాశ్వతంగా నిలిచే నవల 'అమీనా'.

**అరుణ**

చలంగారు కలలుగనే గొప్ప స్త్రీత్వానికి ప్రతీక 'అరుణ' నవలలోని అరుణ. చలంగారు స్త్రీలో దైవత్వాన్ని, సామాన్యునికి అర్థంకాని వొక మాయను క్షణక్షణానికి మారుతుండే అలౌకిక సౌందర్యాన్ని దర్శించాడు. స్త్రీలో సహజంగా నిక్షిప్తం అయి ఉండే 'దైవత్వం' వికసించాలంటే ఆమెకు సంపూర్ణ స్వేచ్ఛ కావాలి. పురుషుడు స్త్రీని తరతరాలుగా అణచి వేయటంవల్ల ఆమె మానసికంగా యెదగలేక పోతున్నది. సృష్టి ఆమెకు ప్రసాదించిన ప్రత్యేక శక్తులు బయటకు రాక ఆమెలోనే హరించి పోతున్నాయి. అందువల్ల పురుషుడు స్త్రీ నిజంగా యివ్వగల్గే ఆనందానికి దూరమై

పోతున్నాడు. 'అరుణ' పురుషుడి ఆధిక్యత నుండి బయటపడి సంపూర్ణ స్వేచ్ఛని సాధించి తన్ను తాను స్త్రీత్వంలోని ఔన్నత్యానికి ప్రతీకగా రూపొందించు కుంటుంది. అందువల్లనే 'అరుణ' లో చలానికి దైవత్వం కన్పించింది. ఈ అరుణే తర్వాత సంపూర్ణ దైవత్వాన్ని సంతరించుకొని "పురూరవ" లో ఊర్వశిగా మారుతుంది. అరుణ సామాన్య మానవస్త్రీ కాదనటానికి చలంగారు ఆమెనిలా వర్ణిస్తాడు :

"ఎక్కణ్ణించి వచ్చిందో! ఎంత దూరం నుంచో... పాదాలమీదనన్నా దుమ్ము లేదు...............

అప్పుడే గదిలో అలంకరించుకొని బైటికి వచ్చిన దానిమల్లే ఉంది. జీవితమంతా ముళ్ళలోంచి, దుమ్ములోంచి, ద్వేషాలలోంచి నిందలలోంచి, అపనిందలలోంచి అంత నిర్మలంగా నడిచి, శుభ్రంగా పవిత్రంగా ఉండగల్గేవారు అరుదు. తామరాకుమీద నీటి బొట్టు, ఆకుల్లోంచి క్రిందికి జారే వెన్నెల రేఖ! నడిచిన చోటనల్లా హృదయాలమీద అడుగులు పెడుతూ వెడుతుందంటే వొక వింతా ?"

అలాగే అరుణ స్వేచ్ఛా జీవి. ఎవరికి దానిసకాదు ఎవరికి లొంగదు. తన ప్రియులకు కూడా. తనంతట తానుగా ఎవరికైనా ఏదైనా యివ్వాలి.

".........కాని అరుణని బ్రతిమాలడం, ఆకాశంలో యెగిరే పిట్టని పిలిస్తే ఎంత లాభం, అంతే. ఆమె స్వేచ్ఛగా వరాలు కురిపించాలి. ప్రార్థనలూ, కన్నీళ్ళూ పని చెయ్యవు." అంటాడు చలం 'అరుణ' ని గూర్చి.

భర్త ఉన్నా తన కిష్టమైన పురుషులతో సంబంధం పెట్టుకుంటుంది అరుణ. గొప్ప సౌందర్యం, ఆకర్షణ, ప్రేమించగల హృదయం గల స్త్రీ ఒక పురుషుడికే విధేయురాలై ఉండాలన్న సాంప్రదాయాన్ని చలం అంగీకరించలేదు. అందాన్ని పంజరంలో పెట్టి బంధించటం పాపమని చలం నమ్మకం.

మనకి తెలిసిన అరుణ ప్రియులు ముగ్గురు— అరుణ కథని మనకి చెప్తున్న "రచయిత", "బీష్" అనే నిక్‌నేమ్‌తో పరిచయమయ్యే యువకుడు, "నాగన్" అనే మహమ్మదీయుడు. రచయిత అరుణకి వొకప్పటి ప్రియుడు. అరుణ సౌందర్యంలోని వైశిష్ట్యం యేమిటో ఇతనికి తెలుసు. స్త్రీగా అరుణలోని అసాధారణత్వాన్ని కూడా ఇతడు గుర్తించాడు. అందువల్ల అరుణని గొప్ప ఆధ్యాత్మిక దృష్టితో ఆరాధిస్తాడు. రచయితలోని ఈ 'సంస్కారం' అరుణకి కూడా తెలుసు. అందువల్ల మాటమాటకి మగవాళ్ళని తిట్టే అరుణ రచయితను మాత్రం వదిలేస్తుంది.

రెండేళ్ళ తర్వాత రచయితని చూడటానికి వచ్చిన అరుణతో పాటే మిగతా ఇద్దరు ప్రియులు బీష్ నాగన్ కూడా వస్తారు. ముగ్గురు ప్రియుల మధ్య అరుణ.

ముగ్గుర్ని నవ్విస్తూ, కవ్విస్తూ, ద్వేషాల్ని, కోరికల్ని రగిలిస్తూ, తృప్తి పరచినట్టే పరచి వాళ్ళకి అందకుండా పోతూ వాళ్ళతో ఆడుకుంటుంది.

ఈ ముగ్గురూ అరుణని ఆరాధించే వాళ్ళే అరుణకోసం యే త్యాగమైనా చేస్తామన్నవాళ్ళే. అరుణని గాఢంగా ప్రేమిస్తున్నవాళ్ళే. కాని అరుణ మాత్రం ఎవరికి అందదు. ముగ్గుర్ని మరల్చి, మత్తెక్కించి, మధుర స్వప్నాలతో ఊగించి ఎండమావిలా మారిపోతుంది. స్త్రీ ఎప్పుడూ పురుషుడికి సంపూర్ణంగా వశమై పోకూడదని, అలా వశమైపోయిన స్త్రీని పురుషుడు గౌరవించడని చలం నమ్మకం. ఒక్కసారి స్త్రీ పురుషుడికి తన స్వాతంత్రియాన్ని కోల్పోయి పూర్తిగా వశమై పోయిందా– ఆ స్త్రీపై ఆరాధన పురుషుడికి పోతుంది. అందువల్ల స్త్రీ ఎప్పుడూ పురుషుడికి అందీ అందకుండా ఉండాలి. అరుణ తన ప్రియులకు ఎప్పుడూ అలా అందీ అందకుండా ఉంటుంది. అందుకే ఆమెపై ఆమె ప్రియులకు ఆ ఆరాధనా భావం. ఈ ముగ్గురు పురుషులతో ఒక స్త్రీ ఇలా ఆడుకోవటం అంత సులభం కాదు. ఆ ముగ్గురు ఒకరిపై ఒకరు ద్వేషంతో కాలిపోతారు. కాని ఆ ముగ్గుర్ని తన కనుసన్నలతో అదుపులో పెట్టగల చాతుర్యం, చాకచక్యం అరుణకి ఉన్నాయి. సర్కస్‌లో వివిధ జంతువుల్ని ఆడిస్తూ, అదుపులో పెట్టే "రింగ్ మాష్టర్" లా కన్పిస్తుంది. అరుణ ఈ సన్నివేశంలో.

ఇంతలో అరుణ భర్త 'జయరావు' అక్కడకు వస్తాడు. అరుణని యింటికి పోదాం రమ్మంటాడు. రానన్న అరుణని కొట్టబోతాడు. అది చూసిన బీష్ట జయరావుని తంతాడు. కాని జయరావు అరుణ భర్త అని తెలిసాక బీష్ట, నాగన్ పిల్లులుగా మారిపోతారు. జయరావును కొట్టినందుకు క్షమాపణ అడుగుతాడు బీష్ట. తెల్లబోయి నోరు మూసుకుంటాడు నాగన్. "భర్త! ఆ మాటముందు యిష్టాలు, ధర్మాలు హృదయాలు, స్వేచ్ఛలు, ప్రేమలు, పాపాలు– అన్నీ తలవొంచి తప్పు కోవాల్సిందే!" అని వ్యాఖ్యానిస్తాడు రచయిత. "భర్త అనే ఒక్కమాటతో తమ బాధ్యతల్ని ఒదులుకొని, సంబంధాల్ని కోసేసికొని, ధర్మపరులు, మర్యాదస్తులు, ఉద్యోగస్తులు వారిద్దరూ (నాగన్, బీష్టలు) తప్పుకున్నారు." వాళ్ళిద్దరే కాదు. అరుణలో దైవత్వాన్ని చూసిన రచయిత కూడ అరుణను ఆమె భర్తనుండి కాపాడ లేకపోతాడు. 'రచయిత'తో ఉండిపోతానని అరుణ అన్నప్పుడు "అన్యాయం నన్నట్లా యిరికించటం– కాని ఉంటేమాత్రం నాకేం శాంతి. ఈ గుంపులు, ఈ కొత్తవాళ్ళు' తురకాళ్ళు, మాలాళ్ళు" అనుకుంటాడు. స్త్రీ పట్ల మగవాడి ఆకర్షణంతా— స్త్రీతో తన కెంగిక వాంఛ తీర్చుకోవటం తోటే ముడిపడి ఉంటుందని, ప్రేమా ఆరాధనా త్యాగం మొదలైనవన్నీ మనసు కల్పించుకునే ఉత్త భ్రమలని ఈ దృశ్యంతో అరుణకి ధృవ పడుతుంది. తనకోసం పెర్రిగా వెంటబడిన తన ప్రియులెవరూ తనని తన భర్త బారి నుండి కాపాడలేక పోవటం అరుణని ఆశ్చర్య పరుస్తుంది.

అరుణకోసం కొంత త్యాగం, సాహసం చెయ్యగల కొంత సంస్కారం గల రచయితకూడ అరుణని తనతో ఉండిపొమ్మని చెప్పలేక పోవటానికి కారణం సహజంగా పురుషుడిలో ఉండే 'స్త్రీ' ని స్వంతం చేసికోవాలన్న స్వార్థం. అరుణ తనతో ఉన్నా తనకి దక్కదనే భయం. "నా దగ్గరే ఉంచుకుంటే మాత్రం నాకు దక్కుతుందా. నా ఆసరా చూసికొని లోకమంతా తిరుగుతుంది" అనుకుంటాడు. అందం, ఆకర్షణ, ప్రేమించగల హృదయం గల స్త్రీ ఒక్క పురుషుకికే స్వంతం కాకూడదనే భావాన్ని హర్షించే 'రచయితే' అలా అనుకోవటం ఒక భావాన్ని చెప్పటం ఎంత తేలికో, నిజంగా ఆచరించటం అంత తేలిక కాదు అని ఋజువు చేస్తుంది ఎంత సంస్కారవంతుడైనా తనలోని మౌలికమైన 'instincts' జయించటం కష్టం.

తన ప్రియులు నీరుగారి పోవటంతో అరుణ భర్తతో వెళ్ళడానికే నిర్ణయించుకుంటుంది. వెళ్ళేముందు రహస్యంగా రచయితను కలిసికొని తనలో శారీరక వాంఛలపై యేర్పడిన విరక్తిని, ఈ శరీరాలకు అతీతమైన ప్రేమను అందుకోవాలని ఆమె పడుతున్న తాపత్రయాన్ని అరుణ యిలా తెలియజేస్తుంది:

"నీతో ఒక రహస్యం చెపుతాను. నేనింతవరకు ఎవర్నీ ప్రేమించలేదు. ఇప్పుడు తలచుకు చూసుకుంటే, నా హృదయంలో గొప్ప ప్రేమ ఉంది. ప్రేమించాలనే ఆశ అపారంగా ఉంది. అందువల్లనే యివన్నీ. కాని నా ఆదర్శమే అతి ఉన్నతం. నా పురుషుడే-ఒక్కడే నాకలల్లో బతుకుతున్నాడు. నిరంతరం నాకేసి చేతులు జాస్తో. ఈ మనుషుల్ని చూస్తే వాళ్ళ లోపాలు, దేహ లోపాలూ, గుణలోపాలూ అన్నీ కనబడతాయి. ఒక్కటి చూడు! అబ్బా ఎంత వికృతం, ఎంత నీచం, ఆ నిమిషాన మొగవాడి స్వరూపం. రోడ్డుమీద కుక్కల్ని చూడమూ, అదే జ్ఞాపకం వచ్చి నవ్వు ఆపుకోలేను. తననెంతో మోహించి, చేతులో చిక్కాననుకొని. కులుకుతున్న మొగాడు ఆశ్చర్యపడతాడు నా నవ్వుచూసి. నాకు మనుషుల్లో ఒకరికీ, ఒకరికీ భేదం నశించింది. అందరూ అంతే. యేం చేస్తారు పాపం. అంతకన్న చాతకాదు. మనుషత్వాన్ని అతిక్రమించాలని ప్రయత్నిస్తారు కొందరు నీబోటివాళ్లు. కాని పాపం చేతకాదు. శరీరం ఒక్కటే ప్రేమ సాధ్యం. యే నీచుడైతే యేం? భర్తఐతేనేం? బ్రాహ్మడైతేనేం? ఆ మొహమ్మదీయుడైతేనేం? ఏదో కాలక్షేపానికి?"

'మైదానం'లో శారీరక సౌఖ్యానికి నివాళులెత్తిన చలం 'అరుణ'లో శారీరక సౌఖ్యంతో విరక్తి చెంది శరీరానికి అతీతమైన దాన్నేదో సాధించాలనే అన్వేషణలో పడ్డాడనిపిస్తుంది. ఆ శరీరానికి అతీతమైన ఆనందాన్ని, ప్రేమని సాధించటానికి అరుణ అదృశ్యమై పోవటంతో అరుణ నవల ముగుస్తుంది. 'అరుణ' ముగింపు చాలా గొప్పగా ఉంటుంది.

అరుణ ఒక రెండు చేతులు, రెండు కాళ్లు గల స్త్రీ కాదు. అరుణ ఒక భావం.

'అరుణ' అంటే ఎఱుపు. 'ఎఱుపు' లేక 'అరుణ' స్త్రీలోని క్షణ క్షణం మారే సౌందర్యానికి, పసిపిల్ల అమాయకత్వానికి, స్త్రీపై మగవాడి ఆరాధనని కోరికని చూపించే మగవాడి కళ్ళల్లోని జీరకి ఎన్నడూ చెరగని సంకేతం అన్న భావాన్ని ధ్వనింపజేస్తూ చలం యిలా అంటాడు:

"కాని అరుణ చచ్చిపోలేదు. నాకు తెలుసు. యింకా మబ్బులో, చిన్నబిడ్డల లేత మడిమలమీద, కందిన ప్రియురాలి పెదిమలమీద, రోజాపువ్వు రేకల్లో, పద్మాల నడుమ, తాగిన మా కళ్ళకొలుకుల్లో ఎరుపు జీరలు నశించలేదు"

అలాగే అరుణ యే ఆధ్యాత్మిక అనుభవాన్ని అన్వేషిస్తూ అదృశ్యమైందో— తనకికూడా ఆ అరుణే యే ఆశ్రమానికో, యే స్వర్గానికో దారి చూపిస్తుందని సూచిస్తూ ఇలా అంటాడు చలం :

"జీవితంలో ఈ దేహానికి, నా శృంగార భావాలకి యెట్లా స్వర్గ ద్వారాలు తెరచిందో, అట్లాగే నా ఆత్మకీ, నా ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో, ఏ ఆశ్రమం నుంచో స్వర్గద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం"

1920లో రాయబడిన 'అరుణ'లోని ఈ నమ్మకం, 20 యేళ్ళ తర్వాత చలం జీవితంలో నిజమైంది. రమణాశ్రమం చలంలోని ఆధ్యాత్మిక అన్వేషణకి స్వర్గద్వారాలు తెరచింది.

చలం వ్యక్తిత్వంలోని ప్రతి అంశాన్ని గొప్పగా చూపించిన రచన 'అరుణ.' ఆయనకు స్త్రీలో కన్పించిన దైవత్వంతో సమానమైన ఔన్నత్యం, శృంగార జీవనంపై ఆయన మోజు, కృత్రిమ విలువలతో నిండిన సమాజంపై ఆయన ఏవగింపు, చివరకు భౌతిక విలువలకు అతీతమైన 'శాంతిని' సాధించాలనే ఆయన తహతహ— అన్నీ ఈ నవలలో కన్పిస్తాయి.

ఇలా చలం తాత్త్విక చింతనలోని నాలుగు ముఖ్యాంశాలని ఈ నాలుగు నవలలు ప్రదర్శిస్తాయి. స్త్రీ స్వాతంత్రియాన్ని 'దైవమిచ్చిన భార్య', లైంగిక స్వాతంత్రియాన్ని 'మైదానం', లౌకిక విలువలకి అతీతమైన ఆధ్యాత్మికత కోసం అన్వేషణ 'అమీనా', స్త్రీత్వంలోని దైవత్వం 'అరుణ' చూపిస్తాయి.

# కవి – చలం

—వేగుంట మోహన ప్రసాద్

Know then when all words are said
And a man is fighting mad,
Something drops from eyes long blind
He completes his partial mind.

Yeats- Collected Poems.

"నా జీవితంలో నిరంతరం నిన్ను పాటలతో వెతికాను. అవే నన్ను ద్వారం నించి ద్వారానికి తిప్పాయి. వాటి సహాయంతోనే ఈ ప్రపంచాన్ని వెతుకుతో స్పృశిస్తో ఇటూ అటూ తోవ తడుముకుంటూ తిరిగాను."

ఏట్స్ అలా తన మనసుని పరిపూర్ణం చేసుకున్నాడు. టాగోర్ అలా పాడుకుంటూ పోయాడు. మరి చెలం పాట! "చెలం, నీ పాట—యెడతెగని నిరాశ చీకట్లో వాకిలి కానరాక శోక భారంతో అరిచే శాపోహత భకుకి భీతావహ తాపం" (రహ్మాన్). తాను చెప్పాల్సిందంతా చెప్పాడు. ముప్పయ్యేళ్ళ నమ్మకాల్ని తోసివేసి ఇరవై యేళ్ళ నించీ కొత్త నమ్మకాల్ని విశ్వసిస్తూ. ఈనాటి చలంలో ఆనాటి చలం లేకపోయినా ఆనాటి చలంలో యీనాటి చలం ఉన్నారన్నారు సంజీవదేవ్. అయితే చలానికి యింకా సమగ్ర సమన్వయం దొరకలేదు. (Synaethesis). అంతకంటె కొంచెం తక్కువైన empathy (అన్వయం, ఐక్యత) తోనే ఉన్నాడు. అతని కవితలో శబ్దంలేని తంత్రుల గానం పొంగుతూ ఉంటుంది. ఆ అంతులేని అగాధం పక్కన నుంచుని నవ్వుతూ ఉంటాడు. జుట్టు పీక్కుని ఏడుస్తూ ఉంటాడు. అతని కవితాత్మ నివేదన వియోగమైనా సంయోగమైనా, దైహికమైనా దైవికమైనా, పాడుబడిన దేవాలయంలో ఒకబీద పూజారి వెలిగించిన ఒకే ఒక దీపం గుడ్డివెల్తురులా అతని కవితలోయింకా విరహం తొంగిచూస్తుంది. అతని కవిత్వం సంగీతంకాదు. శబ్దంలేని తెగిపడ్డ తంత్రుల వేదన. రూపం లేని మహా ప్రేమాకారం. మరి కవిత్వంలో

ఛందస్సు లేకపోయినా, అలంకారాలు లోపించినా కనీసం మాటలుండాలిగా. ఆమాటలు సహజ సిద్ధాలవుతయ్. వాటంతట వాటికే ఒక తూగు, లయ విరుపుఉంటాయి. కారణం సరాసరి అవి హృదయంలోంచి హృదయంలోకి దూసుకు పోతయ్. అన్నీ వదిలి పెట్టిన (కవిత్వంలో) చలం ప్రతీకలని మాత్రం తప్పక వాడాడు. బుద్ధిభావం వల్ల ఆప్రతీకలు ముందుగా ఊహించినవి కావు. ఎంతో సహజంగ. ఉ ప మా లం కా రం అంత స్వచ్ఛందంగ వచ్చినవి. మలార్మే అన్నమాటలు చలానికికూడ అన్వయించుకోవచ్చును. "Poetry is the expression by means of human language restored to its essential rhythm of the mysterious sense of the objects of existence, it endows our sojourn with authenticity and constitutes the soul spiritual task." ఈశ్వరుడు, స్త్రీ—యీ రెండు ఆలోచనలు చలాన్ని బాధించినయ్. దాదాపు విపక్షుడ్ని చేసినయ్. వేమనలో వలెనే చలంలోకూడ ప్రాకృతిక సత్య సందర్శనం కన్పిస్తుంది. ఇద్దరూ సంస్కర్తలే. గూఢ వ్యంగ్య ధోరణిలో రాసినవారే. అయితే చలంలో అనంతమైన వేదన ఉన్నది. వేమనలో సాంఘిక దర్శనం, సామాజిక ఆశంసనఉన్నవి. చలం ఏనాడూ సమష్టిని గుర్తించలేదు. నవలలోకూడ, వ్యక్తినే ఆరాధించాడు. రొమాంటిక్‌గానూ అధ్యాత్మికంగానూ అతనికి ఏకాకి అయిన నిస్సహాయదీన మానవుడే కన్పించాడు.

అందుకే అతని అనుభూతి అంత లోతు. లోతయినది అతని కవిత్వంకాదు. శైలి కాదు_ అనుభూతి "నీకు తోచనిదీ, కనబడనిదీ, కవి చెప్పిన తర్వాత నీ అనుభవంలోకి ఎంతో కొంత వొచ్చేదీ_అదే నీకు సరిపడే కవిత. గొప్ప కవిత్వ సృష్టిగాని, అనుభవంగాని మనసు వెనుక ఎంతో లోతున వుంటే Sublime or supernal plane లో జరుగుతుంది" అంటాడు.

చలం కవిత చదువుతున్నప్పుడు (యశోదాగీతాలు) అతి ప్రాకృతికమైన ఆత్మను చేతితో ముట్టుకున్నట్లు అనుభూతి చెందుతాం. అందుకే అతని గీతాలు తాళ్ళపాక అన్నమాచార్యులు రాసిన విన్నపాల్లా ఉంటాయి. కవిత్వంకోసం, కవితా రూపంకోసం చలం ఎన్నడూ ఏ కవితా రాయలేదు. వాటి అంతట అవే పెల్లుబికి వచ్చినయ్. వజీర్ రహ్మాన్ అతని కవితను (పారాగ్రాఫుల్ని) పంక్తులుగా కూర్చాడంతే.

వచన కవిత్వానికి రూపంలేదు. నైరూప్య చిత్రాల్లాగా ఒట్టి తంత్రులు లేని శబ్దం లాగా ఉంటుందంతే. నైరూప్య చిత్రమూ రూపమేగదా మరి!

చలం బ్రహ్మసమాజంలో చేరి బాస్తో తగాదా పడినప్పుడు గావును భజన గీతాలు రాశాడు. చిడతలు పుచ్చుకుని యింటింటికీ తిరిగి పాడాడు వాటిని. అవి చదివితే

ఆనాటి ప్రార్థనలే యీనాడూ చేస్తున్నాడనిపిస్తుంది. భజనగీతాలు రాసినా, మండిపోయే కామాన్ని నవలల్లో, కథల్లో చూపించినా ఏమి రాసినా అతనిలోని ప్రథమ జీవి సంస్కర్త అన్వేషి. ఆత్మసంస్కారి. ఆత్మాన్వేషి. సృజనాత్మక సాహిత్యమంతా అతను చెప్పదలచుకొన్నదానికి,ఏట్స్ అన్నట్లు పిచ్చెక్కిపోయేదాక చెప్పదలచుకున్నదానికి యత్నాన్ని దాచలేని చిరుగుజాకెట్లు. అతనిలో మిగిలేది కవిత్వం. శైలికాదు. అనుభూతిపరమైన కవిత్వం. వచనాన్ని కవితాస్థాయికి పెంచిన తొలి తెలుగు రచయిత చలం. చలానికి ఛందస్సే వచ్చి ఉంటే — యీ వియోగపు శక్తీ, మనస్సముద్రపు హోరు, వ్యర్థ ప్రేమ, నిష్ఠురహాసం, యుగాల ఆవలితీరాల ఆశలు, ఎండమావుల అలసత్వం, మూసిన తలుపుని వానగాలి దబదబా బాదటం — యిట్లాంటి చిత్రాల్ని చూపించగలిగే వాడే కాడు.

చలానికి టాగోర్ అంటే ఎప్పట్నించి యిష్టమో, ఆఖరికి కృష్ణశాస్త్రిని కూడ ఎందుకని కాదనలేకపోయాడో, నండూరిచేత ఎంకిపాటలు రాయించటానికి ఎలా కారకుడయ్యాడో, మహాప్రస్థానానికి యోగ్యతాపత్రం రాసే యోగ్యత అతనికే ఎలా కలిగిందో యివన్నీ యీనాటి విషయాలు కాక ఎప్పటి సంగతులో గుర్తుంచుకుంటే తెలుస్తుంది, ఎన్నాళ్ళనించి దాక్కొన్నాడో చలంలో ఒక గొప్ప వచనకవి! వచనానికి వాక్యనిర్మాణం, కవిత్వానికి భావ నిర్మాణం ప్రమాణాలు. అవి యూనిట్స్. చలం వచనం వచనం కాదు. వాక్యాలు వాక్యాలు కావు. అన్నిటిలోనూ Syntactical breathlessness అనే గుణం ఒకటి కన్పిస్తుంది. ఊపిరాడని వాక్య విన్యాసం, భావస్ఫోరకత. అతని పదాలూ శబ్దాలూ వ్యంగ్యాలు. వ్యావహారిక భాషని కవితాత్మలో చొప్పించింది శ్రీ శ్రీ కాదు, చలం — గురజాడ తర్వాత.

చలం కవులతో సంబంధం పెట్టుకోడు. కవిత్వం చదవడు ఆట్టే. ఛందస్సు చస్తే సాధన చెయ్యడు. అలంకారాలు పెట్టడు. అంచేత హృదయంలోంచి దూసుకొస్తాయతని గీతాలు కాగితమ్మీదికి. చెట్లకు ఆకులు ఎంత సహజంగా వస్తాయో కవిత్వం కూడా అంత సహజంగా రాకపోతే అలాటి కవిత రాకపోవటమే మేలన్నాడు కీట్సు.

కవిత్వంలో అతని వ్యక్తిత్వం సంఘ సంస్కరణ కాదు. ఆత్మ సంఘర్షణ. అవును. ఏ శ్రీశ్రీ నయితే తానంతగ మెచ్చుకున్నాడో, ఏ నండూరిచేత అలాంటి పాటలు రాయించాడో అలాంటి కవిత్వంలతనెన్నడూ రాయటానికై నా ప్రయత్నించలేదు. పూర్వపు భావ కవులలో ఎవడైనా ఛందస్సు తెలీని వాడుంటే వాడు చలంగా మిగిలిపోయేదేమోననిపిస్తుంది. కృష్ణశాస్త్రి రాసిన భక్తి గీతాలు గానయోగ్యములైతే చలం గీతాలు మనన యోగ్యమైనట్టివి. కవి కానివాడిలోంచి కవిత్వం వచ్చింది ఒక్క చలంలోనే.

వచన కవిత్వం మాట దేవుడెరుగును. కవిత్వం జోలికేపోలేదు చలం. కాని తెలుగులో వచన కవిత్వానికి అద్యుడయ్యాడు చలం. బుచ్చిబాబు వచనంలో, వర్ణనలలో ఒలికే పిచ్చి అందం, రహ్మాన్ కవితలో పాకుడు రాళ్ళలోతూ ఎవరి ప్రభావంవల్ల వచ్చినదీ చలంకాక ; ఎందరు చేతుః కాల్చుకోలేదు అతనిలాగ రాయాలని ? కొన్ని వ్యావహారికాలు చలానికి యిష్టం. (ప్రచురణ కర్తల చెయ్యో ఏమోగాని, కొన్ని ఇంగ్లీషు పదాలకి స్పెల్లింగులు సుద్ద తప్పులు రాస్తాడు చలం). ఏదైనా ఒకానొక పద స్వరూపం సరిగ్గా తెలిసినా దాన్ని మార్పుచేసిరాస్తాడు. అంటే స్పెల్లింగ్‌నే మార్చు కుంటాడన్నమాట. ముఖ్యం దుఃఖం అనే మాట. ఎక్కిళ్లు, వొళ్లు, అర్థరాత్రుళ్లు, తెల్లారకట్ట, అలిసి,— యిట్లాంటి పదాలు చలం కవిత్వంలో గరుగ్గా తగులుతూ ఒక కొత్త శోభను సంతరించుకుంటై. బాధే కవిత్వానికి పర్యాయపదం అన్న సూక్తితో చలం ఏకీభవిస్తాడు. అతనిదే అయిన అతని వేదన ప్రపంచంలో మారుమోగి ప్రపంచపు ఆత్మీయ వేదన అయింది. బాధని గుర్తించిన మొదటి కవి చలం. చలం బాధ ప్రపంచం బాధే ; అతని కవితలో వైషయికతకు బదులు మనకు కనిపించేవి జాలి, కరుణాకాతరత, దుఃఖోన్మాదం. జీవుని అంతరైచ్తన్యం. ప్రేయసికి విన్నవించుకున్నా, యశోద మాతృప్రేమలో కరగిపోయినా, రమణ మహర్షి సమాధి మ్రోల తలబెట్టినా ఒకటే ఆత్మ సమర్పణ. ఈ సమర్పణకోసం అతని వచన కవిత చాల బలాన్ని పుంజుకోవాల్సి వచ్చింది. ఆ బలాన్ని నిఘంటువులోంచి కాక హృదయంలోంచి గ్రహించింది. చలం కవితలో భాషనీ భావాన్నీ బాలన్స్ చేసే గుణం ఒకటి ఉన్నది. దీన్నే పార్థక్య గుణం అన్నారు సంజీవదేవ్.

"యామినీ శిరోజ దీప్త జ్వాలా కుసుమాలు"

"రవి కిరణాంగుళీ నఖక్షతాలతో"

"నీ ధమ్మిల్లతమో మర్మంలో"

"నీ నిద్రావ గహిత మానసాన్ని"

"వినీల సముద్ర తరంగ ప్రక్ష్యాళిత ద్వీపాంచలాల"

"అరణ్య పార్శ్వ పుష్పశోభిత శాద్వలం"

"భీకరమృత్యువ్యాళ అంధకార కంఠబిలంలోకి"

"బాల సూర్యప్రభా చర్చిత ధరణీతల సౌకుమార్యం"

"ప్రౌఢ సవిత్రాలింగనోష్ణ తీవ్రత"

"అరుణ పల్లవాధర చంచత్‌స్మేర పరిమళితమకరందపానం"

మొదలైన సమాసాల్ని అతిమామూలు మాటల్తో వెంటనే అతికించటం. ఇలా ఒక సమాసం వ్యావహారికంలో అంతమవటం చెట్టుకొమ్మ మంచి బలమైన గాలికి ఊగి పూలు రాల్చినంత సహజంగ జరిగిపోతుంది. ఇక అతని అతిమామూలు మాటలు:

వొదలు — రా — అరుస్తో — తలుపుతీ — ఐ (అయి) తీమంటూంటే — మేలుకో — కళ్ళుతెరు — వొంటరిగా — ఎవరదీ — తరవాత — మల్లె — రొంపిలోకి — సరుకు — గింజుకు చావు — బతుకు — యోగశ్వాస — దేవుళ్ళాడు — కలుకు విధి — ప్రార్థనలూ కన్నీళ్లూ — క్షోభ — చాతకాదని — ఇట్లాంటివి సహస్రానేకం.

బెంగాలీ విరహగీతాలు భాషతెలీకపోయినా వింటుంటే కలిగే శాబ్దికమైన అనుభూతి చలం గీతాలలో కనిపిస్తుంది తిరిగి. All art constantly aspires to the condition of music అన్న Walter Pater subject నీ, matter నీ form నీ situation నీ ఒదిలేసినప్పటికీ, నిజమే కళ చెవినీ కంటినీ తాకి హృదయాన్ని తాకుతుంది గాబోలని పిస్తుంది. టాగోర్ అన్నా అతని కవిత్వమన్నా చలం సర్వాత్మనా లయమై పోయాడు కనుకనే ఆ సంస్కృత సమాసాలకు తెలుగు పొడిమాటలు అతికించినా మధురంగా ఉన్నై.

ఇదంతా భాష సంగతి. ఇక భావావేశం. చలం వివశుడు. అతని వివశాత్మకి కాల్పనికవాదుల గొప్ప దుఃఖావేశం ఉన్నది. ఆ ఉద్వేగంలో అది ఏ కవితా సంప్రదాయంలోనూ, రీతిలోనూ ఉద్యమంలోనూ, విప్లవంలోనూ యిమడదు. చలం కవితలో వ్యక్తులు కనపడరు. కధల్లో, నవలల్లోలాగ. కేవలం వ్యక్తిత్వాలు కన్పిస్తయ్ అతని కవితలో. 'నీకోసం', 'నీరూపు', 'నువ్వూ—నేనూ', 'ప్రేమలేఖ' అనే గీతాలు రాసినా వాటిలోని బాహ్యరూపాలన్నీ అంతర్ ప్రవృత్తులయి లోకంలో రసహృదయాలలో స్నిగ్ధంగ స్థిరపడిపోతయ్. టాగోర్ జీవన దేవత సిద్ధాంతం లాంటిది చలం విరహిణి. ఏదైనా ఒక వస్తువు తనంతతాను ఎవరైనా ఒక స్వీకర్తకి పరిపూర్ణంగ అర్పణ చేసుకుని అక్కడ్నించే అతని జీవితాన్ని, జీవన వేదననీ పరిపాలించటం జీవనదేవత చేసే పని. దాన్నే రూలింగ్ పాషన్ అంటాం.

చలం వచన కవిత్వం నిడివి ఒక్కోసారి రెండు పంక్తులే. ఒక పొట్టి నిట్టూర్పులాగ. కప్లెట్‌లాగ. కవిత్వం అతని శ్వాస. ఆ శ్వాసలో తీవ్రత ఉన్నది. కరుణ ఉన్నది. అతని నిశ్వాసంలో విశ్వాసం ఉన్నది. ఎక్కడా నంగినంగిగా పదాలు అల్లడు. అంతబలమే ఆ కవిత్వానికి లేకపోతే అతని సౌందర్యారాధన ఫలించదు. కాంతి విచ్చుకోదు. తపస్సు జ్వలించదు. చీకటి చిరగదు. ఆ ద్వారాలు కొద్దిగానైనా కదలవు.

నా మట్టుకు నాకు చలం తెలుగు గీతాంజలి టాగోర్ సొంత ఆంగ్లం కంటే బావున్నది. చలం తన హృదయంలో వెలిగిన గీతాన్నీ దీపాన్నీ కాగితమ్మీద పెట్టాడు. అసలు అనువాదమే చేయలేదు. అనునాదం అది. వచన కవితకి ఆత్మశక్తి అంటూ ఏర్పడింది చలం ద్వారానే అతనే అంటాడు—"నాకు కవిత్వం చేతకాదు. ఏమీ పలకదు. ఆ ఛందస్సు ఇరుకు...నేను చెప్ప తలచుకునేది చెప్పటానికని అన్ని భాషా నియమాల్నీ తెంపులు చేసుకున్న నేను ఛందస్సులోకీ ఓ నడకలోకీ యిమడగలనా ?". తనలోంచి పలికే ఒక్క అంతర్లయ తప్ప యింకేమీ అక్కర్లేని వచనకవి చలం. వచన కవిత్వానికి యింకేమీ అక్కర్లేదు ! చదవండి భగవాన్ పాదాల ముందు.

ఒకటి మాత్రం చేసాడు. చెయ్యక తప్పలేదు. ప్రతీకలని వాడటం, అంతరార్థాన్ని ధ్వనింప జేయటం, ఆధ్యాత్మికానుభవానికి భౌతికమైన గుర్తుల్ని చూపటం— ఇవి చెయ్యక తప్పలేదు.

"నీ సమక్షానికి నగ్నంగా రమ్మని నీ ఆజ్ఞా, ఎంత కఠినుడివి ?"

"బిగిసిందా తలుపు ?

నీకూ రావా ?"

"వాళ్ళ నిజంకన్నా, నా కృష్ణుడి అబద్ధమే నాకెక్కువ నిజం అనిపిస్తుంది."

"నువ్వు బుద్ధుడివా ?

నలుడివేమో ?"

అని యింకా యిట్లా ఎన్నో !

రవీంద్ర సంగీతం విన్నపుడూ, జిబ్రాన్ కవిత చదివినపుడూ, చలం వచన కవిత మననం చేసుకొన్నప్పుడూ మనలో ఒక అగ్నిలాంటి స్వేచ్ఛ రాజుకొంటుంది. పూర్వపు యిరుకు సంప్రదాయాలనీ పురాణ పుస్తకాలనీ ఆర్ష (?) ధర్మాల్నీ ఆ స్వేచ్ఛా భావంతో కాల్చివేసే శక్తి ఏర్పడుతుంది. ఏ కవిత్వంలో అయితే గాఢమైన ఆవేదన ఉంటుందో ఆ కవిత్వం కవిత్వపు రూపాలని ప్రాకారాలనీ దాటిపోతుంది. చలం విషయంలో అలాగే జరిగింది. వచన కవిత్వం మాట దేవుడెరుగు. చలం కవిత్వం సంగతే (కవిత్వం కోసం) పట్టించుకోడు.

# చలం : పురూరవ

—సంపత్కుమార

స్వతంత్ర వ్యక్తిత్వమూ, తాను సత్యమని నమ్మిన దానిని ఖచ్చితంగా చెప్పగల నిర్భీకతా,1 అనవరత సత్యాన్వేషణమూ కల దేశంలోని ద్విత్రిసంఖ్యాకమైన రచయితలలో ఒకడయిన 'చలం' వ్రాసిన నాటకం ఈ 'పురూరవ'. 'కవిత్వమొకతీరని దాహం' అన్నట్లుగా తీరని కళాదాహంతో అవిరళంగా వచన సాహిత్యంలో నైకరీతుఃను, అనిదం పూర్వధోరణిలో ఉద్ధృతంగా ప్రవేశపెట్టి విస్తృతమైన తన సాహిత్యాన్ని దేశానికి సమర్పించినాడు చలం. అతని రచనలలో అమితమైన శక్తి ఉన్నది. ఆశక్తి అభ్యాస పాటవం వల్ల రచనలలో సంక్రమించిందికాదు 2 వాస్తవం చెప్పడంవల్ల సంక్రమించింది. సదుద్దేశ్యంతో ప్రవేశ పెట్టబడిన వివిధ సాంఘిక నిబంధనలూ, ఆచారాలూ, కృత్రిమములయి, భేషజములయి, కపట నిలయాలయినప్పుడు వాని మీద ధ్వజమెత్తిన చలం పొందినంత దూషణ దేశంలో మరెవరికీ

1. 'సత్యమనేది ఉండనీ, ఉండకపోనీ, నేను ఏనాటికి ఏది సత్యమనుకున్నానో దాన్ని అనుష్ఠించకుండా నిలువలేను. ఏది సత్యం? ఏది ధర్మం? అని యోచించకుండానూ నా మనసును కట్టుకోనూ లేను.' (మ్యూజింగ్స్ భా. 3, పే. 230) అంటాడు చలం.

2. నేను వ్రాసేది సరికానీ, కాకపోనీ, నా వ్రాతకి శైలినీ, బలాన్నీ ఇచ్చేది వాస్తవత్వం...నన్ను వేరుగా, నా పద్ధతుల్ని వేరుగా, నేను వ్రాసే విషయాన్ని వేరుగా చూడడం పొరబాటు. నేను నమ్మిన వాటినే వ్రాసాను. వ్రాసిన వాటినే ఆచరించాను....... తప్పైతే వ్రాతలు, పద్ధతులూ, నేను అన్నీ తప్పే. (మ్యూజింగ్స్. భా. 2 పే. 59).

లభ్యం కాలేదంటే, అతిశయోక్తికాదు. ప్రేమ, శృంగారాల నాలంబనంగా తీసికొని, వాని చుట్టూ పెరిగిన, వైరితలలు వేసిన చెడు మొక్కలను పెరికివేసే యత్నం చేసిన చలం దేశానికి, అర్థం కాలేదనే చెప్పవలసియుంటుంది. చలం ఇంద్రియోత్తేజ కరమైన అతి తక్కువరకపు రచనలు చేసి కీర్తి సంపాదించాడని దేశం అతన్ని నిందించింది. అతడు చెప్పిన విషయాలు, అతని రచనల్లో పొందిన క్రమవికాసాన్ని చూస్తే అతని తత్వం సంపూర్ణంగా అర్థమవుతుంది.

అతని అన్వేషణలో ప్రేమ—ఈశ్వరుడు సమానం. ఈ ప్రేమ అనేది చాలా సున్నితమైన విషయం. దీన్ని నిర్వహించడమనేది అతికష్టమైనపని. ఎందుకంటె ప్రేమ అనగానే దాన్నంటుకొని శృంగారమూ, దాన్ననుసరించి కామము, ఇవ్వన్నీ అనుకోకుండానే ఊహకు స్ఫురించడం జరుగుతుంది. కామమనగానే నీచప్రక్రియగా వాచ్యంలో నిర్ధారిత మవుతున్నది. అయితే స్త్రీ విషయికమైన ప్రేమ రతితోనే ఆఖరవు తుందనేది అసంబద్ధం. కాని అది దానికి అంగభూతము మాత్రమే అవుతున్నది తప్ప అదే శేఖరీ భూతం కావడంలేదు.[3] దీనిని మించిన ప్రేమ ఉన్నది అది త్వరగా అర్థంకానిది. అయితే ఈ ప్రేమకు అవధుల్లేవనేది ప్రతివారూ ఒప్పుకొనే విషయమే. దీనికి నియమాలుండవు. అది ప్రసరించవలసిన, ప్రసరించరాని స్థలాలని గిరిగీయడానికి వీలులేదు. మనోదార్ఢ్యం దీనికి ముఖ్యమయింది. అప్పుడే ఇది నిర్వ్యాజమవుతుంది.[4] సవ్యాజ ప్రేమకన్న నిర్వ్యాజ ప్రేమ అత్యంతమూ ఉపాధేయ మయినది. ప్రేమించ లేనివాడు 'ఎదుగ' లేదు. ఎవడు మానసికంగా ఎదుగలేడో వాడు ద్విపాత్తు మాత్రమే ఇత్యాది విషయాలే చలం యొక్క ప్రేమ తత్వానికి మూలభూతాలయినవి. వీటిని వ్యక్తీకరించడం కోసమే చలం సాహిత్య సృష్టిఅంతా. ఆ సృష్టి యొక్క పతాకాఘంటికే 'పురూరవ'.

---

3. "—.అనంతంగా నా జీవితంలో ప్రతి నిమిషం ప్రేమించమని అడగడంలేదు. అది అత్యాశ... పోనీలే. ఒక స్త్రీ నన్ను జీవితమంతా ప్రేమించాలంటే, అది కష్టం. అది పోనీ, ఒకే యువతి అక్కరలేదు. కాని ఎవరో ఒకరు. ఎవరో అమ్మాయి, అబ్బాయి, దిక్కులేని కుక్కపిల్ల, ఏదో మృగం— నన్ను చూసి తోకాడించే కుక్క, నేను తాకితే సంతోషపడేది, తన కళ్ళల్లో ఆత్మ పెట్టుకుని నన్ను చూచేది, నా వెంట రాకుండా నిలువలేనిది, అది కావాలి నాకు——" రామ్మూర్తి ఉత్తరం. (మ్యూజింగ్స్ భా. 2 పే. 23).

4. 'దళముగ గుండె వ్యాజరహితంబగు ప్రేమనే కోరుచుండు,
నిశ్చలమతి సీతయున్ శ్రమణి సాగెదరాగతి—'

(రామాయణ కల్పవృక్షం – సుందర)

చలం తన రచనలలో పూర్వగాథల్ని స్వీకరించి, స్వదృక్పథంతో వాటికి కొత్త రూపాలను తొడిగినాడు. పూర్వగాథలకీ దృగ్విదమయిన వ్యాఖ్యానం అనూచానంగా ఉన్నదే. సామాన్యంగా సాహిత్య సృష్టి అంతా తత్ప్రచయితల ప్రాపంచిక, సాంఘిక, ఆధ్యాత్మిక దృష్టినిబట్టే ఉంటుందిగాని అన్యథా ఉండదు. దీనికి ఉదాహరణగ 'పురాణ' సాహిత్యాన్ని తీసికోవచ్చును. నాలుగయిదు పురాణాలలో ఒకే గాథ వివిధ రూపాలను స్వీకరించి ఉండడం జరుగుతున్నది. కాళిదాసు, భారతంలో అనుదాత్త నాయకుడుగా ఉన్నాడనుకొనబడుతున్న దుష్యంతుని యొక్క గాథను 'అభిజ్ఞాన శాకుంతలం'గా వినూత్నీకరించినాడు. కీచక పాత్రయందు, భారతంలోని కుత్సితత్వం విశ్వనాథవారి నర్తనశాలలో ఉదాత్త స్వరూప పరిప్లుతమయింది. చలం కూడా ఇదే పద్ధతిలో భానుమతి, చిత్రాంగి, సావిత్రి, జయదేవ, శశాంక, పురూరవల్ని వ్రాసినాడు. చలం భావౌన్నత్యం క్రమక్రమ ప్రవర్ధితస్థాయి నందుకుంటూ పురూరవలో పరిపక్వస్థితి నందడం మనం గమనించవచ్చు.

వీటన్నిటిలో వక్తవ్యం ఒకటే అయినా, వివిధ దృక్కోణాల్లో వ్యవస్థితమయి పురూరవలో ముళ్లువేసికొన్నది. ప్రేమకు క్షమ ముఖ్యమయినది. ఇక్కడ ఒకటి స్మర్తవ్యమున్నది. తన పుత్రశత నాశానికి కారణమయి, అనేకమైన ఇతర బాధల్ని కల్పించిన విశ్వామిత్రుని ఎడ వశిష్ఠుడు క్షమాగుణం నెరపి, అతనికే— ఆ బద్ధశత్రువు వంటి వానికే బ్రహ్మర్షిత్వం ప్రసాదించినందుకు అతడు కీర్తితుడయినాడు. ఆ క్షమా గుణాన్నే మణికరూపంలో బృహస్పతియందు 'శశాంక'లో— ప్రేమవల్ల తన భార్య తార, తన శిష్యుడు శశాంకుడు ఏకీతులయినప్పుడు. దండించకుండా క్షమ నెరపినట్టు చలం చెప్పితే అది దూష్యమయింది. గుణప్రాధాన్యమున్న యీ విషయంలో స్వనిర్ధారిత పూర్వవిషయ వైరుధ్యం స్ఫురించినందుకుగాను చలం దూష్యుడయినాడు. ఇది ఆలోచనా పద్ధతిలోని లోపం. వశిష్ఠుని క్షమాగుణ ప్రతిపాదనకు మించిన సౌజన్యం బృహస్పతిలోని క్షమాగుణానికుండడం అసహ్యాకారణమవుతున్నదా? కావచ్చు— ఈ విధంగానే ఆయా నాటకాలలో ప్రేమయొక్క వ్యక్తిత్వం ఇతర బంధ నిరాసక రూపంలో చిత్రితమయింది.

ప్రస్తుతం పురూరవ నాటకం —

ఆధునికంగా వచ్చిన నాటకాలన్నీ దృశ్యాలు కావాలనే ఉద్దేశ్యంతోనే వ్రాయబడ్డా, కొన్ని రంగాని కనువుగా ఉండడంలేదు, కొన్నింటికి రంగమే అనువుగా ఉండడంలేదు. రంగస్థలపు కూర్పుల్లో నేర్పు ఇంకెంతో దేశంలో రావలసి ఉన్నది. అయితే రంగస్థలానికి ఆ అభివృద్ధి వచ్చినా, ఈ పురూరవ ప్రదర్శించడానికివీలుకానిది.

అదీకాక, దీనిలో కథకు ప్రాధాన్యం లేకుండా [5] తత్వప్రాధాన్యం ఉండడంవల్లా, ఆద్యంతమూ చార్చికంగా నడవడంవల్లా అది ప్రేక్షకులకందుబాటులో ఉండదు. చలంచెప్పిన పరిసరాల్ని ఊహించుకొని శ్రవ్య కావ్య రూపంలో చదువుకోవడంలోనే పాఠకు డానందాన్ని పొందుతాడు. చలం దీన్ని 'నాటకం' అన్నాడుగదా అని దీనిలో నాటక లక్షణాలను వెదకితే అవి మృగ్యం. చలంయొక్క [6] ఇతర నాటకాలవంటిది కాదిది. నాటకాల్లో వాచికానికీ, ఆంగికానికే ప్రాధాన్యం ఉంటుంది. మనో భావాలని ఆంగికమయిన నటన ద్వారానే వ్యక్తంచేయాలి. ఆ వ్యక్తం చేయబడింది వాచికం ద్వారానే శ్రవ్యం కావలసి ఉంటుంది. కాని రచయిత మధ్యలో కల్పించుకుని విపులీకరించడం నాటక రచనా పద్ధతికి విరుద్ధం. ఉదాహరణకి ఊర్వశీ పురూరవుల ప్రథమ సమాగమ ఘట్టంలో ఒక విషయం —

పురూరవుడు : ఎందుకు వొచ్చావు ?

ఊర్వశి : నీకోసం.

యిక్కడ రచయిత చటుక్కున కల్పించుకుని 'పురూరవుడు ఏమంటాడు ? ఊర్వశి — దేవత... లోక పరత్వంలో, రాజకీయాల్లో ఆరితేరిన పురూరవుడికి ఆమెలోని సత్యం, సహజత్వం ఎలా అర్థమవుతాయి ?... కొంత సత్యాన్వేషణ చేసిన మనిషిగనక, అతని శృంగారజ్ఞానం ఆమెని నిరాకరించలేక పెనుగులాడుతోంది అంటాడు. ఈ దృశమయిన వివరణ నాటక రచనా పద్ధతికివిరుద్ధం. అక్కడ రంగం మీద నటకు దేభావం అనుకరించాలో అదే సంగ్రహంగా చెప్పవలసి ఉంటుందిగాని ఈ దృక్ వ్యాఖ్యానం ఉండగూడదు. కాబట్టి ఈ 'పురూరవను' 'సంభాషణా శ్రవ్య కావ్యం' అనడం ఉత్తమ పద్ధతి అవుతుంది. దీనిలో కాలైక్యత లేదు. రంగైక్యత కూడా తక్కువే. ఈ కాలైక్యత లేకపోవడం నాటకాన్ని పెద్ద దెబ్బ తీస్తుంది కాని తీసుకున్న గాధనుబట్టి, నిరూపించదలచిన విషయాన్నిబట్టీ ఆ కాలైక్యత కుదరలేదు. కాబట్టి అది తప్పనిసరి అయింది. ఈ నాటకం (నాటకమనే, దీన్ని వ్యవహరించడం ప్రస్తుతం జరుగుతుంది) రెండేరెండు పాత్రలతో ఆద్యంతమూ నడుస్తుంది. ఇంతే అయినా చదవటంలోని ఔత్సుక్యమూ, ఆనందమూ ఏమాత్రం లుప్తిని పొందవు. రచయితయొక్క అస్పష్టములూ, దీర్ఘములున్నూ అయిన మధ్యేపతిత వ్యాఖ్యానాలూ పాఠకుణ్ణి త్వరత్వరగా ముందుకు నడిపింప చేస్తాయి.

---

5 'ప్రబోధ చంద్రోదయం' ఇత్యాదులలో తత్వానికీ కథకూ సమానంగా ప్రాతినిధ్యం ఉందికాబట్టి అవి ప్రదర్శించబడుతున్నవి.

6 త్యాగం, చిత్రాంగి, భానుమతి, మొదలయినవి కొన్ని రంగస్థలానికి అనువయిన నాటకాలూ, నాటికలూ ఉన్నాయి.

భాషా విషయికంగా చూస్తే చాలా ఉద్ధృతంగానూ, విచిత్రంగాను ఉంటుంది. అది 'చలంమద్రి'. ఆయన ఎట్లామాట్లాడితే అట్లానే వ్రాస్తాడనిపించుతుంది. 7 నిత్యవేగినా చేతము, శబ్దమేరుటకు చిన్నము నిల్వదు భావతీవ్రతన్ "నిశిత భావఝరీ వేగవికృష్యమాణమయిన ప్రతిబుద్ధీ యింతే. అందుకనే వాక్యంకన్న ముందు భావం పరుగెత్తి, వాక్యాన్ని అస్తవ్యస్తం చేస్తుంది చలం రచనలో. ఉదాహరణకి ఊర్వశి అనే ఈ వాక్యం చూడవచ్చు.

'నీకర్థంకాదు అప్పుడే. చూడు నేనుకాక నీకేమన్నా ముఖ్యమై, నానించి ఆలోచించావా, చాలా దురదృష్ట వంతుడివి.' 8

ఈ వాక్యం :

'నీ కర్థంకాదు అప్పుడే. చూడు, నాకన్నా నీకు మరోటి ముఖ్యమై, నన్ను గూర్చిగాక, దాన్ని గూర్చి ఆలోచించావా, చాలా దురదృష్టవంతుడివన్నమాట.'

అని ఉండడంలో ఎక్కువ స్పష్టత వుంది. 'నానించి ఆలోచించావా' అంటే 'నానుండి విడిగా—నేనుగాక వేరే' అని అర్థం చెప్పుకోవలసి ఉంటుంది. దాదాపుగా ఇల్లాగే చాలాచోట్ల చూచుకోవలసి ఉంటుంది. అయితే ఇవన్నీ పాఠకుడిని, ముందుకు వెళ్ళడంలో అడ్డుపోవడమే ఒక విశేషం. దానికి కారణం చలం రచనలోని వేగం, భావంలోని తీవ్రతాన్నూ. మనస్సు దాన్ని తట్టుకుని ముందుకు సాగుతుందేకాని వీటి కోసం ఆగదు. ఆగిందా, భావతీవ్రత మందగించిందన్నమాట. అది చలంలో ఎక్కడాలేదు.

విష్ణు పురాణమూ, భాగవతమూ ననుసరించి ఊర్వశి పురూరవుడిని వదలడంలో – అంటే ఊర్వశిశాపం అంతం కావడంలోని కారణం ఒకటి ఉంది. అది ఊర్వశి పుత్రనిర్విశేషంగా ప్రేమించుకొంటున్న రెండు గొర్రెలను పురూరవుడు రక్షించాలి. ఆ రక్షణలో లోపంవస్తే ఊర్వశి పురూరవుణ్ణి విడుస్తుంది. నగ్నుడుగా పడకమీద కాకుండా – కనిపించితే విడుస్తుంది. కాళిదాసు ఈ శాపాంతాన్ని ఊర్వశికి పుత్రముఖ దర్శనంతో కలిగించినాడు. చలంమాత్రం ఈ విషయంలో కాళిదాసునుగాక పూర్వగాథలనే కొంత అనుసరించినాడని 'చెప్పవచ్చు' ననడం ఎందుకంటే ఆ రెండు నిబంధనలూ సక్రమంగా ప్రవేశపెట్టి అనుకరించలేదు కనుక.

7 విశ్వనాథ సత్యనారాయణ: రామాయణ కల్పవృక్షావతారిక.

8 పురూరవ. పే. 29.

తన గొర్రెలయందు శ్రద్ధ చూపనందుకు, తన నియమాన్ని అతిక్రమించి నందుకూ ఊర్వశి పురూరవుడిని విడుస్తుంది. అంటే తా నే విషయంలో అతన్ని నియమించిందో, అందులో అతడు ఇముడలేకపోయినాడన్నమాట. ఉత్తీర్ణుడు కాలేకపోయినాడన్నమాట. అనగా స్వాధీనమయిందేదో అతన్ని తద్విధంగా ఉల్లంఘితుడిగా చేసింది కాబట్టి, తన అప్రాముఖ్యము కనుపించగనే అతన్ని వదిలింది ఇదే చలం తన పురూరవలో నిరూపించిన విషయం. ప్రేమకి సర్వాత్మనా బాహిరంగా, ఆంతరంగా_ అతను అప్పనమిడితేనే ఆ ప్రేమకి తా నర్హుడవుతాడు. ప్రేమయందు, అహంకారమూ, మమకారమనేవేవీ ఉండడానికి వీల్లేదు. అవే ఉండినట్టయితే లోపం ప్రేమలో తప్పకుండా గోచరిస్తుంది. ఆ లోపంవల్ల ప్రేమాలంబనం చేజారిపోతుంది. చలం పురూరవుడు ఒకానొక సమయంలో స్వగతమయిన 'అహం' ఉబికి, ప్రేమకి లోపం కలుగజేయడంవల్ల ఊర్వసిని పోగొట్టుకుంటాడు. 9 ఎవడో ఊర్వశిని చంపుతాడని, తానతన్ని వధించి ఊర్వశిని రక్షించడం ధర్మమని, విధి అనీ ఆవిడ నిరాకరిస్తున్నా, నివారిస్తున్నా ఆగకుండా 'అతన్ని' చంపినాడు. ఎప్పుడయితే లౌకిక భ్రాంతిమూలకాలయిన 'అహం' 'ధర్మం' 'విధి' ప్రేమకన్న, ప్రేమాలంబనంకన్న ఎక్కువగా స్వాయత్తీకరించుకున్నాయో, ఊర్వశి అతన్ని వదిలివేసింది.

అయితే ఊర్వశి క్షమించలేదని, లేనిదనికాదు, దయాహీనఅనిగాదు. 10 ఈ చిన్న అపరాధానికి అతన్ని వదలివేయడంలో, ఆతన్ని ఉన్నతస్థాయికి చేర్చే యత్నమేతప్ప మరేమీలేదు. అందుకనే ఊర్వశి అంటుందీ: 11. దిక్కులదిరేట్టు 'ఊర్వశీ'అని ప్రశ్నలడుగు, సాధించు... నన్ను పొందగలిగిన ఔన్నత్యం ఎట్లాగో తెచ్చుకొన్నావు కొంతకాలం. అంత ఔన్నత్యాన్నీ మామూలుగా నీస్వభావానికి తెచ్చుకోగలగాలి నువ్వు. దానికొసమే ఇన్నియేళ్ళ దారుణ తపన. నమ్ము. శిక్షఅనేది సృష్టిలో లేదు _ దయతప్ప...' అని.

అంటే ఉన్నతమయిన ప్రేమానుభవం కొరకు, అలౌకిక వ్యామోహాలన్నీ త్యజించిన, వాటి నతిక్రమించిన ఔన్నత్యం పొందవలసి ఉంటుంది. లేకుంటే ప్రేమ ననుభవిస్తున్నా మనుకొనే భావం భ్రాంతిజన్య మవుతున్నదన్నమాట. అసలు లోకంలో సహజ, స్వతస్సిద్ధమైన దానివల్లకన్నా, దాని ప్రతిబింబం, లేక దానిభ్రాంతి స్వరూపంతోనే ఆనందాధిక్యం అనుభూతమవుతూ ఉండడం ప్రస్తుతం గమనీయం. అచ్ఛమయిన

---

9 పురూరవ. పే. 126, 127, 128.

10 శిక్షవల్ల లోక పారిశుద్ధ్యం ఏనాడైనా జరుగుతుందా ? (పే. 73)... ప్రేమించు సమస్త జీవుల్నీ ప్రేమించు. నీకన్న, నీ తపస్సుకన్న, నీ ఈశ్వరుడికన్న అధికంగా... ప్రేమించు. ఖండించకు, శిక్షించకు. (పే. 76 శశాంక)

11. పురూరవ. పే. 138, 140.

ఆనందం కరువయిన ఈకాలంలో 'ఆనందవల్లి'లో పేర్కొనబడిన 12 మానుషానందాన్నే మనం ఊహించుకోలేని స్థితి లో ఉండడం జరుగుతున్నది. ప్రస్తుత భ్రాంతి జన్యమైన ఆనందమే 'అది' అని అనుకున్నట్లయితే తదానందవల్లీ కర్తలు చెప్పదలచు కొని చెప్పలేకపోయిన పరబ్రహ్మానందం ఈనాడు ఉన్నత ధనవంతు లనుభవించే లాలసా సుఖం అని చెప్పటంలో ఏమీ సందేహించనవసరం ఉండదు. ఆనందం అనేది బాహ్యవస్తు గుణాశ్రిత మయిందికాదు. ఆంతరిక భావాశ్రితమయింది. ఆనందం 13 వస్తుగుణాశ్రితమే అయ్యేట్టయితే, సర్వులకూ, సర్వవేళలా ఆనందం తత్తద్వస్తు మూలకంగా కలగవలసే ఉంటుంది. కాని ఈవిధం లోకంలో దృశ్యమానం కావడం లేదు. తత్తత్పరిస్థితులలో. తత్తద్వ్యక్తి దృష్ట్యనుపాతంగా తత్తద్వస్తు సముదాయం ఆనందహేతుక మవుతున్నది. కాబట్టి బాహిర సన్నివేశాలకన్నా, ఆంతరస్థితియే ఆనందస్పందక మవుతున్నది. అప్పుడే అది అచ్చమయిన వ్యామోహాలు విడిచి వాటన్నిటి విషయంలో నిర్లిప్తుడయి ఉన్నవాడికే అది లభిస్తుంది. అల్లాంటివాడే ఋషీ సంయమీ అవుతాడు. ప్రేమ ఆనందస్వరూపము కాబట్టి, అచ్చమైన ప్రేమికుడు అచ్చమైన ఋషి అవుతాడు. ఆత్మ ఏకాగ్రమై భగవద్భావమందు, అనితరమందువలె, ఎవ్విధంగా లగించుతుందో, ఆవిధంగానే భగవద్భావమయిన ప్రేమయందూ లగించ వలసి ఉంటుంది. ఈ ప్రేమ ఉద్బుద్ధికి కారణం 'ఒక'టని ఉండదు. అది స్వయంభువు. దానియొక్క ఎరుగుదలకు అతనిస్వంత అనుభవమే సహాయకమవుతుంది. అందుకనే ఊర్వశి అంటుంది—

---

12. సైషా ఽనందస్య మీమాంసాభవతి. యువస్యాత్సాధుయువాఽధ్యాయకః ఆశిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వావిత్తస్య పూర్ణా స్యాత్. సఏకమానుస ఆనందః. (సాధు యువకుడు. సాంగాధ్యయన మొనర్చినవాడు. ఎట్టి పనినైనను అవలీలగా చేయువారిలో శ్రేష్ఠుడు. దృఢిష్ఠుడు, బలిష్ఠుడు, జగమునంతయు ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలునట్టి సార్వభౌముడు- అట్టివానికిగల యానందము ఒకమానుషానంద మనబడును.)

13. తనలోతాను సౌఖ్యపడగలవాడు బైట సౌఖ్యాలకి దేవుళ్ళాడడు. తనలో తనకి సామరస్యం కుదరనివాడికి బైట ఎన్నిసౌఖ్యాలున్నా వృథా. (మ్యూజింగ్స్. భా. 3. పే. 173).

'క్రమంగా కాలంలో స్వంత అనుభవం బోధించవలసిందే. మాటలతో నేర్చుకునే విషయాలు చాలా అల్పమైనవన్నమాట. 14. ఎదుగు విశాలంగా, తెలుస్తాయి. తెలీడమంటే అర్థమేమిటనుకున్నావు? అనుభవించే అర్హత కలగడ మన్నమాట...' అని.

ఈ ఎదగడమనేది బాహిర ప్రేరణవల్ల జరిగేది కాదు. 15. బలవంతంగా బాహిరం నుండి లభించేది వ్యక్తికి బాధాకరమే అవుతుంది. అందుకని తన మనస్సు లోంచి తానే కట్టుకురావాలి. 16. ఈ సుఖదుఃఖాలన్నీ మన మనస్సులోనే ఉన్నాయి. దాన్నే 17. ఆ మాలిన్యా మాలిన్యాలనే సర్వత్రా మనంచూస్తూ ఉండడం జరుగుతుంది.

చలం సాహిత్యం ఇంద్రియోద్రేక కారకమైందనే భావం వ్యాప్తమయి ఉండడం నిజమేకాని అది అవిచారక మూలకం. ఆత్మికమయిన ప్రేరణకు సాంఘికములూ, అసర్థములూ- అర్థంమాసి బూజెక్కినవి- అయిన నిబంధనలు ఉండవు అనేభావాన్ని విస్తరించడానికిగాను స్పష్టమయిన సాహిత్యాన్ని చదివి, ఆ భావాన్ని వ్యక్తీకరించే భాగాలు చదివీ, మరవడంవల్ల ఇల్లాంటి ప్రథ ఏర్పడింది. సాంఘికమైన అనేక నియమ, సంప్రదాయాదులు పరిణామదుష్టము లయినప్పుడు, ఆ దుష్టత్వం తీసివేయటానికి చేసిన యత్నంలో, ఆ నియమ, సంప్రదాయాదులూ మాసిపోవడం జరిగింది. అంటే ఆ దుష్టత్వం అంతగా ప్రవర్తితమైన దన్నమాట "నాతిచరా" మిత్యాది ప్రతిజ్ఞలద్వారా ఏర్పడిన పవిత్రబంధం, నిర్బంధ గా మారి ఎంతగా ప్రస్తుతం దిగజారిపోయిందో విచారించుకుంటే ఈ విషయం చాలా త్వరగా బోధపడుతుంది. ఉభయధాసన్నికృష్ట మయిన భావమే ఉంటే దాంపత్యం 'స్వర్గ' మవుతున్నది. కానిచోట్ల 'నరక' మవుతున్నది. మనసు అపరిపక్వంగా ఉన్న సమయంలోనే బంధనాలు ఏర్పడడంవల్ల, ఆ మనస్సు కృత్రిమంగా వికసింపజేసే యత్నం జరిగి, వికసించకుండానే సర్వేసర్వత్రా- అపవాదాలు అన్నిటికిమల్లేనే దీనికీ ఉన్నాయి— జ ర గ డ ం దృశ్యమానమవుతుంది.

---

14. విశాలత్వమంటే అన్ని వేపులా, అందంగా పెరగడం. అంతేకాని ఓవైపు వెర్రి తలలు వెయ్యడంకాదు. (మ్యూజింగ్స్. భా. 2. పే. 55).

15. తనస్వంత సుఖాన్ని తనలోపల్నించి కట్టుకోవాలి మానవుడు... తనసుఖానికైనా సరే, బలవంతంగా ఒక ఏర్పాటుచేస్తే దాంట్లో నిలువడు. బాధకైనాసరే. అతనికి స్వతంత్రం కావాలి. (మ్యూజింగ్స్. భా. 2. పే. 13).

16. ఈ సుఖాలన్నీ ఎక్కడేడిశాయని మనస్సులోగాక. (మ్యూజింగ్స్: భా. 2. పే. 185).

17. ఇతరులలో కనపడే మాలిన్య మెప్పుడూ హృదయ దర్పణాలమీద ప్రతిబింబిత మైన స్వీయకల్మషమే. (పే. 6. శశాంక).

లోకంలో. అప్పుపడి, దాన్ని నిర్వర్తించుకపోవడానికి దాసత్వం నెరపబడ్డట్లు ఉభయధా మారితే ఆ దాంపత్యం 'అనర్థం' కాకుండా సార్థం ఎల్లాగవుతుంది? ఈ దృగ్విధనిరూఢ సిద్ధాంతాలకు లొంగక స్వవ్యక్తిత్వంతో నిలబడ్డ చలం 'అనర్థుడు'గా భావ్యమయినాడు.

ప్రేమకి 18 కామం ఒక అంగమేకాని, తద్వరహితంగా ప్రేమ ఉండదనేది, అసంభావ్యమూ, అసంబద్ధమూ అని పూర్వమే వ్యక్తీకరించబడింది. మొదట ఊర్వశి పురూరవుడి దగ్గరికి వచ్చినప్పుడు పురూరవుడు కఠినంగా మాట్లాడే సందర్భంలో వ్యాఖ్యానప్రాయంగా చలం—

'మామూలు మోహరీతులకి అలవాటయిన అతని మనస్సు, ఆమె నిశ్చల తన్మయత్వాన్ని అనుమానిస్తుంది. వెరపునీ, వంకర్లనీ, కామాన్నీ, అవసరాల్నీ, ఎరగని ప్రేమ అతనికి అర్థం కావడంలేదు.' అంటాడు. (పురూరవ—పుట 12) కామ ప్రవృత్తికి త్వర చూపించిన పురూరవుడితో ఊర్వశి 'పాపం అదొక్కటె గావును నీకు సౌందర్యాన్నుంచి ఆనందం తీసుకునే విధం...నీతో ఉన్న ప్రతి నిమిషం నీ నించి గొప్ప గొప్ప తృప్తి ననుభవిస్తున్నాను...ఆ సౌఖ్యం చాలా స్వల్ప విషయం... సౌందర్యానికీ, ఆ కలయికకీ సంబంధ మేమిటి? అది కామబలం, సృష్టి చేతుల్లోకి తీసికొని, అదిమి, తాగి, కళ్లు ఆవేశంతో రక్త విజృంభణంతో మనస్సు పొరలు గప్పి— ఆ నిమిషాన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకున్ననాడు స్వర్గమే నీ కరతలామలకం. (ఆ సౌందర్యానుభవం నేర్చుకోవడం) అదో విద్య కాదోయ్, ఎదగాలి ఆ జ్ఞానంలోకి' అని అంటుంది. (పురూరవ పుట—56)

ఇంకా ఇల్లా అంటుంది.

"ఈ శరీరాల కలయికతో రక్త సంబంధంతో నా శక్తి, నా జ్ఞానం, నా స్పష్టత, నీలోకి రావాలి. ఉత్త కామవాంఛ తీర్చుకోవడమనుకోకు. నీ ఆలింగనంలోకి అపురూప దేహలావణ్యాన్నే కాదు, గొప్ప సంస్కారాన్నీ, విశాల విజ్ఞానాన్నీ, ఆధ్యాత్మికశక్తినీ తీసుకుంటున్నావు. నీ ఆత్మ వికసించలేకపోతే ఈ సృష్టి లీలే

---

18. నా ప్రేమలో సంభోగానికి ఎక్కువ ప్రధానమైన స్థానంలేదు. సంభోగంవల్ల కలిగిందానికన్నా, ఉన్నతమైనదీ, తృప్తినిచ్చేది, ఏదో (దానికి పేరులేదు) ఇస్తాను, తీసుకుంటాను. అది ఆ ప్రత్యేకమైన విలువ సంభోగ కార్యానికి, గొప్ప గాఢత్వాన్ని, రసికత్వాన్నీ. అందాన్నీ, ఇంకా నువు ఒప్పుకుంచే నిర్మలత్వాన్ని ఇస్తుంది. (చలం ఉత్తరాలు, ఉత్తరం—153).

అర్థ విహీనం వ్యర్థం" అని 19. (పురూరవ_పుట 61) ఆధ్యాత్మిక శక్తి అంటే మహోన్నతమైన 20 శృంగార కలాపమని చలం అభిప్రాయం. తీవ్రమయిన ఏ అనుభూతి అయినా ఆధ్యాత్మిక మవుతూ ఉంటుంది _ ఆత్మకు సంబంధించింది _ అవుతుంది. ఆ తీవ్రానుభూతి లేనినాడు అనుభూతి కేవలేంద్రియమాత్ర పర్యవసాయిగా అవుతుంది. మరి అది అవాంఛనీయమైన విషయం గదా.

'శృంగార కలాపం' అనే మాట నిశ్చితమైన అర్థంలో ప్రరూఢమయి ఉంది లోకంలో. భాషలో కొన్ని కొన్ని పదాలు కొన్ని నియమితమైన అర్థాల్లోనే పర్యవసించిన కారణంగా, ఆ పదాలు తమ స్వశక్తిని కోలుపోతున్నవని చెప్పవలసివస్తుంది. శృంగారకలాపం అనగానే మామూలుగా సంభోగ వ్యాపారం అనే భావన కలుగుతుంది. కాని చలం ఉద్దేశ్యం అదికాదు. సౌందర్యానుభవం గూర్చి ఏదయితే చెప్పాడో అదే 'శృంగార కలాపం' అనే దానికీ అర్థం. ఈ మాట కాకుండా చలానికి వ్యవహారగత పదం మరొకటి దొరకలేదు, మరొకమాట ఉపయుక్తమయితే, తద్భావనలో అది అనుపయుక్త పూర్వం కావడంవల్ల అసలు భావమే అవ్యక్తమయ్యే స్థితి ఏర్పడుతుందేమోననిపిస్తుంది.

ఈ నాటకంలో పురూరవుడు _ మహా శౌర్యవంతుడు, కీర్తిమంతుడు, అతిలోక సుందరుడు, సర్వశాస్త్ర కళా ప్రవీణుడూ అయిన ఒక మానవ చక్రవర్తి. తన మహాన్వేషణలోని వ్యక్తి పురూరవుడని ఊర్వశి తెలుసుకొని ఇతన్ని కలుసుకోదలుస్తుంది. 'ఏదో' 21 శాపం అనే దారి చేసుకుని ఇతన్ని కలుసుకుంటుంది. మానవత్వంలోని అల్పిష్ఠ గుణాలతనిలోని వామెకు అతనిపై కసి గలిగించినా,

---

19. ఆధ్యాత్మిక యత్నమంటే నా ఉద్దేశ్యం, హద్దులూ. లోపాలులేని తీవ్రమైన నిరంతరమైన శృంగార కలాపమని. (మ్యూజింగ్స్ భా. 3 పే. 289) ఆధ్యాత్మికత అంటే, ప్రపంచంలోని అందానికీ, ఆనందానికీ కళ్లు తెరవడం. (మ్యూజింగ్స్. భా. 2 పే. 78)

20. ఈ సృష్టి సంబంధమైన విషయాలు వాళ్ళ మనసుల్లో నీచమన్నా అయిపోయి ఉండాలి. లేక కామాన్ని శృంగారం కింద మార్చుకొనే శక్తి లేకపోయి ఉండాలి. (మ్యూజింగ్స్. భా. 3 పే. 289)

21. శాపం ఫలానా అని నాటకంలో ప్రస్తావితం కాలేదు. కాళిదాసు ఊర్వశికి వచ్చిన శాపమే కావచ్చు.

దానివల్ల జాలిపడి, దయతో అతన్ని అచ్చపు ప్రేమను తెలుసుకొనేట్టు చేయ యత్నిస్తుంది. అతడూ ఆమెవల్ల చాలా 'ఎదిగి' నాడు, కాని పూర్ణత్వం సిద్ధించలేదు. అతనిలో ప్రేమకన్న మరొక మనః ప్రోద్బలంయొక్క ప్రాముఖ్యం కనుపించడంతో అతన్ని ఆమె వదలివేస్తుంది. సంక్షిప్తంగా ఇది గాథ. దీనిలో ఊర్వశి అనుభవ రూపంలో చిత్రిత కావడంవల్ల పురూరవుని 22 'ఎదుగుదల' కు ప్రాధాన్యం కలిగింప బడడంవల్ల దీనికి చలం 'పురూరవ' అనే పేరు పెట్టాడని తోస్తుంది.

ఈ నాటకంలోని ఆద్యంత వాక్యాలు చాలా కళాత్మకంగా నిబంధితా లయినవి. ఆద్యంత వాక్యాలూ ఊర్వశివే,

'వొచ్చాను...చివరికి వొచ్చాను ఎన్ని యుగాలకు కనపడ్డావు నాకు !'

'దయగా నాకు లేదనుకోకు...నీతో కలిసి సుఖించిన ఊర్వశినే తలచుకో నన్నందుకోగలిగే వరకు నేను వెడతాను___'

ఇవి ఆద్యంత వాక్యాలు. దీనిలో గమనించ వలసింది, నాటకం 'వొచ్చాను' అనే మాటతో ప్రారంభమయి, 'వెడతాను' అనే మాటతోపూర్తి కావడం. ఈ విధంగా నిబంధించాలని ఉద్దేశ్య పూర్వకంగా చలం చేసిందీ, లేంకీ అజ్ఞాత విషయమే, కాని _ ఆ సందర్భాలలో తప్పనిసరిగా ఆ మాటలు రాయవలసిరావడం మాత్రం నిజం. దానికి రచనలోని తీవ్రతా, శక్తీ మాత్రమే కారణాలవుతాయి.

ఆద్యంతమూ మనకు దీనిలో గోచరించేది ప్రేమయొక్క పవిత్రతకు బహిరములైన అహంభావాదులు పూర్తిగా నిరవృతం కావలసి ఉంటుంది. ఆ ప్రయత్నమే పురూరవ విషయంలో ఊర్వశికృతం.

'ఆ బట్టలతో, హారాలతో నీ అహంకారాన్నికూడా అక్కడే వదలిరా' అని ఊర్వశి పూరూరవుణ్ణి అంటుంది మరొక చోట. (పు. 21)

'నీమీద కాదు, నీ మీద గొప్ప ప్రేమ. నా కసి నీ అల్పత్వం మీద, అంధత్వం మీద' అంటుంది. (పు. 21)

ఈ 'అల్పత్వం, అంధత్వం' అనేవి మానవునిలో కెల్లా వచ్చాయి ? అని ప్రశ్నించుకుంటే, 'కృత్రిమమైన నాగరకతకూ, దురభిమానాలకూ, డాబులకూ,

22. ఎదగడం అంటే సంకుచితమైన మనస్సూ, ఆత్మా, అత్యంతమూ విశాలమవడం. చావడమంటే ఈ 'నేను' అనే భావం నశిండం. ఆ నేను అనేదే లేకపోతే నాకూ ఈ యిసుక రేణువులకూ భేదమేలేదు. (మ్యూజింగ్స్. భా. 2. పే. 167.)

దర్పాలకూ లోబడటం వల్లనే' అనేది సూటి అయిన సమాధాన మవుతుంది. పై గుణాలవల్ల మనిషికీ సంకుచితమైన పరిధులు ఏర్పడ్డాయి. వీనివల్ల ఇతర వినాశపిశున సర్వకార్యాలూ ప్రక్రియలూ ప్రారంభమైన అహం ఒక్కటి నశించాలి. 23 అభిమానం దగ్ధమయిపోవాలి.

అయితే ప్రేమ స్వచ్ఛంగా వికసించాలేగాని___ స్వచ్ఛంగా అంటే, ఇతర విషయ కలుషితం కాకుండా___ సూర్యకిరణాలకి మంచులాగా పైవన్నీ కరిగి ఇంకుతాయి. మళ్ళీ పేరుకోవు.

'ప్రేమంటే ఏమనుకున్నావు ?... ప్రేమంటే, ఆశించిన స్త్రీనీ ఆలింగనంలోకి వస్తే ఏ భారం లేకుండా అనుభవించడమనుకున్నావా ? కంటికి బావున్న స్త్రీనల్లా నీ పాన్పుమీదికి రమ్మని ఆహ్వానించడమనుకొన్నావా ? స్త్రీ సౌందర్యం ఎందుకు సృష్టింపబడ్డదనుకునావూ ? పురుషుణ్ణి కాల్చి మెడవొంచి, కళ్లు తెరవడానికి, అతని ఆత్మని అతనికి చూపడానికి. తక్కిన ఆలింగనాలన్నీ సృష్టి జరగడానికి' అని అంటుంది ఊర్వశి. (పు_37.)

ప్రేమను గూర్చి, స్త్రీ సౌందర్యాన్ని గూర్చి ఇది చలం ఉద్దేశ్యం.

పురూరవుడిలోని ఒక్కొక్క అహాన్ని నివారించడానికి ఒక్కొక్క సంఘటన కల్పితమయింది. నాటకంలో వాద్య ప్రావీణ్య, రతికళా పారీణత్వాలు నాట్యరీతులతో నివారితములైనవి. స్వసౌందర్య నిర్భరత్వం ఊర్వశీ సౌందర్యంచే విస్తారితమయింది. తనదే ఉత్తమ మనుకునే సందర్భంలో స్వీయంకన్నా ఉత్తమమైనదాని దర్శనం వల్ల తత్పూర్వమైన 'అహం' సద్వ్యక్తియందు లోపించడం సహజం. సహజంగా సత్యాన్వేషకుడయిన పురూరవుడిలో ఈ ద్విధంగానే అవి లుప్తమయినవి.

ఒక కర్మయందు దీక్ష వహించిన వ్యక్తికి తత్కర్మవ్యతిరిక్తములయినవి. పట్టవు. వాటిని పట్టించుకుంటే దీక్షయందు శైథిల్యం చేకూరిందన్నమాట. ఉదాహరణకి సన్యాసికి గృహస్థధర్మ బాధ్యతలుండవు. ఉంటే సన్యాసంలో లుప్తి కలిగిందేకదా. ఈ విధంగానే ప్రేమ దీక్షాపరుడికి___ పురూరవుడికి___ యుద్ధము హింసాది అవసర బాధ్యతలు___ఒకప్పుడు___అనవసరములే అవుతాయి. ప్రస్తుతం...

ఇదే ఒకచోట ఊర్వశి అంటుంది.

---

23. మరణ వేదనతో ఆత్మ నలిగి, తపించి, భస్మమైతేకాని దురభిమాన పిశాచం వొదలదు. (శశాంక. పే_46).

'ఆచార్యాలు — నీను యుగాలూ. రాచరికాలు ముఖ్యమైన దినాలలో కట్టుకున్న బంధాలు. ఈ నాడు నువ్వు (ప్రేమ) దీక్షపరుడివి నీ ధర్మం వేరు.' 24

దీనికి పురూరవుడు 'దీక్షపరుణ్ణా' అంటాడు.

అవును, సాంఘికంగా, లౌకికంగా ఏ దీక్షలైతే ప్రస్థితములై ఉన్నాయో, వాని యందే లోకం 'దీక్ష' అనే పదాన్ని ఉపయోగించడానికి ఒప్పుకుంటుంది. కాని దాని అనుభూతికి అందని విషయాలలో దీక్ష పదం అది సైచదు. ఇది లోక సామాన్య విషయం. అందుకనే పురూరవుడల్లా అన్నాడు. అందుకు ఊర్వశి ఇలా అంటుంది :

25 "అంతేలే, నీ మనసునుంచి ఆ అభిప్రాయం పోలేదని తెలుసు నాకు. శృంగారం ప్రేమ చాలా తీవ్రమై కాలాన్నే కప్పివేసినప్పుడు, అది ఉత్త స్త్రీ లోలత్వం, మీ మనస్సుల్లో...సుఖంకానీ, కష్టంకానీ ఏ స్థితివల్ల మానవుడికి ఔన్నత్యానికి తోవకలగదో, అది వృథా. అందులో స్త్రీ శృంగారంవల్ల ఏమీ అధికంగా విజ్ఞానం తెచ్చుకోలేనివారు వుత్త దౌర్భాగ్యులు 26 ఈ లోకపు వెల్గులోకి, ఆ జన్మకే కాదు— ఆ లోకపు వెల్గులోకి, జన్మకికూడా స్త్రీయే ద్వారం" అని.

'రానీ రోగం, రోగగ్రస్తుడివైతే ఏంగాక, నాకన్న నీ రోగం నీకు ముఖ్యం కానన్నాళ్లు' అని. (పు. 48.)

సావిత్రి తన ప్రేమాలంబనాన్ని మృత్యువునుండి తప్పించుకుంది ఈ పద్ధతి ద్వారానే. ఇది పురాణ గాథ కావచ్చు. ప్రేమ స్థిరమయినప్పుడు మిగతా బంధాలన్నీ గౌణంగా అయిపోతాయి. తన ప్రేమకోసం సామ్రాజ్యాన్ని తృణీకరించినట్టి ఎడ్వర్డూ అధునికంగా ప్రత్యక్ష భూతుడు. అజ్ఞాతంగా ఈ స్థితిలో ఉన్నవారు దేశంలో ఉన్నారు'

చలం పురూరవలో నాయికా నాయకులిద్దరికీ నగ్నత్వం ప్రతిపాదించినాడు. ఈ నగ్నత్వం అనే మాట వినబడగనే అదొక వింతనీ, వికారాన్నీ లోకంలో స్ఫురింప జేస్తుంది. ఈ నగ్నత్వం స్వచ్ఛత్వానికి ప్రతీకగా తీసుకోబడింది నాటకంలో. ఆచ్ఛాదన శారీరక పర్యవసాయి మాత్రమేకాదు. మనః పర్యవసాయి కూడా అయింది. లోకంలో తన్మూలంగా కపట, దంభాదులే ప్రత్యక్షాలవుతున్నాయి కాని స్వచ్ఛత్వం నిరస్తమయి పోయింది. వీనియొక్క పెరుగుదల, ఆచ్ఛేద్య దశలోకి పరివర్తితమయింది. అందుకని తద్విచ్ఛేదనను నిరూపించడానికే నగ్నత్వం దీనిలో కల్పితమయింది.

---

24. 25. పురూరవ. పే. 70, 71.

26. సెక్సు నా ముక్తి మార్గం. ప్రతి స్త్రీ లావణ్యమూ నాకు భగవాన్‌ని జ్ఞాపకం చేస్తుంది. ఆమె శరీరాకర్షణకి అంధుణ్ణికాను (చలం ఉత్తరాలు. ఉత్తరం-113) మరో చోట ఇల్లా అంటుంది.

'నివేదన' అనే ఒక వచన ఖండికలో చలం అంటాడు— 'నీ సమక్షానికి నగ్నంగా రమ్మని నీ ఆజ్ఞా, ఎంత కఠినుడివి!...ఎంత ఆశ పడ్డాను. గర్వంగా నీ ముందు నా ఆడంబరాల్ని చూపుకోవాలనీ, నీకోసం వచ్చిన నేను సామాన్యమైనదాన్ని కాననీ, నా అందంతో ఐశ్వర్య విభవంతో నీ కళ్ళు చెదరగొట్టి ఆకర్షించాలని, 27 నగ్నంగా నీ ముందు నిలబడితే నే నేం గుర్తు నీకు?' అని.

అంటే ఆడంబరాన్నీ అసమానత్వాన్నీ, అందాన్నీ, ఐశ్వర్య విభవాన్నీ, వదలడమే నగ్నత్వం పొందడమన్న మాట. అందరూ గనుక 'అతని' ముందు నగ్నత్వంతో నిలబడితే 'నే' ననే 'అతని' కెల్లా కలుగుతుంది? అని 'ఈవిడ' సందేహం. అనేకత్వమందు ఏకత్వం సిద్ధించినప్పుడు ప్రత్యేకాంశంయొక్క విశిష్టత ఏమీ ఉండదు. తద్విశిష్టత కావాలన్నామా, అన్యాంశం ఈ ప్ర త్యేకాంశం విభిన్నత్వాన్ని పొందుతుంది. అప్పుడు 'గుర్తింపు' సులభమే. కాని అప్పుడా ప్రత్యేకాంశానికి 'అహం' ఏర్పడిపోతుంది.తదహం విశిష్టతే అనర్థక మూలమవుతున్నది,కాబట్టి నిజా ంకా'గుర్తింపు' అప్పుడూ ఉండదు. అందుకని ఈ ఉండకపోవడానికన్నా. ఆ ఉండిపోవడమే వాంఛనీయ మవుతున్నది. నగ్నత్వం అంటే చలం ఉద్దేశ్యం ఇదేకాని, లౌకికంగా వ్యవహృతమయ్యేదికాదు.

ఊర్వశీ స్వరూప నిర్ణయం ఉన్నత స్థాయిలో జరిగిం దీ నాటకంలో. ఊర్వశి దేవతగా భావింపబడుతున్నది. దేవతలందరూ తేజోరూపాలని గదా భావ్యమవుతున్నది. తేజస్సు అస్మదాది వదాకృతికి ఉండదు గదా. తదాకృతి లేనప్పుడు మనుష్య లోకంలో వలె శారీరికమయిన అనుభవం ఉండడానికి వీలులేదు. కర్మేంద్రియాలు వాహికలుగా, లౌకికమైన ఈ అనుభవం సాగుతుంటుంది. కర్మేంద్రియ వాహికా విరహితమైన అనుభవం అనుభూతికి రావడం కష్టతమ విషయం. అందువల్ల తేజోరూపమైన ఊర్వశితోడి అనుభవం. 28 మృణాళినీత్యాది అన్య వ్యక్తులనుండి లభ్యమనట్లుకాదు. అయితే ఊర్వశి పురూరవుడికి మానవ రూపంలో లభ్యమయింది. అంటే అననుభవ రూపమయిన ఊర్వశికి, అనుభవాను రూప రూపం కల్పితమయిందన్నమాట. ఈ ప్రతీకయైన ఊర్వశి నాటకాన్నంతా ఆవరించిఉంది.

అయితే ఊర్వశి కీ విధమైన రూపకల్పన జరిగినా, ఒక విధమైన మహోన్నత మానసిక, ఆత్మిక మయిన అనుభూతి. ఈ అనుభవం పురూరవుడికి ఏ మహాసుకృతం వల్లో లభించింది. ఆ అనుభవాన్ని స్థిరీకరించుకోవడానికి దీర్ఘీకరించుకోవడానికి

---

27. 'అచటి బహుజన రక్త చిహ్నములయందు నాది యిదని గుర్తేమి కన్పడును స్వామి!' (విశ్వనాథ సత్యనారాయణ. నీ రథము)

28. మృణాళిని 'పురూరవ' లో పరామర్శిత అవుతుంది. ఆమె పురూరవునియొక్క పూర్వపు ప్రియ అన్న మాట.

పురూరవుడు తన మనస్సు నెరిగించుకోవడం ముఖ్యమయింది. తాత్కాలిక లబ్ధమయిన ఆ అనుభవం, దానివల్ల అతనికి సర్వదా అందుబాటులోకి రావాలి. అందుకనే ఆ ఆనందానుభవ సందర్భంలో పురూరవుడు: 'మనంకాదు, నువ్వూకాదు, నేనుకాదు, నువ్వూ అవును, నేనూ అవును. భేదంలేని నువ్వూ నేను ఐక్యమయిన మనం' అని అంటాడు. (పుట. 124).

అంటే ఆ అనుభవ పరిణతస్థితిలో విభేదం ఉండదు. ఒక సత్యస్వరూపమే అక్కడ భాసిస్తుంది. భిన్నత్వం ఉండదు. అంతా ఏకత్వమే. భిన్నత్వమందు ఏకత్వం కలిగి అనితరమయిన అద్వైతానందం కలుగుతుందన్నమాట. ఈ అనుభవం సాయుజ్యానుభవంగా భావ్యమవుతున్నది. ఈ సాయుజ్యానుభవంవల్ల విశ్వమందలి ఏకత్వం, విశాలత్వం గోచరమవుతుంది కాని లౌకిక భిన్నత్వంకాదు. ఈ భిన్నత్వదశ ఏనాడు లోకంలో మృగ్యమవుతుందో ఆనాడే లోకం ఉన్నతగమనంలోకి వెళ్ళుతుంది.

'ఉన్నత గమనం అంటేనే పూర్వబంధనాశం అన్నమాట'. (పుట 99) పూర్వబంధాలంటే లౌకికాలయిన రాగద్వేషాది బంధనాలన్నమాట అహంతాది నిరాసకమైన అనుభవారత కలిగినప్పుడే ఆ ఉన్నతమైనగమనం కలుగుతుందన్నమాట. పురూరవుడికి అది స్థిరంగా కలగలేదు కాబట్టి, ఆ అర్హత లేకపోయింది. ఆ గమనంలేకుండాపోయింది. అంటే కథాదృష్ట్యా ఊర్వశి అతన్ని వీడిపోయిందన్నమాట.

'ఊర్వశి అంటే ఒక అనుభవం. శరీరంకాదు' (పు. 135) అన్న ఊర్వశి మాటకు పురూరవుడికి సందేహం కలుగుతుంది. '—ఊర్వశి పురూరవుడి ప్రేయసి అనడంలో అర్థమేముంది?' (పు. 1‧5) అంటే పురూరవుడు తన పూర్వఫలితంగా ఊర్వశీ అనుభవానికి అర్హుడౌతున్నాడన్నమాట. (పు. 135) అయితే స్వర్గానికి వెళ్ళే వాళ్ళందరికీ ఊర్వశీ అనుభవం పురూరవుడికివలెనే జరుగుతోందిగదా, ఇక పురూరవుడి ప్రత్యేకత ఏమిటి? ఈ విధమైన ప్రశ్నే పురూరవుడికి కలగకుండా ఉండవలసి ఉంది. ఇది ఇంకా అతని 29 సంకుచితత్వాన్నే సూచిస్తుంది. కాని విశాలత్వాన్నికాదు ఎందుకంటే అనుభవస్థితిలోనికి పోయినప్పుడు, ఆ ఐక్యస్థాయి నందినప్పుడు ఈ 'ప్రత్యేకత' యొక్క దృష్టే ఉండదు.

పురూరవుడు ఈ లోకంలో ఉన్నాడుకాబట్టి, అతనికోసం శారీరికమయిన రూపం ఆ అనుభవానికి కల్పించబడవలసి వచ్చింది. కాబట్టి యదర్థమై అది కల్పితమయిందో, తదర్థమయ్యే పర్యవసిత మవుతుంది. స్వర్గతులైన వారికి ఈ అనుభవ మే కాని ప్రత్యేకంగా లౌకిక విధమయిన అనుభవం ఉండదు. తచ్ఛారీరికా భాసమాత్రమే ఉంటే

---

29 బృహస్పతి:— 'సంకుచిత ఈర్ష్యలకు అతీతులము కావాలి'.
(శశాంక. పే 6).

ఉండవచ్చు. వాళ్ళ ఊహాప్రకారంగా అనుభవం పొందుతారు గదా: కాబట్టి తిరిగి స్వర్గంనుండి పురూరవుడికి కనుపించడానికి ఊర్వశి వచ్చినప్పుడు పురూరవజ్ఞాత పూర్వ రూపంతో ఉపస్తుందికాని లౌకికశరీరంతోకాదు. ఆ తేజస్సు అల్లా ఒదిగిందన్నమాట.

కథాసృష్టితో మరోవిషయం ఉంది. ఊర్వశికి శాపం మానుషత్వంవల్ల వచ్చింది. శాపాంతంతో అది విడిపోయింది. అయితే ఇందులో ప్రేమ శక్తి ప్రసక్తి ఏమిటి? ఆమెకు శాపం రాకుంటే పురూరవ సమాగమహేతువవుతున్నది. కొన్ని ఉక్తప్రేమాది హేతువులు నిజమయినవి కావు. ఇది ఆలోచించదగింది.

అసలు ఊర్వశికి శాపం ఎందువల్ల వచ్చింది?
దేవసభలో చేసిన ఒక పొరపాటువల్ల.
ఆ పొరపాటు ఎందువల్ల కలిగింది?
పురూరవుడి పైని ఆమెయొక్క ప్రేమవల్ల.

ఆ పొరపాటువల్ల ఆమెకి శాపం వచ్చిందిగదా అంటే శాపాత్పూర్వమే ఆమె ప్రేమ పురూరవ నిష్ఠమైందన్నమాట. దీనివల్ల ఆమె ప్రేమ తన వికాసానికిగాను శాపం పొందింది అని తెలుస్తుంది. ఆమెకు తెలుసు. దేవ సభలోని అల్లాంటి తప్పిదాలకు శిక్షలుంటాయని పొరపాటు అంటేనే ఉద్దిష్టంగా చేసిందికాదని. అంటే అజ్ఞాతమైన ఆంతరిక ప్రేరణే బలవంతంగా దాన్ని జరిగించింది. కాబట్టి జ్ఞాతమైన నియమాచరణ కన్న ఆంతరికమైన ప్రేమయొక్క ప్రేరణే (బలవంతంగా దాన్ని జరిగించింది. కాబట్టి జ్ఞాతమైన నియమాచరణకన్న ఆంతరికమైన ప్రేమయొక్క) బలవత్తర మయిందన్న మాట. అ దకనే శాపం దుఃఖహేతువుకాక ఆనందస్పందకమయింది. అందుకనే శాపంయొక్క బలంవల్ల వొచ్చావుకాని ప్రేమవల్లకాదనే పురూరవుడికి సమాధానంగా ఊర్వశి :

30 'నా ప్రేమ అనివార్యం. తప్పదు నిన్ను కలుసుకోవడం కలుసుకోంది నా జీవితానికి అర్థంలేదు. గొప్పశక్తి ఊపుతుంది నన్ను నీదగ్గరికి. అది శాపంవల్ల కానీ, వరంవల్లకానీ ప్రేమతో కలయిక అనే నిశ్చలవాస్తవం, అనేకమార్గాల, ప్రయోజనాల వల్ల సఫలమవుతుంది... 31 అల్లాంటి సంబంధం నీతో నాకు విధితో సృష్టితో, ఏర్పడ్డది. నువ్వు నన్ను పొమ్మన్నా, వదిలించుకోవాలని చూసినా, నా ప్రేమ నిన్ను వదలదు.' అని అంటుంది. అందువల్ల ఉద్దిష్టమైనది మహోత్తమమయితే ఏ మార్గంలోనన్నా నెరవేరుతుందనేది నిజం.

శాపాంతంకూడా ఈ విధంగానే గమనించాలి. తనకి పిలుపు వచ్చినప్పుడు తప్ప కుండా వెళ్ళవలసి ఉంటుందని ఊర్వశి పదేపదే గుర్తు చేస్తుంటుంది. ప్రేమతో ఏ

30 పురూరవ. పే. 73. 31 పురూరవ. పే. 77.

విధంగానో ఓ విధంగా కలయిక జరిగింది. ఇక వియోగం ఎల్లా కలిగింది? ఆ పిలుపు వస్తే ఆగడం తనతరం కాదని చెప్పే ఊర్వశి మాటలవల్ల పిలుపు చాలా బలవత్తరమవుతోంది. ఆ దృష్టితో చూచినా ప్రేమ బలహీనమే అవుతున్నది. కాని ఒక విషయం ఇక్కడ గమనీయం ఉంది. ఊర్వశి 'ఆ' పిలుపు వస్తుందంటుందే కాని. నిర్దిష్టకాలాన్ని చెప్పదు. ఆమెకే అది అజ్ఞాతం, ఇక ఎప్పుడయితే పురూరవుడు ఆమెని — ప్రేమని — అంతఃప్రేరణవల్ల ధిక్కరిస్తాడో అప్పుడామె అతన్ని వీడింది. అంటే అతని ధిక్కరణ ఆమెకి పిలుపు—అతన్ని విడవడానికి హేతువయిందన్నమాట. అతని ఆ ధిక్కరణే లేకుండా ఉండేట్టయితే ఆమె అతన్ని వదిలేది కాదన్నమాట. జీవితాంతామూ ఆధిక్కరణ లేకుంటే జీవితాంతమూ వదిలేదికాదు. అంటే ఆ పిలుపు—ఆమె అతన్నివదలం, ఆధిక్కరణమీద ఆధారపడి ఉన్నాయి. అతనికి [32] పరిపక్వత రానప్పుడుఅతడా ప్రేమనిపూర్ణంగా ఇముడ్చుకునే స్థితికి రాలేదన్నమాట. అందుకని అతనికి 'ఇంతకాలం ఇచ్చిన జ్ఞానంతో' అతడు స్వంతంగా ఇకముందు ఆ అర్హత సంపాదించుకోవలసి ఉంటుంది. 'అంత ఔన్నత్యాన్ని నీ స్వభావానికి తెచ్చుకో గలగాలి' అని చివరలో పురూరవుడితో ఊర్వశి అంటుంది. ఆమె విడిపోయింతర్వాత, అతడు చేసిన కర్మలకి, దేవతలద్వారా ఊర్వశి అతని దగ్గరికి వచ్చి అతన్ని ఔన్నత్యం పొందడం కోసమే వత్తిడి చేస్తుంది. ఆమెకు తెలుసు, అతనికి పూర్ణత రాలేదని. అల్లాకాకుంటే పురూరవుడితో ఆమె అన్నట్లు విధితో పోట్లాడి అతన్ని లభించుకునేదే. ప్రేమ అనేది దీక్ష కాబట్టి దీక్షాభంగం వల్ల దాని ఫలితం అనుభవించ వలసింది. అవి శిక్ష అనిపించుకోవు. ఆగామి ఔన్నత్యమార్గమవుతుంది. అందువల్ల ఈ శాప, శాపాంతాలు ప్రేమయొక్క విషయంలోనే పర్యవసితాలవుతాయి కాని, ఇది వాటిల్లో ఇముడ్చబడదు.

ఈ విధంగా చూస్తుంటే పురూరవలో ఇంక చాలా విషయాలున్నవి. ముఖ్యంగా దీనిలో ఆయన అద్వైతాన్ని ప్రతిపాదించాడు.

ఈ వ్యాసాన్ని ఊర్వశి మాటలతో ఇల్లా ముగిస్తాము.

[33] జీవితమంతా ప్రతి అడుగుకీ కదలిక, కదలిక అంటే త్యాగం, తోవ పొడుగునా వదలడం. అందులో ప్రేమ జీవితమంటే చాలా వేగమైన కదలిక. క్షణ క్షణానికి తీవ్రమైన పరిత్యాగం.'

---

[32] బృహస్పతి :— ప్రేమ ఆత్మ సమర్పణమైనప్పుడే స్వీకరణార్హము. (శశాంక పే. 9). బృహస్పతి :— ప్రేమ కోరిన త్యాగానికి జంకేవాడు ప్రేమ కనర్హుడు శశాంక. పే. 65).

33. పురూరవ. పే. 115.

# యశోదా గీతాలు

వేనరెడ్డి

---

చలం, యశోదా గీతాలను భగవాన్ రమణ మహర్షి పాదాలముందు నివేదించి కొన్నాడు. యశోదగీతాలు చలం తదితర రచనలకంటె విలక్షణమైనవి. విశిష్టమైనవి. భావనలో రచనలో పరమోదాత్తత. పరచుకుని – భక్తి పరిమళించు – ఒక మహా కవి పొందగలిగిన ఉత్తమానుభూతిని అందించి ఆనందింపజేసే గొప్ప కావ్యం యశోదా గీతాలు.

జయదేవుని గీతగోవిందం, లీలాశుకుని కృష్ణ కర్ణామృతం వంటి ఉత్తమ కావ్యాల వరుసలో చేరేది యశోదాగీతాలు. గీతగోవిందంవలె, కృష్ణ కర్ణామృతంవలె గానయోగ్యత వీనికి లేకపోయినా అకావ్యాలవలెనే మనస్సుకు ఆర్ద్రతచేసి – ఉన్నత శిఖరాల నదిరోహింపజేసే – విశిష్టానుభూతిని అందిస్తుంది.

యశోద మాతృత్వం మూర్తీభవించేస్త్రీ. ఆమె చిన్నికృష్ణుణ్ణి కన్నది. కన్నుల్లో దాచుకున్నది. (యశోదకు కృష్ణుడు – తన కొడుకు కాడని తెలియదు). తన కొడుకులో తల్లి భగవంతుణ్ణి చూస్తుంది. తనయుని ఎడబాటుని భరించలేక పరితపిస్తుంది. చిలిపితనం – ఓపలేక కోపపడుతుంది. ఆనందిస్తుంది. అంతలో కోపం అంతలో ప్రేమ. అంతలో విసుగు – అంతలో వేదన. చిన్నికృష్ణుడికి జోలపాడుతుంది. జోకొడుతుంది. సర్వస్వ మర్పించడానికీ సన్నద్ధమౌతుంది. ఇదీ యశోదా గీతాలలోని వస్తువు.

యశోదా గీతాలలో యశోద ఒక లోకోత్తర పాత్ర. తెలుగు సాహిత్యం మొత్తంలో ఆమెకొక ప్రత్యేక పీఠం వెయ్యాల్సి వుంటుంది. భారతీయ భాషల్లోకి ఈ ప్రత్యేకస్థానం – చలం తీర్చిన యశోదకు వస్తుందేమో ! భక్తికి – అందునా కృష్ణ భక్తికి దేశంలో కొదువలేదు. భారతీయులకు కృష్ణునిలీలల్లో దొసగులున్నా కనుపించవు.

అంత మక్కువ వారికి అతనిమీద. కృష్ణున్ని - భగవంతునిగాచేసి మహాభక్తులూ - మహా కవులూ - తామే రాధికలై పాడినారు - గోపికలై గానించారు భాగవతంలో - హరివంశంలో - విష్ణు పురాణంలో - కృష్ణుని లీలలు విరివిగా వర్ణితమైన కావ్యాలలో - గీత గోవిందం - కృష్ణ కర్ణామృతం - ఇంకా ఇంకా అనేకాలలో కృష్ణు డెక్కువగా శృంగారమూర్తి. భక్తిశృంగారమే అందలి రసము. అందలి రాధికవలె గోపికలవలె - ఈ కావ్యంలో యశోద తన తనయుడైన కృష్ణుడికై ఆరాటపడుతుంది. ఆలపిస్తుంది. వెదకుతుంది. వేసారుతుంది.

యశోదాగీతాలు మూడవ ఖండికలో___

నీ అందం నీ నవ్వులూ, నీ వాంఛలూ నీ ప్రజ్ఞలూ అందరినీ తీసుకోనీ

నీ స్నేహం నీ వరాలూ నీ మహిమలూ
అందర్నీ అనుభవించనీ,

వుత్త ఎందుకూ కొరగాని, ఏమీ గొప్పలేని నువ్వు
నాకు వుంటే చాలు.

అయినా - నువ్వు కాకపోతే 'నాకు ఇంకోరూ;
కాని నేను కాకపోతే నీ కింకెవరు !'

అన్న యశోద మాటల్ని చెప్పి —

"కొడుకులులక్ష - తల్లి ఒక్కతే
కాదా భగవాన్ !

అంటాడు చలం"___

ఇదీ చలం మాతృత్వానికిచ్చిన విలువ. కావ్యమంతటా కన్నతల్లి మనస్సు వెన్నెలలాగా పరచుకుంటుంది- వెన్నలాగా ఆస్వాదింప యోగ్యంగా ఉంటుంది. ఇది విశిష్టమైన భావన.

తెలుగులో పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలో బెజ్జ మహాదేవి కథఉంది. బెజ్జమహాదేవి శివుడు తల్లిలేనివాడని - తానే తల్లిఅయి లాలిస్తుంది - స్నానం చేయిస్తుంది. అన్నం తినిపిస్తుంది. జోలపాడుతుంది- నిద్రబుచ్చుతుంది- అంతటి ఉదాత్తమైన చిత్రణ- మరొకటి లేదు; యశోదా గీతాలలో యశోద తప్ప. ఎందుకోకాని రామాయణంలో కౌసల్యకా అదృష్టం పట్టలేదు. దేవకికి అవకాశమే రాలేదు. లాక్షణికులు భక్తినిరసంగానే అంగీకరించలేదు_ కొందరు. భక్తిలోనే తక్కిన తొమ్మిది రసాలనూ అంతర్భవింపజేసాడు సోమన. అలాగే వాత్సల్యాన్ని కూడా రసమన్నారు

కొందరు. ఈ కావ్యంలో యశోద చూపిన ప్రేమ- భక్తిక్రిందే జమ. అయితే అది వాత్సల్య భక్తి- అనాలేమే. నవవిధ భక్తుల్లో వాత్సల్యభక్తి చేరదు. అయినా కాక పోయినా ఆమెది అచ్చమైన ప్రేమ- అచ్చమైన భక్తి. నారదుని భక్తిసూత్రాల్లో మొదటి సూత్రమే 'భగవంతుడు ప్రేమస్వరూపుడ'ని. ప్రేమస్వరూపుడైన భగవంతుని యందలి- ఆసక్తి- అదే ప్రేమ- అదే వాత్సల్యం- అదే భక్తి. కావ్యంలోని యశోద మాతృత్వం మూర్తీభవించిన స్త్రీ.

చలం- తానే యశోదగా తాదాత్మ్యం చెంది వ్రాసిన కావ్యం యిది.

"ఈ ఉదయం నన్ను యశోదని చేశావా ?

భగవాన్ !
అంటాడు- చలం"-—

(పే. 15. చలంగీతాలు)

ఇలా చలం యశోదలో అంతర్లీనమైన తనభక్తిని- తన అన్వేషణను- వ్యక్త పరుస్తాడు. చలం ఒక ఉన్నతమైన ఆధ్యాత్మికదశ (spiritual plane) లో ఉండి చేసిన రచనయిది. చలంలోని కవితా హృదయం విచ్చుకొని దివ్యపరిమళం వెదజల్లింది. అరుణాచలం చేరకముందరి చలం రచనల్లో - కవితాశక్తి లేదనికాదు- అందులో ఎక్కువగా ఆయన సంస్కర్తగా భాసిస్తాడు.

"చలంయొక్క సంస్కర్తరూపం క్రమంగా కన్నుమరుగైతేతప్ప కవిగా ఆయన స్వరూపం ప్రస్ఫుటం కాదు"

(సాహిత్యంలో దృక్పథాలు పుట.148)

అని ఆర్, ఎస్. సుదర్శనంగారన్నట్లు యశోదా గీతాలలో చలం — అచ్చమైన కవితా దర్శనం- కలుగుతుంది. అంతేకాదు. అతని సాధన, తత్వచింతన, అంతఃకరణా స్వరూప దర్శనం కూడా కన్పిస్తుంది.

R.S. సుదర్శనంగారు చలంగూర్చి "జీవితం ఎందుకు అనే ప్రశ్నకు చలం యిచ్చే సమాధానం 'ఆనందానికి, సెక్స్‌ద్వారా ఆనందానికి. స్వేచ్ఛ సెక్స్‌ద్వారా కలిగే ఆనందానికి' అని మూడు అంచెలుగా ఉంటుంది" అని వ్రాశారు. కాని ఇది పాక్షిక సత్యం మాత్రమే. ఇది చలాన్ని ఒకవైపు కొలిచిన కొలత. మరోవైపు చలం — స్త్రీని అధిగమించి, ఆధ్యాత్మిక ఆనందాన్ని అనుభూతి చేసుకోగలిగే దశకి చేరుకున్నాడు—

"ఆడపిల్లనుంచి నేను పొందిన ఆనందంకన్న గొప్ప ఆనందాన్నిస్తానంటున్నారు భగవాన్. ఆ ఆనందం కోసమే నా అన్వేషణ and being a constant experi-

menter. I seek and wish to know what this new (or most ancient. happiness is" (చలం ఉత్తరాలు - Page 118) అని దీక్షితులు గారికి 1937 లో వ్రాసిన చలం—క్రమక్రమ సాధనల వల్ల — దశలు దశలుగా పరిణతి చెంది—ఒకానొక spiritual planes లో యశోదగా తారతమ్యం చెంది యశోదా గీతాలవంటి ఉదాత్త కావ్యం వ్రాశాడు విషయ గ్రహణంలోనే దానికి గొప్పతనం వచ్చింది. (చలం సుధ విన్నపాలు, నివేదన, - ఇతర కావ్యాలున్నా - విషయంలోని ఉదాత్తతవల్ల — యశోదా గీతాలు - ఆయన కావ్యాలలో తలమానికమని నా అభిప్రాయం) విషయ ఔదాత్త్యంతో పాటు చలంలో తాత్విక శక్తి - కవితాశక్తి మిళితమై ఈ కావ్యం మరింత ఉజ్వలంగా భాసిస్తున్నది.

నిజానికి ఒక కావ్యం చదివినపుడు కలిగిన అనుభూతి గూర్చి ప్రశ్నిస్తే ఒకటి రెండు మాటలకన్న అధికం చెప్పలేము. కిన్నెరసాని పాటలు చదివినా, యశోదాగీతాలు చదివినా — ఎలా ఉంది. అంటే ఏం చెప్పగలం ? మాయగా ఉంది, ఆనందంగా ఉంది, గొప్పగా ఉంది — ఇంతే. ఈ మాటలు విమర్శకాదు. ఆ మాటలన్నప్పుడు పాఠకుల ముఖంలో కనిపించిన హావభావాలు విమర్శ. ఆ ఆనందం ఎందువల్ల కలిగింది అనేది సూటిగా నిక్కచ్చిగా చెప్పలేకపోయినా - మరోసారి కావ్యాన్ని చూసి— ఆ శిల్పాన్ని చమత్కారాన్ని - తదితరమైన కాంతుల్ని చూసి - విశ్లేషించి లేదా! ఇందువల్ల ఆనందం కలిగిందేమో అనుకోవాల్సి ఉంటుంది. యశోదా గీతాలు చదివితే హృదయం అశాంతినుండి వైదొలగి కాస్సేపయినా ప్రశాంతమై కనులతోపాటు ఆర్ద్రమౌతుందని నా నమ్మకం.

"అగ్ని జల్లినా అమృతం కురిసినా అందం ఆనందం దాని (కవిత) పరమావధి" అంటాడు తిలక్. చలం పూర్వపు రచనలు అగ్నిజల్లి కూడా ఆనందం కలిగిస్తే - ఈ కావ్యం అమృతం కురిసి ఆనందం కలిగిస్తుంది. ఆ అమృతాన్ని కూడా అందాల కలశంతో అందిస్తాడు చలం.

యశోదా గీతాలలో ఎన్నో శిల్ప చమత్కారాలు కన్పిస్తవి. ఈ కావ్యంలో మొత్తం ఖండికలు పదకొండు. భక్తియొక్క భూమికలూ పదకొండే, మధుసూదన సరస్వతి తన "భక్తిరసాయనం"లో భక్తి యొక్క 11 భూమికల్ని వివరించాడు.

"ప్రథమం మహతా సేవా తద్దయా పాత్రతాతతః"............

ప్రేమ్ణోథఽపరాకాష్ఠేత్యుదితా భక్తిభూమికా... అనేవి ఆ పదకొండు. అందులో సేవ మొదటిది. దయాపాత్రత రెండోది - పరాకాష్ఠపదకొండో గుణం. ధర్మమందలి శ్రద్ధ. హరిగుణములు వినటం - తన్మగ్నత్వము — తత్స్వరూపధ్యానం - ప్రేమ వృద్ధి

భగవత్తత్వ స్ఫురణ, భగవద్ధర్మనిష్ఠా భగవద్గుణాలు పొందే అర్హతా మిగతావి. యశోదాగీతాలలో మొదటి ఖండికలో

"సేవఅంతా నాదీ ఆనందమంతా వాళ్ళదీనా అని రోషంవస్తుంది నాకు.

కాని నా మెడని కౌగిలించుకుని. ముఖమద్ది గోముచేసేప్పుడు మాత్రం ఇంక ఎవ్వరికీ చిక్కవనీ నువ్వు నా స్వంత చిన్ని కృష్ణుడవనీ అనిపిస్తుంది.

నా కోపాన్నంతా క్షణంలో కరిగిస్తావు" (ఖండిక 1. పుట 4.)

అని యశోద చేత అనిపించి –

చివరపంక్తిగా యిలా వ్రాస్తారు—

"సేవ ఆనందంకాదా వెర్రియశోదా"–అంటాడు చలం." (4–4)

ఇందులో మొదటనే భక్తి భూమికలోని మొదటిదైన 'సేవ' చెప్పబడింది. ఇలాగే మిగతా భూమికలూ స్పష్టాస్పష్టంగా అంతర్లీనమై ఉండడంగమనించవచ్చు.

ప్రతి ఖండిక చివరా ఒక విశిష్టమైన శిల్పం పాటించబడింది. ఐదవ ఖండిక చివర "ఈ ఉదయం నన్ను యశోదను చేశావా భగవాన్ అంటాడు చలం" అని చెప్పుకొన్నట్లు – అన్ని ఖండికలూ చలం యశోదతాదాత్మ్యంతో చెప్పినవే – అయితే తాను వీటిని భగవాన్ రమణ మహర్షి పాదాలముందు నివేదించుకొన్నందుచేత తాను యశోదకాగా – భగవాన్ రమణుడు భగవాన్ కృష్ణుడవుతున్నాడు. ఆ విషయం వాచ్యంచేయడు కవి. చలం తన సాధనలో తన అన్వేషణలో – అల్లరి కృష్ణుడు తల్లి యశోదకు కలుగజేసిన తబ్బిబ్బులే, పరీక్షలే మహర్షి, చలానికి కలిగిస్తున్నాడేమో నని చలం ఎన్నోచోట్ల వ్రాశాడు కృష్ణుడిలోని ఆ లక్షణం – మహర్షిలో చేరింది. ఇక్కడ వ్యంగ్యంగా రమణుడు కృష్ణస్థానీయుడైనాడు. తాను యశోదగా ఉన్నంతవరకే రమణమహర్షి కృష్ణుడు. సమాధిలోంచి తెప్పరిల్లినట్లు – ఖండికచివర చలం– తన్ను గుర్తించుకుంటాడు. తానప్పుడు భక్తుడయిన, సాధకుడయిన చలం. కృష్ణుడు – భగవాన్ రమణమహర్షి.

కృష్ణుడూ భగవానుడే – రమణమహర్షీ భగవానుడే – తాను 'చలం'గా అయేటప్పటికి – కృష్ణభగవానుడు – భగవాన్ రమణమహర్షి. ఈ విశిష్ట భావనని శిల్ప సమన్వితంగా ప్రదర్శించడానికే ప్రతిఖండిక చివరా 'భగవాన్!' అనే సంబోధనతో "అంటాడు చలం" అని ముగిస్తాడు.

కావ్యం అంతటా భక్తి పరిమళిస్తుంది. భగవంతుడు సత్ – చిత్ – ఆనంద స్వరూపుడు. భగవత్‌తత్త్వము, సత్యము, శివం, సుందరం. వీటిని చెప్పిన చలం కవిత శివమై సుందరమై వెలిసింది. కృష్ణుని ఈ లక్షణాలను పరమ సుందరంగా వర్ణించాడు చలం. బాలకృష్ణుడు సత్య స్వరూపుడు. ఎందరో గోపికలు కొండెములు చెప్పారు. ఎవరేం చెప్పినా అబద్ధమంటాడు.

"ఎవరి మాట నమ్మను? ఇందర్ని ఎట్లాకాదు పొమ్మనను?
గట్టిగా నిలేసి అడిగితే చుట్టూచూసి "నేను అబద్ధమూనూ
వీళ్ళందరూ నిజమూనా వెర్రితల్లీ!" అని నన్ను తబ్బిబ్బు చేస్తావు" (4_20)

"నే నొక్కణ్ణే నిజం ఈ అబద్ధాలన్నీ కల్పిచేంది వాళ్ళు"
అని నువ్వంటే నేనూ అట్లానే అనుకుంటాను" (ఖం. 8 పుట. 21)

ఇవి చిన్న కృష్ణుడు ఎట్లా అన్నా, భగవంతు డొక్కడే సత్యము మిగిలిన సమస్తమూ అసత్యమనే అంశాన్ని ఇంతకన్నా రమ్యంగా, ధ్వనిగరిభితంగా ఎవరు మాత్రం చెప్పగలరు? ఆ సత్య స్వరూపుడైన భగవంతుడు తనచుట్టూ ఇంద్రజాలాన్ని కల్పించుకుంటాడు —

"నే నే గోవులు, నే నే గోపికలు, నే నే నీ తులశమ్మ
నాకన్న వేరేముంది! అని ధిక్కరిస్తావు" (ఖం. 2 పుట. 6)

"నాకన్న నీకు దైవమెవరు?
నీ కెందు కీ పూజలన్నీ" (ఖం. 8 పుట. 21)

ఏమీ తెలియని బాలకృష్ణు డన్నట్లా ఈ మాటలు. చిన్మూర్తియైన పరమేశ్వరు డన్నట్లా

మరి దైవానికి యింత చిలిపితనమేమంటే అది అతని లీల.

కృష్ణయ్య ఆనందం ఆకారం పొందిననాడు, ఆతని సమాగమానుభూతిని పొందిన గోపికలు అందుకే "ఆనంద పారవశ్యలౌతారు."

"నీ ఆనందమూ నీ విరహమూ రెంటినీ భరించలేకుండా చేస్తుంది నీ సుందర తేజస్సు" (ఖం. 2 పుట. 6)

"ఈ విశ్వ సౌందర్య రహస్యాన్ని వెతికి వెతికి నా వాళ్ళోకి లాక్కునానా నీ రూపాన..." – (6_17)

ఇలా అనేక సందర్భాల్లో భగవతత్త్వముయొక్క సత్యం – శివం – సుందరమైన మాటలు వర్ణించినట్లుండదు. కృష్ణుడి అల్లరి చేష్టలే చెబుతున్నట్లుంటుంది.

భాగవతంలో, విష్ణుపురాణంలో, హరివంశంలో ఉన్న కృష్ణునికంటె చలం తీర్చిన కృష్ణపాత్ర కొన్నిచోట్ల భిన్నంగా, ఉదాత్తంగా ఉంది.

గోపికలతో విహరించిన కృష్ణుడు పై మూడు గ్రంథాలలోనూ వర్ణించిన ప్రకారంచూస్తే యువకుడు.

"తన నవయౌవనంబును నుదగ్రపు దర్పము శారదాగమం
బున దిన రాత్రులంగల ప్రభూత సుఖోచిత రమ్యభంగులన్
గను గొని కామ భోగముల గ్రోలుటకై మది నిచ్చగించి య
వ్వన మహాలోచనుండు గరువంబగు చోద్యపు నిశ్చయంబునన్"

(విష్ణు పురాణము - వెన్నెలకంటి సూరన)

అని గోపిలను మాయావరితలగా చేశాడు-తన వేణుగానంతో, యశోదా గీతాల కృష్ణుడు బాలకృష్ణుడే. ఆ చిన్న కృష్ణుడే వెన్నెలలో బృందావనంలో — యమునా తరంగాలనుంచివచ్చే చల్లనిగాలిలో అర్ధరాత్రి అందరు గోపిలకు ఒక్కడై చిక్కక మాయమై ఒకమూలపాడి, ఒకమూల నవ్వి, ఒకచోట చిక్కినట్టుచిక్కి, ఒక వేపుపిలచి నట్లు పిలిచి ఒకవేపు పిలిచి అందరికి అందరూ ఐ వాళ్ళ మనోహరులై లీలలు చేసినట్టు కలలు కంటారు.

కాని వాళ్ళ కళ్ళల్లో అందం, సంతోషం, తన్మయత్వం తొణికిసలాడుతవి.

వాళ్లు యశోదవద్దకు వచ్చి కృష్ణుడికై చూసినపుడు వాళ్ళ కళ్ళల్లో మనిషికాదు, బాలుడుకాడు—

"జీవన శృంగారం"క నిపిస్తుందట.

ఎంత గొప్పగా అన్నాడు చలం! ఈ మాటని. అక్కడ గోపికల దృష్టిలో యువకుడు — బాలుడు — మనిషి — ఈ దృష్టేలేదు.

వాళ్ళది కలే కావచ్చు - వాళ్లుపొందింది అలౌకికమయిన అనుభూతిని. వాళ్ళు
"వెన్నెలకి మెరుగునిచ్చే వెలుగుని,
గాలికి మనుష్పునిచ్చే మార్దవాన్ని
పరిమళానికి మాధుర్యాన్నిచ్చే మమతని
హృదయానికి తృప్తినిచ్చే ఐక్యతనీ అనుభవించారనిపిస్తుంది."

తెల్లారి పరిగెత్తుకని వాళ్లు కృష్ణునికి మేల్కొల్పులు పాడటానికి వచ్చి రాత్రి అనుభవానికి సిగ్గుపడుతూ పలకరించబోతారు? అప్పుడు

"కాని నీకేం తెలుసు.
రాత్రంతా రొమ్ముని కావలించుకుని పడుకున్న పసివాడివి నీకేం తెలుసు?
తెల్లబోయి చూస్తావు

కలగానీ. వా స్తవంగానీ–

ఎంత ధన్యత వాళ్ళ చూపుల్లో" అంటుంది యశోద.

యువకుడైన కృష్ణుడు రాసక్రీడా విహారం చేశాడన్నప్పటికంటెబాల కృష్ణుడే వారికి కలల్లో– జీవన శృంగారాన్ని – అనుభూతిని కలిగించాడు. చెప్పడం ఉదాత్తంగాను, రమ్యతరంగానూ ఉంది. అట్టి గోపికలమీద ఈర్ష్యలేదు యశోదకు. వాళ్ళ ధన్యత్వాన్నిచూసి తాను హర్షిస్తుంది. గోపికల సంగతటుంచి—

"తన స్తన్యమేకాదు తన రక్తం తన ప్రాణం తన ద్వేషం
నీ (కృష్ణుని) ఒక్క గుక్కకి సమర్పించిన పూతన ఎంత ధన్యురాలా

అనిపిస్తుంది" (7 - 18) యశోదకు. అంత హృదయం ఆమెది. తానూ తన సర్వస్వాన్ని అర్పించవలసిన మహనీయ భక్తురాలు. కృష్ణుడు తప్ప మరొకరులేరు–

"నీకోసమె నాకోపం నాకన్నీరు–
నువ్వే నాగర్వం– నువ్వే నానిరాశ !
నీకోసమే ఈ గోవులు– నీకోసమే ఈ యశోద
నీకోసమె ఈ ఉదయాలు అస్తమయాలు"–

కృష్ణుడామె సర్వస్వం. కృష్ణుడు సాక్షాత్తు పరమేశ్వరుడని వాచ్యంగా చెప్పడమూ ఉన్నా, ధ్వనిగా చెప్పిన సందర్భాలు కావ్యానికి– ప్రాణం పోస్తున్నవి–

"ఈనాడు ఎదిగావులే
ప్రపంచమంతా నువ్వే ఐనావులే

ప్రతివాళ్ళ హృదయాల్నీ లాగావులే"–అన్న యశోదమాటల్లో– (—4—11)
కృష్ణుడి రాకకై చూసిచూసి వేసారగా– ఎలాగో లోపలికి చేరుకున్నకృష్ణుడు–
"అంత సేపూ లోపలే వున్నాను. నువు చూడలేదంటూ" (5–14) అన్నప్పుడూ

'నాకన్న నీకు దైవమెవరు?
నీకెందుకీ పూజలన్నీ'– 8–21 అన్నప్పుడూ

ఇలా ఎన్నోచోట్ల కృష్ణుడు భగవదవతారమనే అంశాల్ని వ్యంగ్యంగా సూచించడం జరిగింది.

ఇట్లావస్తు ఉదాత్తతతో–యశోద, కృష్ణుడు, గోపికలు, ఈపాత్రల చిత్రణలోని ఔచిత్యంతో– వ్యంగ్య వైభవంతో– వెలసిన ఈ కావ్యంలో– భావానికి, సందర్భానికి తగిన– శైలితో భాషతో– మరింత రమ్యంగా భాసిస్తున్నది.

చలం కవితా రచనల్లో శిల్పరీత్యా 'సుధ' కొంచెం జిగికల్గిందని చెప్పవ
అని యశోదా గీతాలలో భావంలో రమ్యత్వమే మనల్ని ఎక్కువగా ఆకర్షిస్తే
అయితే చలానికి సహజమైన శైలిలో ఉజ్జ్వలశక్తి- గమనం- ఇందులోనూ ఉంది.

"ఫో! వెళ్లు! కనపడకు! ఆడు! అల్లరిచెయ్యకు!
గోవులు దుమ్మె చిమ్మితే! పిల్లలు గాయాలుచేస్తే!
గోపికలు నలిపిపెడితే!
అలసి సొమ్మసిలి
నాకోసం వెతుక్కుంటూ ఎట్లానూ వస్తావు!"

ఈ సహజమైన భావప్రకటనలో శక్తి ఏ ఛందస్సులోనో ఇరికిస్తే అందమంత
చెడిపోయేదే. ఇలాగా భావానుగుణ్యంగా శైలీవిన్యాసం మారి కవితకు నూతన శోభ
గూర్చుతుంది—

"వెన్నెలకి మెఱుగునిచ్చే- వెలుగుని
గాలికి నునుపునిచ్చే మార్దవాన్ని
పరిమళానికి మాధుర్యాన్నిచ్చే మమతని
హృదయానికి తృప్తినిచ్చే ఐక్యతనీ..."

వెన్నెల- గాలి- పరిమళం- హృదయాలు- ఇవి నాలుగు-
మెరుగు- నునుపు- మాధుర్యం- తృప్తి-

పై నాలుగింటికి ఇవి గుణాలు- వానినుండి వీనిని వేరుచెయ్యరాదు- అయి
వాటివాటికి స్వభావాల నిచ్చిందెవరు- క్రమంగా వెలుగు, మార్దవం, మమత, ఐక్యత
ఈ వాక్యాల్లోని సమత- సమతను సాధించడంలోని ఔచిత్యం, ఇక్కడ గుర్తించ
హృదయాలకి తృప్తినిచ్చే ఐక్యతలాగా- అంతకు ముందు మూడు వాక్యా
ఉపగుణాలుగా భాసించి వన్నెవస్తుంది- అంతేకాదు మరో ఔచిత్యముంది. శ్రీకృ
డిక్కడ- మనిషి- బాలుడు- ఏదీకాదు- ఒక దివ్యతేజస్సు- (వెలుగు), మార్దవ
మమత- ఈ మూడింటి యొక్క- సమాహారరూపం- అన్నమాట. అట్టి కృష్ణు
మాత్రమే వారిహృదయాలకు తృప్తినివ్వగలడు! అక్కడి వాతావరణాన్ని వర్ణించిన
ఉపమించినట్లూ- దివ్యకృష్ణ రూపాన్ని ధ్వనిగర్భితంగా వర్ణించినట్లూ- ఆలోచిం
వారికి ఇన్నివిధాలుగా ఇందలి శిల్పం ఆశ్చర్యం కల్గిస్తుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే యశోదా గీతాలలో చెప్పిన భావం చెప్పడాని
భాగవతం, హరివంశం, విష్ణుపురాణాలలో చాలాభాగం వ్రాయబడింది—

# చలం ఉత్తరం

[ఉత్తరాలు రాస్తే జవాబివ్వకుండా ఉండలేని చాల కొద్దిమందిలో చలం ఒకరు. రాసిన వాటికి ఊరూ, పేరూ లేకున్నా రాసినవాడి ఊరూ పేరూ తెలియకున్నా వెంటనే జవాబు రాయడం ఆయన స్వభావం. అయితే అవి మామూలు మర్యాదకోసమో, గొప్పకోసమో, మొక్కుబడి తీర్చుకోవడంగానో, అచ్చవుతాయనో కాదు. రాసినవాడు ఎంత సిన్సియర్‌గా రాస్తే జవాబు అంత స్పందనతో ఉంటుంది. రాసినవాడు ఏమీ కదిలించలేకపోతే మీరు నన్ను జవాబు రాయడానికి కదిలించలేకపోయారు అనయినా రాస్తారు. తెలుగులో అరుదయిన లేఖాసాహిత్యాన్ని అపూర్వంగా సృష్టించిన ఘనత చలం కలానిదే. దీక్షితులుకు ఆయన రాసిన ఉత్తరాలు ఆయన జీవిత క్రమ పరిణామాన్ని, సమరాన్ని చక్కగా నిరూపిస్తాయి. ఆయన సంజీవదేవ్‌కు రాసిన అముద్రిత లేఖను క్రింద ప్రచురిస్తున్నాము.

— సంపాదకుడు.]

9-3-58

జీవదేవ్ గారికి,

మీ ఉత్తరం. చూచారా, మిత్రులు !

"ఇంతవరకూ నేను......" అనే మీ చివరి పేరాని చలంపట్ల apply చేసి, తిప్పి రాస్తున్నాను. దాంతో humourకూడా తీసుకోండి.

"ఇంతవరకూ నేను (చలం) వ్రాయాలనుకున్నది వ్రాయలేకపోయాను జీవితంలో. చేయాలనుకున్నది చేయలేకపోయాను. ఆలోచించకుండా వుండాలను...వి ఆలోచించకుండా ఇంకా పూర్తిగా వుండలేకపోతున్నాను. అనుభూతి చెంద...దా వుండాలనుకున్నవి ఇంకా పూర్తిగా అనుభూతి చెందకుండా వుండలేక...కున్నాను. భూతకాలం, భవిష్యత్‌కాలం వర్తమానానికి గీటురాళ్లు కావు గనుక ...వరకూ రాయజాలనివి ఇక ముందు, రాయలేను, రాయను, చేయజాలనివి చేయను, ...చించలేను అనే నా ఆశావాదం."

నా స్థితి రాశాను. అంతే పైదానికి ఉద్దేశ్యం.

మీ "Aesthetic Vision" అనేది చదివేను. ఎంతో స్పష్టంగా, విపులంగా, ...గా, ఎట్లా చెప్పాలో ఆ విధంగా, కళ అంతరార్థాన్నీ, పరమార్థాన్నీ ...కరించారు,

మీ last but one పేరా విషయమై నాకు సందేహం కలిగిం నని సం
వుంది. ఎందుకంటే మీకు రాయడానికి నాకో విషయం దొరికిందని.

"Artists are made" అనేది నిర్ధారణ చేశారా? నాకు నమ్మ
కాకుండా వుంది. It is said of Mathew Arnold that he trained hir
to be a poet. కాని అతన్ని born poets తో సరితూచగలమా?

Psycholooy లో advanced researchesఅనే వాటిలో మీకింకా అను
వుందా?

నేనిన్నాళ్లూ అనుకునేది, taste ని create చేయగలం, but not the artis
అని, మీ ప్రకారం, ఒక షేక్స్పియర్ని, బీతొవెన్ని, అవనీంద్రనాథ టాగూర్ని
సృష్టించగలమనా? ఏమన్నా చేసి చూపేరా అట్లా? లేక అదొక psychologica
theory యా?

What one man has done, another can do అనే Carlyle
గాంధీగార్ల సిద్ధాంతాన్ని నేనంగీకరించలేకపోయినాను— చివరకు moral plane
కూడా గాంధీగారి ననుకరించి అనేక moral prigs తయారైనారు.

ఇంక మీ చివరి పేరా: దాన్ని మీరు ఇంకా amplify చేస్తేనేగాని సరి
బోధపడదు. దాన్ని మీరొక poetic flash కింద రాస్తేసరే; కాని exorctitud
కావాలంటే అర్థం విశదీకరించాలి. గొప్ప కళాదృష్టి కలవాడు వృత్తభీరు
వచ్చు ఉరుము వినేటప్పటికి, అతను ఆ రాత్రి అందంలో తన్మయుడై తన భయాన్ని
మరిస్తేనే తప్ప.

అట్లానే చావుసంగతి. చావుకు భయపడని కొద్దిమందీ అనేక కారణాలు లేక
పోవడంవల్లా, నిర్భయులు కావచ్చు. కాని కళాదృష్టిలో చావునుచూచి భయపడక
పోవడం— ఇప్పుడు మనం గొప్ప artists అని అనాదినుంచి నిలిచిన పేర్లవారు
చావునిచూసి ప్రత్యేకంగా భయాన్నుంచి విముక్తి పొందినట్లు వినలేదు. కేవలం
ideal artist విషయంలో మీరు చెప్పేది నిజమవుతుంది.

నేను మిమ్మల్ని విమర్శించే దృష్టితో రాయటం లేదు ఇది. నాకు కళను గురించి,
ముఖ్యంగా చిత్రకళను గురించి చాలా తక్కువ తెలుసు. వీటిని గురించి నేనేమీ
ఎక్కువ చదవలేదు. చదివింది అర్థం కాలేదు: అర్థమయిందను కున్నది వంటపట్టలేదు.
నేను మీనుంచి తెలుసుకోవాలని అడుగుతున్నాను. అంతకన్నా ముఖ్యం మీకు
రాయడానికి ఓ విషయం దొరికింది కదా అనే సంతోషం.

మీ
చలం.

P. S.
ఆధ్యాత్మిక విద్యకూడా
అంతే.

దైవమిచ్చిన భార్య
( నవల )
వెలువడినాయి
చలంగారి ఇతర రచనలకు ఈ క్రింది చిరునామాకి వ్రాయండి.

ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్-ఆం. ప్ర.

---

చైతన్య భారతి
కవితల కదంబం

యువ రచయితల నవ కవితల సంకలనం
వెల : రూపాయిన్నర
ప్రతులకు
M/s. ప్రగతి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3-4-219, లింగంపల్లి,
హైదరాబాదు—27.

# చలినాగ్ని

ఉ
ం
ది

ప్రతులకు

వెల : రు. 2/-

1 నెల్లూట్ల సంజీవరావు, స్వేచ్ఛా సాహితి
6-551-3, బ్రాహ్మణవీధి, వరంగల్.

2 పార్వతీ ప్రింటింగ్ ప్రెస్. జడ్చర్ల, మహబూబునగర్ జిల్లా.

---


నేడేకొనండి చదవండి

సాహితీప్రియ
సచిత్ర మాస పత్రిక

ప్రతి కుటుంబం కొని చదివి తీరవలసిన పత్రిక

ప్రతి గ్రంథాలయం స్వీకరించదగిన పత్రిక

నేడే కొనండి చదవండి

మీ అమూల్యాభిప్రాయం తెలుపండి

వివరాలకు : సాహితీప్రియ, అనంతపురం-2.

బెజవాడ
3_3_1946

My darling Nan,

నీ వుత్తరం అందింది.

నీకు యెప్పటినించో రాయాలని "Among the great" Aurobindo దగ్గిరికి వొచ్చాను. వాళ్ళందరిలోనూ, నువ్వు కనపడతావు. Rolland art discussion లో. గాంధీ Jokes లో. ఆయన personality లో మరీనూ. Bertrand Russel scientific outlook లో, reformation లో, Tagore 'woman'లో. యింకా Sri Aurobindo లో నీ పోలిక కనపడటంలేదు. కానీ వీళ్ళకీ నీకూ పెద్ద భేదం_ వాళ్ళు యే plane కి యెంత వరకు reach అయితే అక్కడ సావకాశంగా ప్రతిదీ పరిశీలించి, వాటిల్లో good and bad, truth and falsehood తెలుసుకుని masters అయినారు. నువ్వు వేసే ప్రతి అడుగూ doubt అనిశ్చయం. అస్థిరం. నీ progress అంతా ఒక పరుగు. "ఇది చాల అందంగా సత్యంగా కనపడుతోంది. కాని, యిది కాదు యింకా ముందుకు పోవాలి. యింకా వెతకాలి" అనే ఆందోళనా. వెళ్ళలేనే అనే అసహాయత్వం, restlessness, కొట్టుకోవడం. కనపడతాయి. నీ రాతల్లో నీలో కూడా. కానీ ఈ great men అందరి కన్నా నీది చాల rapid progress. అందుకనే అంత painful, అంత struggle, misery, అంత fiery, passion. అందుకోవాలనీ ముందుకు పోవాలనీ. నాతో రండి అంటావు నువ్వు. వాళ్ళు_"ఇంతవరకు ముందుకు పోయినాం. మమ్మల్ని కలుసుకోండి" అంటారు.

— సౌరిస్